

గ్రంథకర్త :
శ్రీ శ్రియానందనాథాపరనామధేయ
ఈశ్వర సత్యనారాయణ శర్మ

శ్రీమాత్రే నమః

# మనవి

ఉపనిషన్నిహిత సర్వరత్న గ్రథిత హారమును, ఆధ్యాత్మిక రహస్య ప్రకాశక ప్రదీపశిఖయునైన శ్రీ గీతయొక్క గౌరవము, శ్రేష్ఠత, తత్త్వము, వికాసము, యోగము, యోగ సాధనము, యోగసిద్ధిమార్గము, మున్నగువాని సమగ్రవర్ణనము "శాస్త్ర సాధన" మనెడి నా గ్రంథమందు యథాశక్తిగా వర్ణింపఁ బడినది. (తెనాలి - సాధన గ్రంథమండలి యందు లభించును.)

మాయా - భ్రాంతి - బంధనము - ముక్తి మున్నగు వాని తత్త్వము నా "శ్రీ సత్యనారాయణ శర్మసాధన" మనెడి రచనమునఁ గానఁగలరు. అదియును పైని సూచించిన సంస్థ యందే లభించును. "సోఽహం సమాధి" యను కూర్పునుం దప్పక చదువునపుడు, ఈ "రాజవిద్యా గీత" యందలి విష యము సుఖతరముగా హృదయంగమ మగుటే కాక, సాధన సంశయము లెన్నో విడిపోవును.

జన్మమృత్యువులు, నానాయోని భ్రమణము, అనునవి - యనంత యుగములనుండి విశ్వవిశ్వములకుఁ బరుగెత్తు శ్రమము అనునవి యోగసాధన మాత్రములే; ఈ సృష్టి యోగసాధన మందిరముగాక మఱేమియుంగాదు. ప్రత్యణు పరమాణువు నైతము యోగసాధకుఁడే, విరాడ్విజ్ఞానమయ పురుషుఁడు దీని దేవత. యోగమనగా - ఆ పురుషునందుఁ జేరుటే - అనఁగా నిత్యయుక్తత ననుభవించుటే. ఆ పురుషోత్తముని శక్తి

తాండవమందలి తాళతాళములు ననుసరించి తిరుగుచు, నాత నికిఁ బ్రదక్షిణించుచు నాతని యంకమందుఁ జేరిపోవుటకే, ఏకత్వము నొందుటకే, యతని కనుసన్నలచేత, ఆకర్షణముచేత నీటి వెల్లువను గడ్డిపోచలవలె నతనివంకకే నడిచి పోవుచున్నాము; లేచుచున్నాము; పడుచున్నాము; చేరుచున్నాము; వీడుచున్నాము.

ఒకప్పుడు హర్షముతో, ఒకప్పుడు విషాదముతో, ఇంకొకపుడు స్మృతితో, వేఱొకప్పుడు విస్మృతితో, స్వప్న జాగరములందు జరుగుచున్నాము. సుషుప్తియందు, వికాసమందు స్థితియందు, లయమందు, నిట్టి భావములతోనే జీవమండలి సాగుచున్నది. విరామములేదు; విశ్రాన్తిలేదు. ఇమ్మహాయోగమున కవసానము కానఁబడదు. దీనిపేరే యోగ సాధనము.

మనుష్యజన్మ మీయోగావస్థకుఁ దుదిహద్దు. మనుష్యుఁడై పుట్టి యీ విరాడ్యోగేశ్వరుని యాకర్షణము ననుభవించువాఁడు; ఇమ్మానవత్వము నపేక్షింపని కారణమున, భగవంతుని సందిట బద్ధుఁడగుటకే యేడ్వనారంభించును. ఈ విషాదమే యోగ ప్రథమ సూచనము - యోగజ్ఞాన ప్రథమ వికాసము.

ఈ స్థలమునుండి యే యే భావములతో భగవంతుఁడు జీవుల నాకర్షించునో దానినే యోగమందురు. ఈ యోగము రెండువైపుల నుండియు సాగుచుండును. ఒక వైపునుండి ప్రవృత్తియు, ఒక వైపునుండి యనుగ్రహము! కాఁగా నది

రొకనాఁడు, ఆజగన్మాత యొడిలోఁ జేరి యామె స్తన్యధారల పోషణము నొందుచు నందే నిదురింతుము. అపుడు లేపి చేయిచ్చి, నడువనేర్పుట, అక్కడనుండి యనంత భండారముఁ జూపుచు, మధురముగాఁ బలుకుచుఁ బలికించుచు, నేమి చెప్పనో యేమి చేయించునో యదే గీత. భగవత్ప్రాప్తికొఱకు విషాదభావము మొదలు సంయుక్తభావమువఱకు నైనదే గీత. విషాదముతో నారంభించి జీవుఁ డేభావముతో నడుచునో, నడువవలయునో యదే గీతలోఁ బ్రత్యేకయోగమను పేరఁ జెప్పఁబడినది. మధురముగా భగవంతుఁడు గానముచేసిన పదు నెన్మిది యోగములును బైని జెప్పిన విరాడ్యోగమున కంగములే, అది యుండనిండు.

శ్రీ గీతయందలి తొమ్మిదవయోగము తక్కఁ దక్కిన వన్నియు విషాద, సాంఖ్య, కర్మ, భక్తి, జ్ఞాన, ధ్యానాది తద్గత విషయ ప్రాధాన్యముచే సార్థకాఖ్యములు. కాఁగా, "జ్ఞానం విజ్ఞానసహితం ప్రవక్ష్యా మ్యనసూయవే" అను శ్రీ గురుని ప్రతిజ్ఞనుబట్టి 'విజ్ఞాన (సాధన) సహితజ్ఞాన' మనక 'రాజవిద్యా రాజగుహ్య' యోగమని సంభావింపఁబడెను.

శ్రీ గీతా గ్రంథానుశీలనమునకుఁ గడఁగిన యీ పూర్వ వయస్సునందే యీ పేరు నన్నాకర్షించినది.

శ్రీ మద్రామాయణ భాగములు కాండసంజ్ఞితములు, శ్రీరాముని వయోఽవస్థను, స్థితిగతులను, కార్యములను బట్టి బాలకాండాది నామములతో నొప్పినను, పంచమకాండము సుందరపద విశేషణ పూర్వముగా నుండుటచే నందలి

యపూర్వవిశిష్టతయెడ జిజ్ఞాస కలుగక పోనదు. ఇందే వాల్మీకి కవిత సుందరము. నానావిధ వృత్తసంపద, చిత్రవిచిత్ర ధాత్వాది రూపప్రయోగములు, సరస సమాస సంధి యోగములు, మధురవాక్య గుంఫనములు, శబ్దార్థాలంకార ఘటనములు, నిందే నిండియున్నవి మఱి రాముఁడు పరాత్పరుఁడు, ప్రతిజ్ఞాత ధర్మసంస్థాపనార్థము, అధర్మ వినాశార్థము తన సంహారశక్తి ప్రదర్శనముఁ జేయుటకే యవతరించెను. భగవంతుని సంహారశక్తి పేరే రుద్రుఁడు; కార్యకారియైన యా సంహారశక్తిని బ్రదర్శించినవాఁడు హనుమంతుఁడు, ఏకపాద రుద్రావతారము. లంకలో సీతనుజూచి రాఁగా నే "రామా! కర్తవ్య మల్పమాత్రావశిష్టము; సంహారక్రియ నీ కృపచే ముప్పాలు నెఱవేఱినది. రావణు పదితలలపాటు నీ చేతిది, అదే మిగులు" అనెను. అతఁడు తన సంహారశక్తి ప్రదర్శనమునకై సముద్రలంఘనముతో గణేశపూజచేసెను. అది గోత్ర రుద్రావతారుఁడు, అణిమాద్యష్ట సిద్ధులను బ్రదర్శించుటచేతను, సీతారాముల పరస్పర క్షేమవార్తలనుదెలిపి నిరాశములైన వారి చిత్తములను సాశములుగాఁ జేయుటచేతను, సుందరము. శ్రీమద్రామాయణము చతుర్వింశతి సహస్ర శ్లోకాత్మకము. గాయత్రీ మంత్రాక్షరము లిరువదినాలుగు, నా యిరువదినాలుగు వేల కావ్యక్షరములుగా నుంటచేత నది మంత్రశాస్త్రమని ప్రసిద్ధమందును. అంతేకాదు. పరికింపఁగా రామాయణమంతంతటను మంత్ర శాస్త్ర మల్లుకొనియున్నది. అది విశేషించి యీ సుందరకాండమందే, మంత్ర శాస్త్రజ్ఞులు సాక్షాత్కరించుకొనఁగలరు. రామాయణము "సీతాయాశ్చరితం మహత్"

అనియే పేర్కొనఁబడినది. సకార, ఈకార, తకార, ఆకారముల వర్ణక్రమముచే సీతా శబ్దమైనది. సకారము బ్రహ్మవాచకము, ఈకారము శక్తివాచకము (లక్ష్మీవాచకము) ఇదే కామ కలాబీజము; సృష్టికామమునొందిన బ్రహ్మముయొక్క కళ (శ్రేష్ఠశక్తి); తకారము జగద్వాచకము; ఆకారము హంతృ (సంహారశక్తి) వాచకము కాఁగా 'సీత' యనఁగా - జగత్సృష్టి సంహారములుచేయు పరబ్రహ్మశక్తి, ఆ పరాశక్తి మంత్రములు బాలా భువనేశ్వర్యాదులును, వారుణాగ్నేయాది మంత్రములు, నెన్నోయయ్యెయి సందర్భములందు నిగూఢముగా నున్నవాని తద్జ్ఞులుద్ధరించి యానందించుచున్నారు. ఆ కాండమందిట్టి సౌందర్యము లనేకములుండుటచేతనే, ఆస్తికులు శోకవ్యాధి దారిద్ర్య రాజపీడాదులు సంభవించినపుడు, శాన్తిక్రియగా సుందరకాండ పారాయణము నుపదేశింతురు. పై కారణముల చేతనే సుందరకాండ నామము సార్థకము,

అటులే - ఈ గీతా నవమాధ్యాయమునందు శ్రీ గురు ప్రతిజ్ఞ ననుసరించి సాధనము సర్వమనోహరముగా గుహ్యముగా నున్నది. ఇందు సాధనవిశిష్టాధికారి లక్షణములతో నారంభించి, దాని పవిత్రతను, సౌలభ్యమును, ఉత్తమత్వమును దాని వలని ఫలమును, భగవంతుఁడే యుగ్గడించెను, స్వరూపనిరూపణము కరతలామలకము. ఆత్మయొక్క వ్యక్తావ్యక్త మూర్తిత్వమును, శిష్యబుద్ధిని అతిసూక్ష్మమైన యాత్మస్వరూపము వలనికి లాగుటకైన శ్రీ గురుని ప్రయత్నము, సపూర్వముగా వర్ణితము. "నేను - ఎవరు ?" అనుదాని బోధమెంత మనోహర

ముగాఁ జేయఁబడినదో యది వర్ణనాతీతము. ఆత్మసత్తాబోధ మత్యద్భుతము. సృష్టితత్త్వము, జీవప్రకృతి యీశ్వర ప్రకృతిగా ననుభూతమగుటయు సర్వజ్ఞుఁడెంత చాతురితో బోధించెనో యిందే చూడఁదగినది. సాధారణ పాఠకుల హృదయములను సంకీర్ణములుగాఁజేయు వేదాన్త పారిభాషికముల యాథార్థ్యము లను శిష్యప్రశ్నము లేకయే ప్రకాశింపఁ జేసిన శ్రీగురుఁడు సాధకజీవులకు నిత్యవంద్యుఁడు. సాధకుఁడు మోఘాశుఁడు, మోఘకర్ముఁడు, మోఘజ్ఞాని యగు కారణములను దెలిపి, యటుకాకుండు నుపాయములను దెల్పిన పట్టు, వీడరానిది. జ్ఞానోపదేశము మున్నే యిచ్చినను జీవుని యహంకారమును జంప శరణాగతి (ప్రణామము) మించిన సాధనము లేదని చేసిన సాధన బోధ మసమానము. సాధకుఁడు, సాధ్యము, సాధనము, నను వాని యభిన్నతను, దన కేవలత్వము, సకామ నిష్కామ కర్మములందు గతులు, విద్యావిద్యాస్వరూపము, త్రైవిద్యాను ప్రపత్తివలని ఫలము, తన యభయవాక్కులు వినిచి, నిత్యాభి యుక్తిలక్షణము, తత్ఫలము, పూజాభక్తిమయత్వము, దాని 'మదర్పణము', దాని తత్త్వము, కర్మబంధక్షయము, జీవభావ విముక్తి, పరమసుఖప్రాప్తి యనునవే జ్ఞానఫలములని చెప్పి, యుపసంహరించుచు, భక్తిభజన స్వరూపమును మఱలఁదెల్పి సమ్యగ్వ్యవసాయమును నిరూపించి, సర్వప్రధానమైన యాశా వాణిని దన శ్రీముఖముననే వెలువరించి, తన భక్తునకుఁ బ్రణాశము (నాకన్నులకు వెలియై యుండుట) ఎన్నఁడు నుండ దని ధీరతఁగొల్పి యుపసంహరించెను. ఇంత సరకు ముప్పది నాలుగు శ్లోకమంత్రములలో నిమిడ్చిన శ్రీగురుఁడే గురురాజు.

అతఁడే గుహ్య (గుహాయాం నిహితః గుహ్యః) గురురాజు. అతఁడుపదేశించినదే రాజవిద్య - అదే పరమగుహ్యము. విద్యాశ్రేష్ఠము, గుహ్యశ్రేష్ఠము.

గీత యందలి యీ భాగమే నాకభిమతతరము. కనుకను, పునః పునరనుశీలిత మగుటను, గీతాభిమానము గల నా వారికి దీని యందలి సాధన సంపత్తినే బోధించుచుందును. జిజ్ఞాసు సాధకులు కోరినందున యథాశక్తిగాఁ జేసిన వ్యాఖ్యానము నందలి దోషములను జూపఁ గరుణించు సాధక పండితులకుఁ గృతజ్ఞుఁడనై సవరించుకొందును.

దీని ముద్రణభారము నయాచితముగాఁ బైఁబెట్టుకొనిన నా ప్రియశిష్యులు శ్రీ మట్టిపాటి వెంకట నరసింహారావు పంతులు, వీరి యౌదార్యము సహజము. శ్రీ సత్యనారాయణ శర్మ సాధనము, మహాసౌరమంత్ర పాఠానువాదము (ద్వితీయ ముద్రణమును) ప్రకాశింపఁజేసి, దానికి వెలపెట్టి, యీ వచ్చు బడిని సతీర్థయు సహోదరీ నిర్విశేషయు, (అనంతపురం జిల్లా, తాడపత్రి నివాసినియు) నగు శ్రీమతి రావులూరి సరోజమ్మ గారికి ముట్టఁజేసిరి. ఇపుడు దీని ముద్రణ వ్యయమును భరించి, తగు వెలవేసి యీ రాఁబడిని సాధన గ్రంథమండలి సంస్థాపకులు శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి గారికిఁ జేర్చుచున్నారు. శ్రీ పంతులుగారి సహజౌదార్యము, నిఃస్వార్థత, ఆస్తికబుద్ధి, పండితపక్షము, గురుభక్తి, దేశసేవారతి, మున్నగు నసాధారణ గుణ సంపత్తికి గుర్తులుగా నివి చాలవా? సద్గ్రంథ రచయితకగు ఫలముకంటెఁ దద్గ్రంథ ప్రకాశకుఁడే యధిక ఫలపాత్రుఁడని

యెఱింగిన దైవీసంపద్విశిష్టుఁడు, ఇర్వదియేండ్లయి ఫలాహారి గానేయుండి, ఆత్మానుసంధానసుధాపరిపుష్టశరీరిమై, శ్లాఘనీయారోగ్యవంతుఁడై, సార్థక నరసింహ నాముఁడైన యిమ్మహాశయుని బాలకలోక మెట్లాశీర్వదింపఁగలదో, తదుపాస్య శ్రీ మహా త్రిపురసుందరికే యెఱుక.

శ్రీ మాత్రంకమందు శాశ్వతస్థితి భాగ్యమును సంపాదించి కొన్న వీరి యర్ధాంగి గుణగణ తత్త్వమును 'మహాసార మంత్ర పాఠాను వాదము' నందు యథాశక్తి వర్ణించితిని. ఆ గ్రంథము ఆమె స్మారికగా వెలువడినది. ఇదియు సతీధర్మ సంపాదినియు నాధ్యాత్మిక జ్ఞాన విశిష్టయునై మనిన యామె స్మారికగానే వెలువడుచున్నది.

ఈ తరువాయిని - శ్రీ పంతులుగారు వ్రాసిన "కమలా స్మరణము - అంతఃశ్రవణము" - అను శీర్షిక నొప్పు గ్రంథ మును సద్భక్తిమైఁ జదువు చదువరు లాయుత్తమ దంపతులను సాధకాదర్శప్రాయులని గుర్తించి యభినందింపక పోరని నా విశ్వాసము.

| | |
|---|---|
| శ్రీకాకుళము | ఇట్లు, రచయిత |
| 3—10—1961 | శ్రీ శ్రియానందనాథుఁడు |
| ప్లవ. సం॥ భాద్రపద బ ౧౧ | ఈశ్వర సత్యనారాయణశర్మ. |
| గురువారము. | |



శ్రీ మష్త్రిపాటి వెంకట నరసింహారావుగారి సతీమణి

కీ. శే. కమలాంబ

శ్రీ మాత్రే నమః

## కమలా స్మరణము - అంతఃశ్రవణము.

"భవానిత్వం దాసే మయి వితర దృష్టిం సకరుణా
మితిస్తోతుం వాంఛన్ కథయతి భవాని త్వమితి యః,
తదైవ త్వం తస్మై దిశసి నిజసాయుజ్యపదవీం
ముకుందబ్రహ్మేంద్రస్ఫుటమకుటనీరాజితపదామ్ ॥సౌ॥ లహరి

అది విళంబినామసం॥ కార్తిక బహుళైకాదశీ స్థిర వారము తురీయ యామము, సుమారు నాలుగు గంటలవేళ, అమ్మా! రాజేశ్వరీ! అను శ్రీమాతృ దివ్యనామ స్మరణముతో మేల్కాంచితివి.

"జననీ! నీ కరుణా కటాక్షముల నీ నీ బిడ్డపైఁ బఱపి యనాయాసముగా నీయొడిని జేర్చికొనుమా." అని మాతృ స్నేహాభిలాషిణివై మనసార వేడితివి.

"కమలా! నిన్ను శ్రీమాత కరుణించి యాశీర్వదించినది. జ్ఞానసూర్యోదయ మేనాఁడో యైనది, ఒక యనిర్వచనీయమైన యపూర్వతేజస్సు నీ బహిరంతరముల నావరించినది. దివ్య వాక్సుధలు నీముఖ కమలము నుండి యవిరళముగా నొలికినవి"

అప్పటి నీ యుద్బోధమున కుపబలములైన యుపనిషత్ ప్రతిపాద్య శ్రుతులు నిట జోడించి చూపుట యప్రస్తుతము కాదేమో !

హితుఁడా! నేఁటితో మన ఋణానుబంధము విడిపోయి నది, మీరు ఋణ విముక్తులైతిరి, ఇఁకనాకు నే నే;

నాకెవ్వరును లేరు, పాంచ భౌతిక మీదేహము, ఇఁకఁ గొలఁది గడియలలో పతన మొందును; గాని నాకు నాశము లేదు."

"అయమాత్మా బ్రహ్మ" (బృ॥ఉప) ఇప్పుడీ గూటిలో మిసుకు మిసుకు మని వెలుఁగు దీపకళికయే పరబ్రహ్మము.

"అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ।
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ॥
వాయుర్యథైకో భువనం ప్రవిష్టో
రూపం రూపం ప్రతిరూపో బభూవ।
ఏకస్తథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ॥ కఠోపనిషత్తు.

ఒక వత్తియందు వెలుఁగు దీపము నుండి పలువత్తులు వెలిగించి నపుడు, ఆ యొక్క దీపమే ఆవత్తులనన్నిటి వ్యాపించి యనేక దీపములుగాఁ దోఁచు నటులు, ఆత్మ యొక్కఁటే యనేక దేహములందు వ్యాపించి, యనేకాత్మలుగాఁ దోఁచుచున్నాఁడు.

ఒక్క వాయువే విశ్వవ్యాప్తమై మలయ మారుతమనియు ప్రాణవాయువనియు, సుడిగాలి యనియు నిట్లు బహు విధములుగా దోఁచునటులు, ఆత్మయొక్కఁడే పిపీలికాది బ్రహ్మపర్యంత సమస్త జీవకోశములవ్యాపించి పలుభంగులఁ దోఁచును.

"తదేతద్ బ్రహ్మ పూర్వమన పరమనంతరమ బాహ్యమ్" (బృ.ఉప) పూర్వాపరములు, సవ్యాపసవ్యములు,

---

బహిరంతరముల నూర్ధ్వాధోభాగముల సర్వతః పరిపూర్ణముగా విశ్వవ్యాపియై నిండియున్నాఁడు.

"సవాఏషమహానజ ఆత్మా జరోఽ మరోఽమృతోఽ భయో బ్రహ్మాభయం హివై బ్రహ్మభవతి॥" బృ॥ఉ॥.

బాల్యయౌవన కౌమార్యాద్యవస్థా పరిణామ భాజన మీ శరీరము, కాని, జనన మరణములు, అవస్థాపట్కము, నాశము, భయోద్వేగములు, లేని పరమాత్మయే-ఆత్మ, (నేను)

"నజాయతేమ్రియతే వావిపశ్చిన్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్। అజోనిత్యః శాశ్వతోఽయం పురాణో నహన్యతే హన్యమానే శరీరే॥" (కఠ. ఉప)

చావు పుట్టుకలు లేని వాఁడు; సర్వసాక్షి; ఇతఁడు ఒకరి వలనఁ గలిగిన వాఁడు కాఁడు; ఒకరివలనఁ జంపఁ బడెడి వాఁడు గాఁడు. జన్మములేని వాఁడు; శాశ్వతుఁడు; నిత్యుఁడు; ఆది మధ్యాంతరహితుఁడు; జీర్ణమై శీర్ణమై పోవునది శరీరమే.

హన్తా చేన్మన్యతే హన్తుం హతశ్చేన్మన్యతే హతమ్।
ఉభౌతౌ నవిజానీతో నాయం హన్తి నహన్యతే॥ (కఠ. ఉప)

జనన మృత్యురహిత మగు నీ పరబ్రహ్మను నాత్మ నొకరిచేఁ జావఁడు; తానొకరిని జంపఁడు; కరచరణాద్యవయవరహితుఁడుగాన, నొకరిని జంపఁజాలఁడు, నామరూపరహితుఁడుగాన నొకరిచేఁ దానుజంప బడఁడు. మూఢులు

మాత్రమే ఆత్మ చచ్చుచున్నాఁడు - పుట్టుచున్నాడు అని భావింతురు.

"యేనేదం విజ్ఞాయతేసర్వం - తం - కేన విజానీయాత్ । విజ్ఞాతార మరే - కేన విజానీయాత్ ॥ (బృ. శ్రుతి)

జ్ఞాన స్వరూపమగు నాత్మ యీ దేహమున వసించుట వల్లనే యెల్లరు బహునామ రూపములతోడి ప్రపంచము నెఱుంగఁ గల్గుచున్నారు - జ్ఞాన స్వరూపమగు దానిని, ఇట్టిదని నిర్ధారించుటకు మఱియొక జ్ఞాన స్వరూప వస్తువుండునా?

నిత్య సత్య శర్మస్వరూపుఁడైన నారాయణుఁడే ఆ పరమాత్మ, తద్రూప సర్వసత్తగానున్న శ్రేషతను వస్తువు నేఱొండు లేదు. వస్తువనఁగా నదే. 'సోఽహం,' అదే (వాఁడే) నేను.

"నాకెవ్వరును లేరు - నాకు (నేనునకు) మూలము నేనే" బ్రహ్మవిదుషి అమ్భృణీ వాగృషి ప్రతిపాదించిన సచ్చిదానంద స్వరూప పరమాత్మ యిదియే. సర్వోత్కృష్ట బ్రహ్మశక్తి యిదియే, మంత్రద్రష్టలచే ప్రధానలక్ష్య భూతముగాఁ బ్రతిపాదింపఁ బడిన జ్ఞానవస్తువు ఈ పరమాత్మయే.

కమలా ! ఈ శ్రుత్యర్థ విచారముతోనే కదా మన సమయము ఆనంద మయముగాఁ గడచెడిది? ఆ క్షణములను స్మరించిన యీ క్షణమును సుఖమయమే గదా! అంతః శ్రుతి శ్రుతి వాక్కులాగక వెలిఁబడుచున్నవి. నీ (నీవుయొక్క) స్మరణము, నా - (నేనుయొక్క - ఆత్మయొక్క) స్మరణమే జీవన యాత్రయందుఁ జిక్కిన విశ్రాన్తి క్షణములనిట్లే గడవఁ జేసిన నీవు విస్మార్యవెట్లగుదువు ?

"అమృత సంతానమగు నెల్లరాలకింపుఁ;
డమృతసత్తలుగా నెల్లరాలకింపుఁ;
డందమృత స్వరూపము నరసికొండు;
అందమృత నిధానము నంటునొందు."

"ఈ - స - శర్మ వాణి కింపొందు సాధకుఁ
డమ్మ నెనరు జడుల నాడి యాడి,
"నేను" నకును మూలమైన "నేనే" యయి
యెటనొ నిల్చు మఱలి యిటకు రాఁడు"

అని, శ్రీ కాకుళ వాసి శ్రీ శ్రియానందనాథగురు దేవులు, నాగావళీ తీరమునుండియే ఎలుగెత్తి మేఘగంభీర నిస్వనముతో, బద్ధ జీవులైన జిజ్ఞాసువులకు, ఆనందావాప్తి మార్గమును 'ఘాం ద ధ ఘాం ధ ఘాండ నినదంబులు మేలు కొల్పులుగా నజాండములు నిండ ముక్తకంఠమునఁ జాటిరి. బహుగ్రంథముఖమునఁ జాటుచున్నారు. "మాతృముఖ నీర జోద్భవ మధుకణములు" ఆ మహనీయుని మృదు మధురామృత మయవాక్కులు - అహరహ మనుక్షణము తైలధారా సదృశ ముగా మనన యోగ్యములు. ముక్తిమార్గ సందోహదములు, అజ్ఞానాంధకార జ్ఞానభానురుచులు.

మఱి యొకపఱి, శ్రీవారి పదకమలముల నాశ్రయించి ప్రపత్తిని ప్రసరింపఁజేసి, యనుగ్రహము నాశించి, యాత్మా ర్పణముతో నర్థించి తెలిసికొంటిని.

"నాకెవ్వరు లేరు - నాకు మూలము నేనే"

కమలా! నాఁటి ప్రభాతమున, అపూర్వ దివ్యతేజో విలసితమైన నీ ముఖ కమలమునుండి జాఱిన కమనీయమధు బిందువులివే. ఆ మధురసాస్వాదన తత్పరతచే, నోడలుమఱచితిని. అలవాటుమాట లనుకొంటిని - అప్పుడే రానున్న యాపదను గుర్తింపనైతిని.

నన్ను దుఃఖసాగరమునఁ బడఁద్రోచి నాఁటిరాత్రియే, తొమ్మిదియు నరగంటకు భాతికోపాధిని నా పరముచేసి, మన యారాధ్య శ్రీమాత యంకమున నొకమూల, స్థిరనివాసము నేర్పఱుచు కొంటివి.

'నీవు - నేను' అను రెండు వస్తువుల ముచ్చటలతోనే నిత్యము నిత్యానందావాప్తి సహకారిణియగు ధర్మపత్నితోడి వియోగమువలని దుఃఖానుభవము సాగరపతన సదృశము కాదా ? నీ వియోగముకూడ 'నీవు - నేను'ల గోష్ఠికే నిరతము సహకరించుటచే, నీవే యథార్థ 'సతి'వి, నీవున్నావు - నేనున్నాను. అమ్మ యంకమందే యున్నాము. ఔను; ఆమె భవాని (ఎప్పుడు నున్నది). స్మరణమాత్రముననే నీరజభవాదుల కందరాని నిజసాయుజ్యపదవి నిచ్చి - అసంగభవ సాగర నౌకాఖ్యను సార్థకం పఱుచుకొన్నది.

"ఏకాకివై జీవితశేషమును గడపుకొనకున్న, ఏకాకిని నైన నన్నుఁ జేరఁజాలవని" నీచేఁ జెప్పించినది. ధన్యోఽస్మి.

ప్రారబ్ధకర్మక్షయమనెడి పెద్దవేరు తెగిన పైనిగదా-ఆహా-అదిమన 'భవారణ్యకుఠారికా' నామ్ని భవాని చూచుకొనునది.

ఎన్ని మజిలీలు ? ఎన్నాళ్లు ? ఎవరెఱుఁగుదురు ? అమ్మ.

పదునేడేండ్ల యాయాసములు ఒడిదుడుకులు తలక్రిందు చేయకుండ మన జీవననౌకను చతురకర్ణధారిణివై నడిపి, ప్రశాంత వినీలాకాశాంతర్గత తార వోలె - నాగావళీ తీరము నకు దారిచూపి చూచుచుండఁగానే కనుమొఱఁగితివి. నీ దివ్య గుణపుంజచ్ఛాయలచే నా జీవితము నుజ్జ్వల తరముగాఁ దీర్చి దిద్దిన శ్రీదేవిప్రవిమల ప్రతిమూర్తివి. నాయంతరంగ శాన్తిదేవ తవు. దైన్యమునకుఁ జోటీయక, పరిసర ప్రకృతి వికారములకుఁ బతిని లోనుగానీక యేలుకొన్న యాదర్శ గృహిణీమణివి. మణి ద్వీపవాసిని మకుటాగ్రసీమనుండి భువికి జాఱిన సుధామయూఖ రేఖవు నాపాలిట నీవు. పూర్వజనుస్తపః కల్పక ఫలమవు నీవు. నీ సాహచర్య భాగ్యమున నాకుఁ గలిగిన పవిత్రానుభూతికిఁ బ్రత్యుపకృతి చేయలేని యీ నిర్వేద సిగ్గును "సర్వోపకార కరణాయ సదార్ద్రచిత్తా" యెవరో ఆవస్తువు, ఆనందమునుగా మార్చుఁగాక.

నా యాధ్యాత్మిక సౌభాగ్య సిద్ధికిఁ దోడ్పడిన, కమలా! నీవు, అమ్మయొడి నుండియే నన్ను ప్రేరేచి నాఁడు (1959 సం॥) స్వగురు శ్రీ శ్రీయానందనాథ రచిత మహాసౌర మంత్రపాఠా నువాదమును, సతీర్థులు, శ్రీ మల్కాపురం పుట్టురామశర్మగారి యాంగ్లానువాదముతో-పునర్ముద్రితము చేయించి తన్మూల్యము మన సతీర్థసోదరి, శ్రీమతి చి॥ సౌ॥ రావులూరి సరోజమ్మకుఁ బరదేవతా బుద్ధితోఁ బసుపుఁ గుంకుమకుగా నిప్పించితివి.

మఱల నేఁడు, అపూర్వ వ్యాఖ్యాసహిత మీ రాజ విద్యాగీతను బ్రచురింపఁ జేసి, — ఆధ్యాత్మిక గ్రంథ ప్రచురణ

ములచే ఆంధ్రసాధక లోకమునకు భక్తి జ్ఞాన సాధన సంపత్తి సంధానమున కగు సేవచేయు పవిత్రసంస్థ - సాధనగ్రంథమండలికిఁ దనూ్మల్య ఫలితము నిప్పించితివి. ఇది నీ యాదేశము.

ఈ చర్మచక్షుష్ఠులకు నీ వెడముగా నున్న నేమి! నీ యాదేశము తు. చ. తప్పక ఆచరించుటయే నా కర్తవ్యము.

నిరవధిక దయాసముద్రులు మన గురుదేవులు. శ్రీ శ్రియానందనాథులు. వారి శిష్యవాత్సల్య మపారము. ఆశీః పురస్సరముగా ననుగ్రహించి యనుమతించిరి. కనుక నే నాఁటి 'మహాసౌరమంత్ర పాఠానువాదము', నేఁటి రాజ విద్యా గీతాంధ్ర వ్యాఖ్యయు నీస్మృతి చిహ్నములుగా వెలువడినవి. శ్రీ గురు వాత్సల్యమునకు సర్వదా కృతజ్ఞులము.

పాఠక లోకమునకు నా మనవి :—

నా యర్థాంగి కమల, ప్రేమమయి. ఆమె స్మారక చిహ్నముగా, మీ కరాబ్జముల నలంకరించిన యీ యపూర్వ గ్రంథకుసుమ మండలి మధువు నాస్వాదించి సంతృప్తులరై మమ్ముల నాశీర్వదింతురు గాక!

బెంగుళూరు
16—9—61

ఇట్లు, విధేయుడు,
మల్లిపాటి వెంకటనరసింహారావు.

# వినతి

గీతోపనిషన్మహాత్త్వమును దెలుపఁ బూనుట వేయి వెలుంగులకు జేతివ్రేలఁ జూపఁబూనుట వంటిది. అందును గీత భగవానుని శ్రీముఖమునుండి నిగదిత మగుటచే నిగమాదులకంటె నిఖిలలోక సంతారకమై యున్నది. ముముక్షు లోకము కామితార్థముల బడయుటకై పెక్కు అనేకమార్గము లిందుఁ బ్రస్తావింపఁబడి యుండుటయే దీనికి హేతువు. సామాన్యసంస్కృతజ్ఞానము కల వారికి సైతము విదితార్థములగు శబ్దములతో గీతయందుఁ దెలుపఁబడి యున్నను పరతత్త్వమును జక్కఁగా గురితించిన సద్గురుని యుపదేశము వినా తద్గత మహార్థము చిత్తమునకుఁ బొడసూపుట కల్ల.

"శబ్దజాలం మహారణ్యం చిత్తభ్రమణకారకం,
అతః ప్రయత్నా జ్జ్ఞాతవ్యం తత్త్వజ్ఞా త్తత్త్వ మాత్మనః॥

అరణ్యమువలె శబ్దజాలము చిత్తభ్రాంతిని జేకూర్చున దగుటఁ దత్త్వమున నాత్మతత్త్వ మెఱుంగవలెనను తాత్పర్యము.

కేవలశబ్దార్థములను దెలుపునాతఁడు సద్గురువు కానేరఁడు. పరతత్త్వ జ్ఞానమునకు శాస్త్రాధ్యయనము సాధన మాత్రమై యున్నది. గమ్యమును జేర్పనిచో నా సాధనము నిష్ఫలము. అనేకు లిట్టి శాస్త్రాధ్యయనరూపసాధన విశిష్టులయ్యు గమ్యమును జేరఁజాలని హేతువుచే సద్గురుపదము నధిరోహించి, సదుపదేశముల వెలయించి, లోకమునకు వెలుఁగుదారిని జూప నసమర్థులై యున్నారు.

పూజ్యులు శ్రీ యాశ్వర సత్యనారాయణశర్మగారు బహుభాషాకోవిదులు. సంస్కృతాంధ్రములయందు సన్నుతింపఁ దగిన పాండిత్యము గలవారు. ఇట్టి పాండితీగరిమకుఁ దోడు అంబికాచరణాబ్జములదెస నల్పకాలమైన నేమఱపాటెఱుఁగని వారిజీవితమే యొక భగవద్గీతయై యుండుట విశిష్టులకెల్ల విశిష్టతయై యున్నది. పూర్ణదీక్షాపరులు, నిఖిల మంత్రాగమసారవేత్తలు నగు శ్రీ శర్మగారి కృపఁ బడసి, జ్ఞానచక్షువులఁ దెఱువఁ గల్గిన శిష్యసంతానము దశదిశలయందు వారి సద్గురుత్వమునకు బ్రతీకమై నెలకొనియున్నది.

అట్టి శ్రీ శర్మగారు "భగవద్గీత - నవమాధ్యాయము" (రాజగుహ్యయోగము)నకు రచించిన యీ విపులవివృతి యెట్టిదై యుండునో దెలుప నక్కఱయుండదు.

శ్రీ శర్మగారికి నాయందు పుత్రవాత్సల్యము. వారు నారోగ్యక్షేమము లను సదా కోరుచుండుట నా పూర్వార్జిత సుకృతవిశేషము. సాధన గ్రంథ మండలి యెడ వారికిఁగల ఆదరాభిమానములకు వారి సహకారముతో నేనింతవరకుఁ బ్రచురించిన శ్రీవారి గ్రంథములే నిదర్శనములు.

"సంతత మంబికాచరణసారససేవను భృంగరూపి, ని
శ్చింతగ సంస్కృతాంధ్రరససింధువు గ్రోల నగస్త్యరూపి, భా
ష్యాంతము శిష్యకోటి కనిశంబును దెల్పను శంకరుండె యా
శాంత మనోజ్ఞరూపియగు సద్గురువర్యున కేను మ్రొక్కెదన్॥

అని శ్రీ శివానందనాథాపరనామములగు సద్గురువుల చరణములకు మ్రొక్కి, గీతోపదేశము నందగోరువారల కీగ్రంథము సదుపదర్శనివలె సకల గూఢార్థముల నెఱింగించుటయందు నిస్సపత్నమని లోకమే గుర్తింపఁ గలదని విశ్వసించుచున్నాను.

గురూపదేశానుసారము సాధన జేసి గుర్వనుగ్రహమును బడయుట యదృష్టము. ఈభాగ్య మందరికిని యలవడదు. శ్రీ సత్తిపాటి వెంకటనరసింహా రావుగారు గురుకరుణకు పాత్రులైన ఉత్తమసాధకులు. గురూపదేశముగా వెలువడిన సద్గ్రంథములను సతీర్థులకు పాఠకలోకమునకు అందించుటయే ప్రధానకర్తవ్యముగా భావించిన భక్తులు. ఈ విజ్ఞానదానము అన్ని దానముల వలె సామాన్యముగాదు. మా మండలికి వారుచేయుచున్న సహకారమునకు కృతజ్ఞుడను.

శ్రీ వెంకట నరసింహారావుగారు వారి యర్ధాంగి కమలాసంస్మరణముతో కమలాస్మృతి చిహ్నముగా నీ గ్రంథమును పాఠకలోకమునకు అందించుట పరమానందము. శ్రీ నరసింహారావుగారి పవిత్ర సంకల్పమును శ్రీకృష్ణ భగవానుఁడు నెరవేర్చుగాక ?

ప్రియాంతేవాసి.

ప్లవ విజయదశమి
తెనాలి.

బులుసు సూర్యప్రకాశ శాస్త్రి
సంపాదకుఁడు : సాధన గ్రంథ మండలి.

ఓం ఈం నమః

# శ్రీ మద్భగవద్గీత : నవమాధ్యాయము

# రాజగుహ్యయోగము

## విజ్ఞాన సహిత జ్ఞానము

శ్రీ భగవానువాచ—

**ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే।**
**జ్ఞానం విజ్ఞానసహితం యద్జ్ఞాత్వామోక్ష్యసేఽశుభాత్॥ ౧**

శిష్యత్వమును బూర్తిగా స్వీకరించి పూర్తిగా శిష్యత్వమును బొందిన యర్జునునికొఱకు, గురుమూర్తిని దాల్చిన శ్రీకృష్ణభగవంతుడు, "గురునియెడ ననసూయుఁడవును దోషదృష్టిరహితుఁడవునైన నీకు, గుహ్యతమమును (అతిగుప్తము) విజ్ఞానసహితము (ససాధనము) నైన జ్ఞానము నుపదేశింతును. దాని నెఱింగి, లెస్సగా ననుభవించి యమంగళమువలన విడువఁబడుదువు.

శ్రీగురుఁడు చెప్పినదంతయు వినియు, శ్రేయము-ప్రేయము నను రెండింటి సమస్యయందుఁబడి, యేమిచేయుటకును దోఁపని యర్జునుఁడు, "శిష్యస్తేఽహం శాధిమాం త్వాం ప్రపన్నమ్" అని యేనాఁడు, అహంకర్తృత్వబుద్ధియ నెడి వింటిని భగవంతుని యడుగులందుఁ బడవైచి, శోకమోహములు క్రమ్ముకొనగా, వ్యాకుల ప్రాణముతో, "ఓ గురుఁడా!

శ్రేయమేదో ప్రేయమేదో నాబుద్ధికందదు; అసమర్థుఁడను; నా శ్రేయస్సును నిర్దేశింపుము." అని రథమునందుఁ గూలఁబడెనో, ఆనాఁడే జగద్గురుఁడు భగవంతుఁడు సాధకవరేణ్యుఁడైన యర్జునుని శిష్యుఁడుగాఁ జేకొని, క్రమముగా యోగములనెడి పేరితో నధ్యాయములని మనము వ్యవహరించుచున్న నానా విధోపాయముల నుపదేశించుచు, వినువక యతఁడుచేయు పరితః ప్రశ్నములకు సమాధానము లిచ్చుచు, మెల్లమెల్లఁగా సంస్కారమలినమైన వాని చిత్తమును మాటిమాటికి శోధించుచు, నిప్పటికొక స్థానమునకుఁ దేఁగలిగెను. అబ్బా! జీవదయాపర శ్రీగురున కెంతయోపిక! అక్కడకుఁ దెచ్చి యర్జునుఁ డిప్పుడు నిజముగా ననసూయుఁడని నిశ్చయించెను.

గుణవంతుఁడైన వ్యక్తియందు సైతము దోషములను వెదకితీయుట పేరే యసూయ. ఈయసూయ—దోషదర్శనము పూర్తిగాఁ దొలఁగినవాఁడే, అనసూయుఁడు, ఎనిమిదవ యధ్యాయమం దుపదేశింపఁబడిన, అక్షరబ్రహ్మయోగము నెత్తికెక్కిన తర్వాతనే యర్జునుఁ డనసూయుఁడైనాఁడు. అంతవఱకు సందేహములే; ప్రశ్నములే; గురురూప భగవఁతుని యెడ దోషములెన్ను కన్ను, ఇప్పుడర్జునునకు లేదు. భగవంతుఁడు గురురూపి శ్రీకృష్ణుఁడు, మానిసిమేనితోఁ దన బండి నడుపువాఁడై, గుఱ్ఱాల పగ్గములనుబట్టి దొగలఁ గూర్చున్నను, అతనియందు మనుష్యుఁడనెడి బుద్ధి తొలఁగిపోయె. అతఁడిపుడు, మేనూనిన భగవంతుఁడే శ్రీకృష్ణుఁడని ప్రత్యక్షము చేసికొనెను (అనుభవించెను). సంశయవిచారములతో

బిగిసిపోయిన యతని బుద్ధినుండి, యవి రెండును దొలఁగిపోఁగా, దన లోపలినుండి యెవ్వరో, అర్జునా! ఈ సారథిరూపమున, గురురూపమున ముందు కూర్చున్న వ్యక్తి, భగవంతుఁడు సుమా, యని ఘోషించుచున్నట్లయినది. ఈ యంతరాత్మ చేయు నాదేశముచేతనే, పార్థుఁడిపుడు నిఃసంశయుఁడును నిర్వి చారుఁడునునై శ్రీకృష్ణుని భగవంతునిఁగా ననుభవించు చున్నాఁడు. అర్జునుని దృష్టియందిపుడు శ్రీకృష్ణుని దోషమెట్టి దియుఁ బ్రతిభాసింపకున్నది. అర్జునుఁడు మహాసౌభాగ్యశాలి, కనుకనే యిపుడు యథార్థగురులాభమైనది. శ్రీగురు కృపచేత నతఁడిపుడు గుహ్యతమయోగోపదేశమున కధికారి యయ్యెను. కనుక నపుడే భగవంతుఁడు, "ఓయి! అర్జునా! నాయెడ దోష దృష్టి తొలగిన నీకిపుడు, ఈయపూర్వ రాజగుహ్యయోగోప దేశమును జేయుదు"ననెను.

ఈ సంసారమందును ఎవఁడు, సరిగా నర్జునుని బోలి యనసూయుఁడై "శిష్యస్తేఽహం శాధిమాం త్వాంప్రపన్నమ్" అనుచు భగవచ్చరణములందు శరణాగతుఁడగునో, గురుదోష ముల నెన్నునెడ యథార్థముగా నెవఁడు శుద్ధియైయుండునో, ఎవనికి యథార్థగురుదర్శనమైనదో, ఆ ధన్యుఁడే, ఆసుకృతి శాలియే, యీ రాజగుహ్యయోగమును విన యోగ్యాధికారి.

ఇచట గురులాభమన నేమో వివరించు టావశ్యకము కాదా, లోకమందనేకులు, సాధు మహాపురుషులను జేరి యొక మంత్ర జపక్రమమునో, యౌగికక్రియనో, యొక విశిష్ట సాధనమునో నేర్చికొన్నంత మాత్రాన గురులాభమైన దను

కొందురు. వాస్తవముగా నది గురులాభముకాదు. సాధకుఁడు తన లోపలనే విశిష్ట గురులాభము నొంద నంతదాఁక నది గురులాభమే కాదు. ధనలాభము, పుత్త్రలాభము, విత్త లాభము మున్నగు మాటలచే, నెటులీధన పుత్త్ర విత్తాదు లనే, యాత్మీయములు – నావి – యను నిట్టి నిశ్చయాత్మక బోధము ననుభవించునో, యటులే శ్రీ గురుని బరమాత్మీయు నిఁగాఁ దలపనంతదాఁక, వేయి యుపదేశము లందుకొన్నను, వేయి దీక్షలందుకొన్నను, సరిగా గురులాభమైనట్లు కాదు. గురులాభమైనను, గురువునెడ మనుష్య బుద్ధియు, మనుష్యు నెడ గురుబుద్ధియు నుండునంతదాఁక గురులాభము వలని యథార్థ ఫలమబ్బదు. జగద్గురుఁడైన భగవంతుఁడే గురువు. ఆతఁడొక్కఁడే యెల్లరకుం గురువు. మనుష్యదేహము నాశ్ర యించి భగవంతుఁడే గురురూపమున వెలయుచుండు, నను నట్టి తెలివి గట్టిపడి, గురువు నాత్మీయునిఁ జేసికొఁగల్గునపుడే, యథార్థ గురులాభమైన దనవలయును. ఇట్టి గురులాభము నొందినవాఁడే రాజగుహ్య యోగాధికారి.

గురులాభమైనదో లేదో, తెలిసికొను పరీక్ష, శిష్యుఁడు అనసూయుఁడగుటయే. గురుదోష దర్శనమున కవసరము లేని వారే సద్గురు లాభముచే ధన్యులు. పురాణాదులందుఁ జెప్పఁ బడిన యొక ప్రవాదవాక్యము—"శత్రోరపి గుణా వాచ్యా దోషా వాచ్యా గురోరపి" అను దీనికి సాధారణముగా "శత్రుని పైనను గుణములను, గురునిపైనను దోషములను జెప్పుట యుచితము'' అను నిట్టి యర్థమునే చెప్పుదురు, కాని

సారగర్భితమగు నీ వాక్యమునకు, అట్టి యర్థమును జెప్పుట యుచితము కాదు. "శత్రోః, గురోః" అను నీ రెండు పదముల యందును, స్వామ్యార్థకమగు షష్ఠీభక్తియే ప్రయోగింపఁ బడినది. ఈ రెండు పదములతోడనేయున్న, "అపి" పదమునకును, ఇతర వ్యవచ్ఛేదకమైన, ఏవకారార్థమునే గైకొన వలయును. అపుడు దీని తాత్పర్యము.—శత్రువు కడనే (ఇతరుల చెంతఁగాదు) తన గుణమహత్త్వము నుగ్గడింప వలయును. దాని ఫలముగా శత్రుఁడు నిర్జితుఁడగును — తగ్గిపోవును. "గురోరపి" గురుని చెంతనే (ఇతరుల చెంతకాదు) తనదోషములను నిష్కపటియై నివేదింప వలయును. స్వదోష సంశోధనమునకిది వ్యర్థము కాని యుపాయము. సంకోచ లజ్జాభయములు లేక, తన దోషములను గురువుకడఁ జెప్పుకొన్నచో నాతఁడు వానిని దిద్ది గుణములుగాఁ జేయును; కనుకనే "దోషా వాచ్యా గురోరపి" అని పెద్దలనిరి.

అట్లంటే, గురుని గుణదోషములను కేవలము విచారింపఁదగదా? ఏల తగదందువేని —'నాయనా! గురువుగా నొకని స్వీకరింపకమున్నే, కడు నోర్పున వాని వివేచనము చేయవలయును. కనుకనే తంత్ర శాస్త్రములందు "గురుతా శిష్యతా వాపి తయోర్వత్సరవాసతః" గురుత్వ శిష్యత్వములను గూర్చి యొక స్థిర నిశ్చయము చేసికొనుటకై, యిరువురికి నొక సంవత్సరకాలము కలిసియుండుట విధింపఁబడినది. అంతలోనే యొండొరుల గుణదోష విచారమును జేసికొని కర్తవ్యమును నిశ్చయించుకొన వలయును. ఇటు లొకసారి స్థిరపడిన

పైని మఱి విచారించుకొను నక్కఱ యుండదు. అప్పు డొకరి నొకరు విడువనులేరు; విడుచుకొంద మన్నను, అది యుక్తి సిద్ధమునుగాదు, శాస్త్రానుమోదితమును గాదు. అట్టి యవసరమందు గురుఁడు శిష్యదోష సంశోధనమునకై ప్రయాసపడును. శిష్యుఁడు గురుదోషదర్శనము నెడ గట్టిగాఁగన్నుఁ మూసికొనును. ఇటులయినపుడే శ్రేయోలాభమునందాశ యుండును. పరస్పర గుణదోషదర్శనము లోపించిపోయిన వారలే, గురుత్వ శిష్యత్వముల యందుఁ బూర్ణాధికారులు. ఇట్టి చోటనే శ్రేయోలాభ మత్యల్పకాలమునందే సంఘటితమగును.

మనుష్యుఁడు స్వభావము చేతనే దోషదృష్టి సంపన్నుఁడు. తన ప్రకృతికి విరుద్ధమైన వేఱొకరి సమున్నత ప్రకృతియుఁ బలుమాఱు దూషణీయముగానే ప్రతి ఫలితమగుచుండును. సాధారణముగా నిదే కనుచున్నాము. కాని గుణదోషములకుఁ బైఁగాఁ బోఁగోరువాఁడు, ద్వంద్వాతీత స్వరూపము నభిలషించువాఁడు, మునుమున్నే, తాను దోషము లెన్నఁబనిలేని, నిఃస్వార్థమైన స్థలమునఁనిల్వవలయును. ద్వంద్వాతీతుఁడగుట కింతకంటె నుపాయము మఱిలేదు. మనుజుఁడు గురుని దోషములెన్ను పట్ల గ్రుడ్డివాఁడై, పరమేశ్వరుఁడే యీ గురుమూర్తితో నున్నాఁడని గ్రహింపఁగలవాఁడై, క్రమముగా నా గురువును "వ్యాప్తంయేన చరాచరమ్" రూపమునఁ దలంపఁగలిగి, యనుభవింపఁ గలిగినపుడు, లోకమున మఱి యెవ్వరి దోషములను వెదకు కన్నే వానికుండదు. అపుడే

యతఁడొక ద్వంద్వాతీతావస్థను రుచి చూచుచు ధన్యుఁడగును.

ఈ లోకమున మనమెన్నో విధముల యశాన్తులను, దుఃఖములను ననుభవించు చున్నాము. అందుఁ బెక్కింటికిఁ బరదోష దర్శనమే కారణము. సాధారణముగ మన నాల్క పరదోష చర్చయే సుయోగముగా నెంచి తృప్తినొందు చుండును. మన చెవులు పరదోష శ్రవణమునకే రిక్క యుండును. మన కన్నులుఁ పరదోషోద్ఘాటనమునకే యలవాటు పడినవి. అయ్యయ్యో! మన మితర దోషముల నెన్నునపుడు, మన యంతఃకరణము యాదోషములతో దూషితమై పోవు చున్నదని మనము కానలేకున్నాము. మాటిమాటికి దోషాను స్మరణము చేయుచురాఁగా, మన చిత్తక్షేత్రమే దోషమయ సంస్కారములతో నిండిపోవును. కాలాంతరమం దీసంస్కార బీజములే పలుతెగల దుఃఖ కష్టముల మొలిపించును; కనక దోషము లెన్నుచూపే యధికాంశ దుఃఖములకు మూలమనక తప్పదు. ఎవ్వని కన్ను పరదోష దర్శనము నెడ గ్రుడ్డిదై, చెవి పరదోషశ్రవణము నెడఁ జెవిటిదై, నాలుక పరదోషోద్ఘాటనము నెడ మూఁగదై పోవునో, వాని బ్రతుకే మిగుల శాన్తి యుతము, నానందమయమునై సాగును. చెప్పెడిదేమనఁగా నాయనా! పరదోష దర్శనము నెడ నీవు గ్రుడ్డివాఁడవే కావలయు.

మనుజుని దుర్దినములు గురజన (పరజన) దోష దర్శనముతోనే యారంభమగును. ఇట్టి ప్రతికూల కర్మ ఫలము

గానే, దుర్ఘటనము లెన్నో సంఘటిల్లును. సాధకుఁడెవ్వఁడైన నిట్టి యవస్థకుఁ జిక్కెనేని, ఆతని విషయమున వ్యాకుల ప్రాణముతోఁ బ్రార్థించుట యొక్కటే ప్రతిక్రియ. "ఓ శ్రీగురుఁడా; నీ విట్టి మలినమూర్తితో నాయెడ నెందుకు వెలయుచున్నావు? ప్రభువా ! నీవు విమలుఁడవు; శుద్ధుఁడవు; పవిత్రుఁడవు; సర్వదోష రహితుఁడవు; అయినను నాయెడ నిట్టిదోష మలిన వేషముతో వెలయనేల ? తండ్రీ ! నేనింత దుర్భాగుఁడనా ? నా సర్వస్వమైన నిన్ను సైతము, నేఁడింత మలినమూర్తితోఁ జూడఁదగినంత పాపినా ? క్షమింపుము. దయామయా ! క్షమింపుము. నాహృదయమందిట్టి మూర్తితో నెన్నఁడును దర్శన మీయకు. నీ వెప్పుడును శుద్ధుఁడ వేయైనను, నా మలిన బుద్ధిగాను, నా మలిన సంస్కారములుగాను, వెలయుటచే, నీవును మలినమూర్తిని దాల్పవలసి వచ్చెను. నిజముగా నీవు నిర్మలుఁడవు. అపాప విద్ధుఁడవు. నేనో—మిథ్యామండితుఁడను; దూర దృష్టి హీనుఁడను; గనుక నిన్నిట్టి పాపస్పర్శముగలవానిఁగాను, మలినునిఁగాను గనుచున్నాను. నీవే నన్ను నిర్మలునిఁ జేయుము. నీ పవిత్ర స్వరూపమునే నాయెదుట వెలయింపుము." అనుచు నిల్లు, కలఁతతో నిష్కపటియై, వేడుకొన్నచోఁ గొన్ని నాళ్లలోనే మనుజుఁడు దోషదర్శన దౌర్భాగ్యమునుండి తప్పుకోఁగలఁడు.

రెండవ యుపాయము— విచారము. జగదీశ్వరుని యందు సదసత్తులు, సుఖదుఃఖములు, దయానిష్ఠురతలు, పాప పుణ్యములు, సుకృతులు, తుల్యభావముతోనే యుండును. వీని

వలన నాతఁడు రవ్వంతయుఁ గళంకితుఁడుకాఁడు. ఆతని గొప్ప దన మావంతయుఁ దఱుగదు. అతఁడే యీనా గురుఁడైనపుడు, మఱి, మంచిచెడ్డలు రెండేవి? నాగురుఁడు వీనివలన దోష యుక్తుఁడగునా? ఎట్లగును? మంచిచెడ్డలు రెండును నా చూపునందే యున్నవి? ఆతనియెడ మంచియులేదు; చెడ్డయు లేదు. అంతయు నతఁడే; నిందాస్తుతులకును, ధర్మాధర్మముల కును, నాతఁడు పరుఁడు. "గురుఁడు" అను మాట తలఁచి నంతనే, యిట్టి యీశ్వరభావము చప్పున లోనస్ఫురింపనంత దాఁక మనుజునకు యథార్థగురులాభము కాలేదన్నమాటయే. గురులాభము కాక, రాజగుహ్యయోగ గ్రహణాధికారము లేదన్నమాటే, అంతేకాదు గీతాగ్రంథస్పర్శనమునకే నధికారి కాఁడన్నమాటయే.

గురుస్వరూప సంబంధ జ్ఞానములేనివానికి, గురువునెడ దోషదర్శనాశంక యుండనే యుండును. గురుని మనుష్య మూర్తిగానే తలఁచువారికీదౌర్భాగ్యము తప్పదు. కనుక— ఓ సాధకుఁడా! సావధానుఁడవగుము. ఏగురుత్వము నీలో బోధముగా వెలయుచుండునో, అదియే సచ్చిదానంద పర బ్రహ్మము. వెలికి మనుష్యమూర్తిగా నున్న గురుఁడు, నీ లోపలి బోధమయ గురు నుద్దీపింపఁజేయువాఁడే. మన్ను, కట్టె, ఱాయి, మున్నగు వానితో నైన దేవమూర్తులు పర మేశ్వరు నుద్బోధించునవి యైనట్టులే, మనుష్యమూర్తి గురుఁడు, విజ్ఞానమయ సర్వభూత మహేశ్వరు నుద్బోధించువాఁడే, యనుట నీ వెఱుంగుదే, నిఁక నెన్నఁడును, నేవిధముగాను గురుదోష దర్శన నేత్రము నీకుండదు.

సరే; అర్జునునకు గురులాభమైనది. కనుకనే శ్రీగురుడు 'నీ వనసూయుడ' వన్నాడు. చిన్ననాటినుండియు శ్రీకృష్ణుని సఖునిగానే తలంచినను, నేడాదృష్టి యర్జునునకు లేదు. శ్రీకృష్ణుడెట్టి దోషములును లేని, కేవల విజ్ఞానమయ సర్వభూత మహేశ్వరుడయినాడు. అర్జునునికి గురుని యథార్థ రూపము తెలిసినది. కనుకనే, భగవంతుడు తానే గంభీర స్వరముతో, "అనసూయుడవైన నీకిపుడు, గుహ్యాతమ యోగమును ససాధనముగా నుపదేశింతు" నన్నాడు.

బలే! అర్జునుడు వినువాడు. ప్రచ్చకొనువాడు. మఱి భగవంతుడే పలుకువాడు, ఇచ్చువాడు. ప్రత్యేక మనుష్యుడును, అర్జునునిబోలి యనసూయుడైనపుడే, యీ యోగప్రకరణమును గ్రహింపగలుగును.

మన మెఱుగముగాని, ప్రత్యేక మనుష్య దేహరథముపై గూర్చుండి, ఇంద్రియాశ్వముల నడుపువాడై, హృదయస్థాంతర్యామి దేవతయై, ప్రియసుహృదుడై, యచ్యుత సారథియై, భగవంతుడే యీ తత్త్వజ్ఞానోపదేశమును జేయుచున్నాడు.

ఓ యమృతపుత్త్రికులారా! మీరు నిజముగా నమృత ప్రాప్తికే ప్రయాసపడుచున్న వారలేని, యథార్థముగా మీరర్జునునివలె ననసూయులైతిరేని, రారండు; ఈ గుహ్యాతమ యోగమును గ్రహింపుడు. మీ జీవనములు శాన్తిమయము లగును.

"జ్ఞానం విజ్ఞానసహితమ్" విజ్ఞానముతోడి జ్ఞానము. విజ్ఞానమనగా నిచట సాధనము. "విజ్ఞాయతే అనే నేతి

విజ్ఞానమ్" అనఁగా, నేయుపాయముచే జ్ఞానలాభమగునో; యా యుపాయమే యిచట విజ్ఞానపదముచే లక్షింపఁబడినది.

భగవంతుఁడు— "అర్జునా! నేను కేవల తత్త్వోపదేశ మాత్రమేచేసి, నిశ్చింతముగా నూరకుండను. అధ్యాత్మత మయ జ్ఞానమును నీవు పొందగల్గు నుపాయమును సైతము నీకు సవిస్తరముగాఁ జెప్పెదను" అన్నాఁడు.

ఇది గుహ్యతమము-అతిశయగోపనీయము, అని సాధార ణార్థము. గుహ్యపదమునకు వాస్తవార్థమేమనఁగా "గుహా యాం నిహితం గుహ్యమ్" గుహాయందు, అనఁగా నిర్మల బుద్ధియందు (సత్త్వమునందు) నిహితమైనదే గుహ్యము. భగవచ్ఛంకర పూజ్యపాదులును గుహ్యశబ్దమున కీ యర్థమునే చేసిరి. ఉపనిషత్తులయందునుఁ బలుతావుల, గుహాశబ్దము బుద్ధియను నర్థమందు వ్యవహరింపఁబడినది. నిర్మల బుద్ధిగ్రాహ్య మైన తత్త్వము సాధారణులకు, అనఁగా మలిన బుద్ధిసంపన్ను లకు గుహ్యమే-అప్రకాశ్యమే. అట్టిచోట నీ తత్త్వము ప్రకా శింపదుగాన నీ జ్ఞానము గుహ్యతమ మనఁబడినది.

ఈ మంత్రమందు భగవంతుఁడు "గుహ్యతమ అన సూయ" అను రెండు మాటలు ప్రయోగించి విశిష్టాధికారిని సూచించెను. గుహ్యతమపదము జ్ఞానవిశేషణము; అనసూయ పదము, అర్జున విశేషణము గాను బ్రయోగింపఁ బడెను. ఈయపూర్వజ్ఞానమెట్టి యధికారియందుఁ బ్రతిభాసింపఁగలదో, దానిని దెల్పుటకే గుహ్యతమ విశేషణప్రయోగము. ఎట్టి శిష్యుఁడు, ఈ జ్ఞానమును గొన నధికారియో తెల్పుటకే,

అనసూయపదము ప్రయోగింపఁబడెను. ఎవ్వనికి దోషదృష్టి లేదో, ఎవని బుద్ధి నిర్మలమైనదో, వాఁడు మాత్రమే, యీ రాజగుహ్య యోగమున కధికారము గలవాఁడు.

"యద్ జ్ఞాత్వామోక్ష్యసేఽశుభాత్" దేనిని దెలిసికొని నీ వశుభమువలన విడువఁబడుదువో;— అశుభము= అమంగళము. ఈ జగమునందు మృత్యువొక్కటే యమంగళము. అశుభమువల్ల ముక్తియనఁగా మృత్యువువలని పరిత్రాణమే సూచింపఁబడును. ఏ తత్త్వజ్ఞానమును లెస్సగాఁ బొందుటచే మృత్యువనెడి మాటయే మఱియుండదో, (జననముండినం గదా మృత్యువు.) కనుక, జననమరణముల కతీతమును సంసారగతి కతీతమునైన యమృతపదము లభింపఁజేయును. శ్రుతియు "యజ్ జ్ఞాత్వావిముచ్యతే" "అతిమృత్యుమేతి" అన్నది కాదా. జ్ఞానమును దప్పించి యెన్నఁడును ముక్తినొందలేఁడు. అశుభనివృత్తి కాదు. ఆ యమృత స్వరూపజ్ఞానమును దేనిచే యోగ్యాధికారులు సుగముగా నొందఁగలరో, యా రాజగుహ్య యోగమును దయామయుఁడు భగవంతుఁడు, అర్జునుని నిమిత్తముఁ జేసికొని, యోగ్యాధికారి మనుజులను లక్ష్యమందుంచుకొనియే, యవతరింపఁజేసెను.

శ్వేతాశ్వతరోపనిషత్తునందు "యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథాగురౌ। తస్యైతే కథితాహ్యర్థాః" దేవునం దెట్టి పరాభక్తియుండునో. యటులే గురువునందునుం బరాభక్తి నిల్చిన వానికొఱకే యీ తత్త్వజ్ఞానోపదేశరహస్యము లన్నియుఁ జెప్పఁబడును." ఈ వాక్యమందు రవ్వంతయు నతి

రంజితములేదు. మువ్వాటికి సత్యముగా గురువు నందీశ్వర భక్తినిలువనంతదాఁక — అనఁగా గురుఁడే ప్రత్యక్షముగా నీశ్వరుఁడను గట్టి తెలివి నిలువనంతదాఁక, నీ రహస్యమొక టియు నవధరించుకొనఁజాలఁడు. వైదిక యుగారంభమునుండి నేఁటిదాఁక నీ తత్త్వజ్ఞానోపదేశము గురుపరంపరాక్రమమున సాగివచ్చుచున్నది. వేలకొలఁది ముద్రితగ్రంథములుగాను, వేలకొలఁది వక్తలకంఠములనుండియు నిది ప్రచారితమగు చున్నను, కొలఁదిమంది మాత్రమే యీ యుపదేశము నవ గతము చేసికోఁగల్గుచున్నారు కదా- ఇదేమిపాపము ? ఎల్లరకు నీ జ్ఞానమబ్బదేమి? ఆఁ. అశ్రద్ధయొక్కటే దానికిఁ గారణము.

రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్॥ ౨

ఈ జ్ఞానము విద్యలరాజు అనఁగా శ్రేష్ఠము, అతిశయ గోపనీయము, పవిత్రము, ఉత్తమము, నైనది. దీని ఫలము ప్రత్యక్షము, ఇది ధర్మశాస్త్రానుమోదితము; అనాయాస సాధ్యము, అవ్యయము.

ఈ మంత్రమందు భగవంతుఁడు ముందుగా రాజ గుహ్య (యోగ) జ్ఞానమహిమమును గీర్తించుచున్నాఁడు. నేను నీకుపదేశించు జ్ఞానము రాజవిద్య. విద్యలలో శ్రేష్ఠము. శాండిల్య విద్యా, దహరవిద్యా, ఉపకోశలవిద్యాదులు, ఎన్నివిధముల విద్యలు వేదాది శాస్త్రములయం దుపదేశింపఁ బడినవో, వానిలో నెల్ల నీ నా చెప్పఁబోవు విద్యయే సర్వ

శ్రేష్ఠము, ఏలన, నిది సాక్షాత్ బ్రహ్మవిద్యా స్వరూపము. "యయాతదక్షర మధిగమ్యతే సా విద్యా" దేనిచేత నక్షర బ్రహ్మ ప్రాప్తికాఁగలదో యదే విద్య. మును జెప్పిన శాండిల్యాది విద్యలు, పరంపరా సంబంధముచే నక్షర బ్రహ్మ ప్రాప్తికి హేతువులగును, గాని యీ రాజ (విద్యా) జ్ఞానమా సాక్షాద్ బ్రహ్మ విద్యా స్వరూపము. తక్కు విద్యలను బట్టి చూడ, నిది సర్వశ్రేష్ఠము.

"రాజగుహ్యమ్" గోపనీయ వస్తువులలో బహుశ్రేష్ఠమైనదే రాజగుహ్యము. ధర్మమే మొట్టమొదటి గుహ్య వస్తువు. దానిని బట్టిచూడ నీశ్వరత్వము గుహ్యతరము. దానిని బట్టిచూడఁ బరమాత్మ గుహ్యతమము. కనుకనే దీనిని రాజ గుహ్యమందురు. ఈ జ్ఞానమును గ్రహింపఁగలది యేకాన్త నిర్మల బుద్ధియే, కనుక నిది గుహ్యతమ మనఁబడినది. మఱి యొక యర్థమును జెప్పికొందము – "స్వయంరాజతే" స్వప్రకాశ రూపమాటచే సైతము, ఈ జ్ఞానము గుహ్యము, నిర్మల బుద్ధికాని వానియెడ నిది ప్రకాశింపదు. బుద్ధికి నిర్మలత్వము, మాలిన్యము, అనఁగా నేమి? రజస్తమోగుణములచేఁ దిరస్కరింపఁబడిన సత్త్వగుణమే బుద్ధిమాలిన్యము ఆరెండిటిని దిరస్కరించి సత్త్వమే ప్రబలమైయుండు నవస్థయే బుద్ధి నిర్మలత. ఇంకను దెలియఁ జెప్పవలెనన్న – భగవంతుని యస్తిత్వమందు దృఢవిశ్వాసము పేరే సత్త్వగుణము. ఇట్టి సత్త్వగుణముతో బుద్ధి నిండిపోయినపుడే బుద్ధిసత్త్వము నిర్మలమైన దన్నమాట. ఆస్తిక్య పూర్ణబుద్ధినే నిర్మల బుద్ధి యందురు. ఎట్టి సంశయ

ముచేఁగాని, విపరీత భావనచేఁగాని, యస్తిత్వాజ్ఞానము కలుషితము కాకున్నపుడే, ఆ స్థిత్యబుద్ధి పూర్ణముగాఁ బ్రతిష్ఠితమగును. ఇట్టి నిర్మల బుద్ధికంటె భిన్నముగా స్వయం ప్రకాశ పరమాత్మ జ్ఞానము వెలయుచోటేదియు నుండదు. కనుక నే దీనిని రాజగుహ్యాయోగ మందురు. ఇది (శ్రీ)గురుని కరుణచేతనే కలుగఁగలదు. కనుక నే భగవంతుడు, "బుద్ధియోగం దదామ్యహమ్" ఆ బుద్ధియోగము నేనీయవలసినదే యన్నాఁడు.

పవిత్రమ్ = విశుద్ధము, నిర్మలము; పూర్తిగా ద్వైత ప్రపంచ రహితము కనుక నే పవిత్రము. తాను విశుద్ధమై యుండుటే కాక, మఱియొక దాని యందలి దోషములను శోధించును; కనుకను బవిత్రము. ప్రాయశ్చిత్తము మున్నగు కర్మములచేఁ బాపక్షయమగును. సరే; అవియుఁ బవిత్ర కారకములే, యైనను బ్రహ్మైకత్వ విజ్ఞానము, అజ్ఞాన రూపపాపము నంతటిని నిర్మూల మొనరించును. ఎట్టి యపవిత్రతయు నుండదు. కొన్ని ప్రాయశ్చిత్త క్రియలు కొన్ని పాపములనే మాపును, గాని యీ రాజగుహ్యాజ్ఞానము సర్వపాపములను, అనాత్మ ప్రతీతి రూపపాపమును సైతము క్షయింపఁజేయును, గనుక నిది యతిపవిత్రము.

'ఉత్తమమ్'=ఉత్ - ఊర్ధ్వగతి; ధర్మమే యథార్థమైన యూర్ధ్వగతి స్వరూపము. భగవద్విశ్వాసమే యూర్ధ్వగతుల యందు శ్రేష్ఠము. మఱి, యీభగవంతునియం దాత్మబుద్ధియే యూర్ధ్వగతులకుం జరమము. కావున నీరాజగుహ్యాయోగ ముత్తమము; కనుక నే భగవంతునికి "ఉత్తమ పురుషుఁడు,

పురుషోత్తముఁడు, అని యొక నామము. ఒక్క పరమాత్మయే యుత్తమ పురుషుఁడు. ఈ రాజగుహ్యయోగ మాయుత్తమ స్వరూపమందు అనఁగాఁ బరమాత్మ స్వరూపమందుఁ బ్రతిష్ఠితుఁడగుటకు సర్వశ్రేష్ఠోపాయము, గాన నిదియు నుత్తమమే.

ఈ రాజగుహ్యయోగ ప్రస్తావమందు, ఇట్టి మహాత్వము నుగ్గడించుట విని అర్జునుఁడు -"అబ్బో! మహత్త్వమండితమైన యిట్టి యోగము వలని ఫలమును, స్వభావముచే సాధారణ జీవుఁడాశించినను, అది యెన్నఁడో కాలాంతరమందో, జన్మాంతరమందో, కళ్ళఁజూడ వలసినదే; ప్రాణములొడ్డి ప్రయత్నించినను; అనుశీలించినను, సుదూర భవిష్యత్తు నందెప్పుడో కాఁగలదే"యని శంకింప వచ్చునని, ఈ యాశంకను నిరసించుటకే భగవంతుఁడు, "ప్రత్యక్షావగమమ్" అని దీని ఫలము, అనుశీలన కాలమందే ప్రత్యక్షము సుమా యని బోధించెను. వాస్తవముగా, జ్ఞాన స్వరూప వస్తువు నొంద, సాధనమనఁగా నేమి? జ్ఞానము స్వయం ప్రకాశము; అది ధ్యానాది స్వరూపము కాదు; ఒక విధమైన యుపాసన క్రియగాని, యౌగిక క్రియగాని కాదు. జ్ఞానము జ్ఞానమే; జ్ఞానమొక్కటే ప్రత్యక్ష వస్తువు. దానికంటె నితరములన్నియుఁ బరోక్షములే. ఇందులకై యొక యాత్మ సంవేదన వాక్యము :- "ప్రత్యక్షమాత్మా విషయః పరోక్షమ్, గ్రాహ్యాక్షభిద్వ్యర్థైః కథంనువత్స్యాత్, సాక్షాన్నిహాయ పరోక్షముఖ్యాః" పరమాత్మ యొక్కటే ప్రత్యక్ష వస్తువు; విషయములు

పరోక్షములు; ఏలన, ఇంద్రియము లనెడి ద్వారముల సహాయమున నే విషయ జ్ఞానము గలుగును. బిడ్డలారా సాక్షాద్వస్తువును విడిచి పరోక్ష వస్తువునెడ, మీ రేల ముగ్ధులు కావలయును ? ఏ మయినను, ఈ రాజగుహ్య యోగమే, పరమాత్మ వస్తు స్వరూపమందుఁ జేరుటకు సర్వశ్రేష్ఠోపాయము, కనుక నే "ప్రత్యక్షావగమమ్" అనెను.

అటులయినచో, నిది కప్పలను మేఁకలను హోమముచేసి, పశులకు వెతలు గలిగించి పగతీర్చుకొనఁజేయు ధర్మ విగర్హితమైన యాభిచారక క్రియవంటిదా ? లేక యొక విధమైన యుద్భట జ్ఞానవిశేషమా ? య నెడి శంకను బరిహరించుటకై భగవంతుఁడు "ధర్మ్యమ్ = ధర్మాదన పేతమ్." శ్రుతి స్మృత్యాది శాస్త్రానుశాసన ప్రతిపాదిత ధర్మములకు దూరము గాక, వానిచే ననుమతింపఁ బడినది. మఱొక్కమాట, ఈ జ్ఞానమే లోకస్థితిని ధరించుచున్నది. పరమాత్మయే లోక స్థితి రక్షకై, విధృతి రూపముతో, సేతురూపముతో, ధర్మరూపముతో నిత్యము విరాజిల్లుచున్నది" అని శ్రుతియే యనుచున్నది. దీనిచే నీ రాజగుహ్యయోగము ధర్మ విగర్హితము కాదు సరిగదా, ధర్మానుమోదితమునై యున్నది.

ఇంత సుఫలమా ! ఇంత మహాత్త్వమా ! అట్టైన నిది బహు కఠోర సాధ్యము కావలయును, అనెదవేమో ? కాదు; ఎన్నఁడునుఁగాదు. "సుసుఖం కర్తుమ్" అర్జునా ! ఇది యనాయాస సాధ్యము; జ్ఞాన స్వరూపవస్తువు, ఒక యనుష్ఠాన స్వరూపము కాదు. అధికారి భేదమును బట్టి కష్టసాధ్యము

కాఁగలను. గాని స్వరూపముచే జ్ఞానమే. అది యాయాస సాధ్య మైనాఁడునుగాదు. గాన, మంత్రమందు "సుసుఖం కర్తుమ్" అనెను. ఇదే నిజము. చిత్తశుద్ధియగు పర్యాప్తము, తపస్సు, ఉపాసనము మున్నగునవి ప్రయోజనీయములే, కాని చిత్తశుద్ధికాఁగానే, భగవత్కృపచే, నరగడియలో దాని స్వరూపము తనంతనే యుద్భాసితమగును. గాన నెప్పుడును జ్ఞానస్వరూప వస్తు వనాయాస సాధ్యమే.

"అవ్యయమ్" ఇంత సుఖసాధ్యమైనపుడు, దానిఫలము, బహుశః క్షణస్థాయి యగునేమో ? లేదా, యీ జ్ఞానము వికారియగునో, యని తలఁపకుమా. కాదటులు కాదు. ఇది యవ్యయము. ఎట్టి రూపాంతరము నొందని దానినే యవ్యయ మందురు. ఈ పరమార్థతత్త్వజ్ఞానము భిన్నభిన్న రూపాంతరముల నెన్నఁడును బొందదు. ఈ యపరిమేయ - అసీమ నానాత్వమందు సైతము, దీని స్వరూప విచ్యుతికాదు. దీనికి క్షయోదయములులేవు. ఈ స్వయం ప్రకాశ స్వరూపసంవిత్తు, "నోదేతి నాస్తమేతి" ఉదయింపదు, అస్తమింపదు. "సంవిదేషా స్వయంప్రభా" ఈ సంవిత్తు స్వయం ప్రకాశ స్వరూపము. ఎట్టి వికారమును బరిణామమును బొందదు. కనుకనే, యీ రాజగుహ్యజ్ఞానము, అవ్యయము, అవినశ్వరము.

అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప ।
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని॥ 3

ఓయి, పరంతపుఁడా! అనాత్మ వస్తువులను దహింపఁ జేయువాఁడా ! (భేదజ్ఞానోన్మూలనమం దుద్యతుఁడా) యని

భావము. ఈ ధర్మము నెడ శ్రద్ధాహీనులైనవారు నన్నుఁజేర లేక మృత్యుమయ సంసార మార్గమందే రాకపోకలు జరుపు చుందురు. మును జెప్పిన రాజగుహ్య యోగ మహత్త్వ మును వినినమనుజునకు — 'ఇది యిట్టి యనాయాస సాధ్యమును, వేద విహితమును, అవ్యయమునైన ధర్మ మైనపుడు, విశేషించి భగవంతుఁడే దీని నుపదేశించువాఁడై నపుడు, సంశయ మెట్టిదియు నుండరాదు; గాని యెల్లరు నిట్టి యనాయాస సాధ్యమును, అవ్యయ ఫలదాయకమునైన యీ ధర్మము నేల యనుష్ఠింపరు?' అనెడి శంక కలుగవచ్చును. దానిఁ దొలఁగించుటకే భగవంతు డీమూఁడవ మంత్రము నవతరింపఁజేసెను.

పరంతపుఁడనగా శత్రునిషూదనకారి. కామక్రోధాదు లైన యంతశ్శత్రువులను సంతపింపఁజేయ సమర్థుఁడు. లేదా, పరశబ్దార్థము, అనాత్మభావములు. వానిని బూర్తిగా సంత పింపఁజేయఁగలవాఁడైన— అనగా విశుద్ధాత్మ స్వరూపమం దుపనీతుఁడగుట కుద్యమించువాఁడైన వానినే పరంతపుఁ డందురు. ఇట్టి యధికారియే యీ రాజగుహ్యయోగమును విన యోగ్యుఁడు. కనుకనే భగవంతుఁడు "పరంతప" యని యర్జునుని సంబోధించెను.

ఈ ధర్మము నెడ - ఆత్మజ్ఞానలక్షణమైన యీ పరమ ధర్మస్వరూపము నెడ, దానివలని ఫలము నెడ, దాని సాధనము నెడ, శ్రద్ధాహీనులైన వ్యక్తులు, అనఁగా విశ్వాసము లేని విమూఢవ్యక్తులే, నన్నొందక మృత్యుమయసంసార మార్గ

మందే యెన్నటికిని రాకపోకలు సలుపుచుందురు. తఱుచుగా
శాస్త్రసమ్మతకర్మముల నాచరించుటచేతనే, ధర్మలాభమైపోవ
ననుచుందురు. వాస్తవముగా నటులుకాదు. ఎట్టి జ్ఞానమందు
ప్రతిష్ఠితులై విధ్యుక్తకర్మముల నాచరింపవలయునో యెఱుంగ
కయు' ఎఱింగినను దానియెడ శ్రద్ధాహీనులై యాకర్మము
నాచరించుటచే నెన్నఁడును యథార్థధర్మము కాఁజాలదు. ఆ
రాకపోకలుండవ్వవు. జ్ఞానమొక్కటే మోక్షోపాయమను నెడ
సర్వశాస్త్రములకు సమ్మతియే. కనుక నీ పరమార్థతత్త్వ
జ్ఞానము నెడ, శ్రద్ధలేనివారికి, బుద్ధిమాలిన్యవశమున నీయపూ
ర్వజ్ఞానమును కోన నసమర్థులైనవారికి, సంసార చక్రపేషణ
మనివార్యము. సరే. యేమైనను ముందురాఁబోవు మంత్రము
తాత్పర్యమును, హృదయంగమ మొనర్చుకొనఁ గల్గినచో,
నీమంత్రము నర్థము మఱింత సుగమమగును.

తొలిమంత్రమందు భగవంతుఁడు, జ్ఞానాధికారిని నిరూ
పించి, రెండవ మంత్రమందు జ్ఞానమహిమను వర్ణించి, యిమ్మం
త్రమందు జ్ఞానవిముఖవ్యక్తుల దురవస్థను గుఱించి పలికెను.
ఇపుడింకఁ బ్రస్తావిత రాజగుహ్యయోగము నవతరింపఁజేయు
చున్నాఁడు.

మయాతతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా।
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః॥ ౪

జ్ఞానము నుపదేశింతునని కదా ప్రతిజ్ఞచేసెను. ఈ
కానవచ్చు జగము (ప్రకాశస్వరూపాత్మనగు) నాచే, పత్యాం
తరమున, మయా=మాత్రా=అమ్మచే; మా శబ్దమునకిది

తృతీయైకవచనరూపము; అవ్యక్తమూర్తిచేత, సూక్ష్మరూప కారణాత్మచేత వ్యాప్తమైయున్నది. సర్వభూతములు నా యందున్నవి. "మయిసర్వం ప్రతిష్ఠితమ్" శ్రుతి సర్వాధార త్వమువలన నాకు ఆధేయత్వము సంభవించుచున్నదని భావము. కాని యా సర్వభూతములందును నేనవస్థితుఁడను గాను.

మున్నిట్లు జ్ఞానస్తుతి, అజ్ఞాననిందచేయుచు, భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు అర్జునునిచే జ్ఞానగ్రహణము చేయింప మిగులఁబట్టుదలతో, నిపుడు తాఁజెప్పనెంచిన దాని యుపదేశ మారంభించెను. జగద్గురుఁడు భగవంతుఁడు ఒక మనుష్యుని దేహమనెడి యాసనమునఁ గూర్చుండి, తత్త్వజ్ఞానోపదేశము చేసి, బహుజన్మ సంచితమైన యజ్ఞానమును, నశింపఁజేయఁ బూనినచో, దానికెంతో మున్నే తెలియునట్లో తెలియనట్లో యా శిష్యునకుఁ బట్టుదలను జిత్తశుద్ధిని గలిగింప నెన్నివిధముల యుపాయములనో, యవలంబింపఁజేయును.

ఒకప్పుడు స్తుతి, యొకప్పుడు నింద, యొకప్పుడు సుఖ దుఃఖముల తాడన, ఒకప్పుడు శారీరకవ్యాధి, మున్నగు వాని వలన (వానిని బెట్టి) జగత్తు నశ్వరమనెడి బోధము నుద్దీపింపఁ జేయఁ బ్రయాసపడును. ఇది మనము కనుచున్నాము. మఱి యొకవంక, నిత్యము నవినశ్వరమైన దానియెడ నాగ్రహము (పట్టుదల) ఎట్లుమెండగునో, యదియు నాతనికిఁ దెలియకయే యెన్నోవిధములఁ బ్రయత్నించును. అది యుండనిండు.

ఇపుడు జగద్గురుఁడు తాఁజెప్పఁదలఁచిన దాని నుపదేశించుచున్నాఁడు. సాధకా! ఏకాగ్రచిత్తముతో గ్రహింపఁజూడుము. వ్యర్థమైన విచారతర్కములను విడిచిపెట్టి, "ముమ్మాటికి నేనేమియు నెఱుఁగ"ననుచు, మిథ్యాభిమాన శిరస్సును బూర్తిగావంచి శాన్తముతో గ్రహింపఁబూనుము.

"మయాతతమిదం సర్వం జగత్" ఈ జగమంతయు నాచేతనే పరివ్యాప్తమైయున్నది. "దేవా! దీని నెట్లు నమ్మునట? నీవును నావలెనే యొక జనుఁడవు. మనుజమాత్రుఁడవు. నీవు చరాచర విశ్వవ్యాపివంటే నెట్లు నమ్మెదను? నా మనసు దీనిని మన్నింపకున్నది." అందువేమో? సరే, చూడు. "అవ్యక్తమూర్తినా" నేను నా యవ్యక్తమూర్తితో జగము నందంతటను వ్యాపించి యున్నాను.

"స్వామీ! అవ్యక్తమనఁగా, నింద్రియగోచరము కానిది. అరే-ఇంద్రియగ్రాహ్యము కానివస్తువు మూర్తి యెట్లు కాఁగలదు? ఏదేనొక విధమైన మూర్తియైననే, యది యింద్రియ గ్రాహ్యము కాఁగలదు. అపుడది యవ్యక్తము కాఁజాలదు. 'అవ్యక్తమూర్తినా' యను దాని తాత్పర్యమందకున్నది." సరే, దీనికి సమాధానము తరువాత నిరూపింపఁబడును. ముందుగా నీవు తెలిసికొనఁ బ్రయత్నింపుము. చూడు నీలోనే నేను "అహమ్" అనుచు, ఉత్తమ పురుష రూపమున నెల్లప్పుడు నేది వెలయుచున్నదో, నీ దేహము, నీమనస్సు, ప్రాణము, మున్నగు వానికంటే వేఱయి యెల్లప్పుడు ప్రకాశించుచున్నదో, ఆ నేనే (అహమ్మే) నేను, ఆత్మ.

పురుషోత్తముఁడను. ఆ నేను, నీవుకాదు. ఇపుడు చూడు "మయాతతమిదం సర్వమ్" నాచేతనే యీ జగత్తంతయుఁ బరివ్యాప్తమైనది. నీ దేహము మొదలు జగత్తనుచు, నీవు తెలిసియో తెలియకో దేనిని గ్రహించుచున్నావో, తలంచుచున్నావో, విచారముచేయుచున్నావో, యది యంతయు, ఈ నేను (అహమ్) చేతనే పరివ్యాప్తము. (అః=విష్ణుః, హః=శక్తిః; అస్యచహస్యచ సమాహారః అహమ్ శక్తియుతుఁడైన సర్వ వ్యాపక విష్ణువేఅహమ్-నేను) నేనులేనిచోట వేఱేదియు నుండఁ జాలదు. నీవు తెలిసియో తెలియకో, దేనినేనిఁ జేకొనుటో, విడుచుటో, చేయుదువో యా పదార్థములందన్నింటను, ఈ నేను పడుగుంబేకవలెఁ జేరియే యున్నది. (అల్లుకొనియున్నది) ఈ దేహమును జూచుచున్నావు. అపుడును జేరియే యున్నది. ఈ విశ్వమును భోగించుచున్నావు. అపుడు నున్నది. ఆలు, కొడుకు, కూఁతురు, ధనము, విత్తము, రూపము, రసము, గంధము మున్నగు సర్వభావములతోను 'నేను' చేరియే' యున్నది. సత్తామయుఁడును, చైతన్యమయుఁడును నైన నా (నేను యొక్క) వక్షముపైనే, నీవు, నీ యీ భోగ్యజగత్తు నెలకొనియున్నది. "నేను" లేనిచో నాసత్త స్ఫురించుటే కాదు. నేను, అనుదాని ప్రకాశమే లేనిచో, మఱి, నీవు, నీది, యనుట కేమియునుండదు. నీ మనసు, బుద్ధి, యింద్రియములు, మొదలుగా, నీవాదరించు నీదేహమువఱకు, నా (నేను యొక్క) గుండెపైనే నిల్చియున్నవి. పైని, దిగువను, కుడిని, యెడమను, ఎదుట, వెనుక, లోను, వెలిని, అంతట, నేనొక్కటే నెలకొని

యున్నది. నన్ను (నేనును) విడిచి, నీది యనుటకేమియు లేదు. ఉండను జాలదు. నీవు కనులు మూసికొన్నావు. నన్ను (నేనును) జూడఁగోరవు. నిశ్చింతముగా గడియలు కడపుచున్నావు. కనుకనే, యీ విశ్వవ్యాపి, యవ్యక్తమూర్తిని, అహంరూపి (నేననెడి) భగవంతుని గనలేకున్నావు. ఇంతకాలమును జూడకున్న హాని లేదు కాని, సాధకుఁడా ! నేఁడతఁడు నీ సారథియై, నీయింద్రియాశ్వముల పగ్గములు పట్టి, దేహరథముపైఁగూర్చుండి, గురుమూర్తితోఁ బ్రకటితుఁడై, తన స్వరూపమును జూపుచున్నాఁడు. "మయాతతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా" అబ్బాయీ! చూడు; కొడుకా! చూడుము; శిష్యా! చూడవోయి! వెదకికోఁకు. ఊరకచూడు. నేనవ్యక్తమూర్తితో సర్వజగత్తును వ్యాపించియున్నాను. అవ్యక్తుఁడనైనను, అతిసువ్యక్త రూపముతోనే యెల్లెడను వెలయుచున్నాను. నీవనసూయుడవైనావు. నీ బుద్ధి నిర్మలమైనది. తప్పక నా యీ సువ్యాతమను ప్రకట స్వరూపములను నీవు చూడఁగలవు. ఊరక చూచుటకే నీ చూపు సారింపుము, సంశ్రపాణముతో నమ్ముము. నిజముగా నన్నుఁ జూచెదవు.

అర్జునా ! ఇపుడు అవ్యక్తవస్తు వేవిధముగా మూర్తి కాఁగలదో తెలియఁబ్రయత్నింపుము. సర్వేంద్రియ వివర్జిత మయ్యును సర్వేంద్రియ ధర్మయుక్తమైనదే యీ యవ్యక్త మూర్తి. "అహమ్, ఆత్మ-నేను"- పరమేశ్వరుఁడు, ఇచ్చట "అవ్యక్తమూర్తినా మయా" అనక, 'అవ్యక్తస్వరూపేణ

మయా' అనినచో, నపుడు మఱల, అతీంద్రియమైన యొక సూక్ష్మతత్త్వ మాత్రవస్తుబోధమే యగును. అనఁగా-కాలము ఆకాశము మున్నగు వానివలె, జడత్వధర్మముగల యొక పదార్థముయొక్క బోధమే యగును. వాస్తవముగా నది కాఁజాలదు. నేను చేతనుఁడను. చైతన్యమే నా (నేనునకు) స్వరూపము. జడత్వము బిందుమాత్రమేని నన్నంటదు, అంట జాలదు. 'నేను' సర్వేంద్రియ వివర్జితుఁడనయ్యును, సర్వేంద్రియధర్మసమన్వితుఁడను నేను, "అపాణిపాదో జవనోగ్రహీతా, పశ్యామ్యచక్షుశ్చ శృణోమ్యకర్ణః" సాధకా! నీవు వ్యక్త స్వరూపమైన యీ నా స్థూలమూర్తిని జూచుచున్నావు. ఇది నా (నేనుయొక్క) యథార్థస్వరూపముకాదు. శుద్ధచైతన్య స్వరూపుఁడనైన నేను. మాయావశమున నీ యెదుట నీ స్థూల రూపముతో వెలయుచున్నాను. ఈ నా మాయామానుష మూర్తి యెన్నఁడును సర్వవ్యాపి కాఁజాలదు. ఏ స్వరూపముతో నాచే "ఇదం సర్వం తతమ్" ఈ పరిదృశ్యమానజగత్తు వ్యాప్తమైనదో, ఆ స్వరూపము, ఈ మాయామానుషమూర్తికాదు. ఆ స్వరూపముతో నేను బూర్తిగా నవ్యక్తుఁడనైనను, వ్యక్తి ధర్మయుక్తమైన రూపముతో నిత్యము విరాజిల్లుచున్నాను. నిర్మలబుద్ధి సంపదలేనివారు, నా తాల్చిన యేదేనొక విశిష్ట వ్యక్తరూపమునే, స్థూలరూపమునే ధారణచేయుచుందురు. కాని నిర్మల బుద్ధి సంపన్నులు, నా యీ సర్వవ్యాపిమూర్తినే విశిష్టభావముతో లక్షించుచుందురు.

అర్జునా ! నా యీ వ్యక్తమూర్తినే, యీ స్థూల మాయామానుషమూర్తినే, సర్వవ్యాపిగాను, సర్వ శక్తిమత్పరమేశ్వరునిఁగాను నెన్నుచుఁ గూర్చుండు వారే కనిష్ఠాధికారులు. వారు నా స్వరూపము నెఱుంగఁజాలరు. కాని, నీవో యనసూయుఁడవై తివి. నాయందీశ్వరబుద్ధియే పూర్తిగాఁ బ్రతిష్ఠితమైనది. కనుకనే నీకు నా యవ్యక్తమూర్తిని జూపఁ బ్రయత్నించుచున్నాను. దానిని జూచితివేని, సర్వవిధముల యమంగళములుం దొలఁగిపోవును.

"మత్ స్థాని సర్వభూతాని," సర్వభూతములు నాయందు నెలకొనియున్నవి. చూడు, నన్ను వెనుకఁబెట్టినచో, భూతభౌతిక పరిదృశ్యమానమైన యీ విశ్వమున కెట్టి సత్తయు నుండదు. నేను సత్తారూపముతో, నధిష్ఠానరూపముతో, నా యీ విశాలవక్షమును, అందఱిమెదుటఁజాచి యుంతును. అప్పుడే యిక్కడనవచ్చు విశ్వము సత్తామయమై ప్రకాశించును. సుషుప్తిదృష్టాంతముచే నిమ్మాట చక్కగాఁ దెలియఁ బ్రయత్నింపుము. నీవు గాఢనిద్రయందుండునపుడు, నీ యహంత్వబోధము (నేనున్నాననెడి తెలివి) పర్యస్తము అప్రకటముగానేయుండును. అప్పుడు నీయెడ నీ విశ్వసత్తయే యుండదు. నీ 'నేను' సుషుప్తమైయుండునపుడు, నీ యీ భోగ్యవిశ్వము, అనఁగా నీ యీ దేహము మొదలు సర్వమును విలుప్తమైపోవును. ఆ నేను మఱల మేలుకొన్నపుడు, (జాగరితమైనపుడే) యీ విశ్వము, నీ దేహము సత్తామయమైలేచును. ఈ విధముగా నెఱింగికొనుము. సర్వభూతములు నొక్క నేనునందే యవస్థితములై

యున్నవని చక్కఁగా ననుభవింపఁగలవు. సర్వరూపములతోఁ బ్రకాశించునదంతయు, నా ('నేను' అనుదాని) సత్తచేతనే సత్తామయమైయున్నది. నాప్రకాశముచేతనేప్రకాశించుచున్నది.

"నచాహం తేష్వవస్థితః" కాని, నేనా సర్వభూతముల యందు నాధారపడి యుండలేదు. సత్తామయుఁడనగుట చేత నీవిశ్వప్రపంచమునకు నాధారముగా నేనున్నాను. మఱి చైతన్య రూపముతో దీనిని బ్రకాశింపఁ జేయుచున్నాను. కాని, యీ విశ్వము నన్నాధారరూపముగా ధరింపలేకున్నది. నేనే సర్వాధారమను. నాకాధారమేమియులేదు. ఉండజాలదు. ఆధారమనై, సర్వభూతములను నేను ధరించుచున్నాను. కావున నాధేయ రూపమగు నా సర్వభూతములతో నా కెట్టి సంలేప సంబంధమును లేదు. నేనాకాశమువలె నిర్లిప్తుఁడను. భూత సమూహము, మూర్త-వ్యక్తవస్తువు. నేనో-అవ్యక్త చైతన్య స్వరూపుఁడను. వ్యక్త వస్తువులతో నీ యవ్యక్త స్వరూప వస్తువునకు, నిత్యము నాధారాధేయ రూప సంబంధ మున్నను, బరస్పర సంశ్లిష్ట దోషములేదు. ఆకాశము, కాలము సర్వమూర్తి సంయోగులైనను, అనఁగా సర్వపదార్థ ములకు నవి యాధార స్వరూపముగా నున్నను, ఆధేయ వస్తువులనంటిన గుణదోషాదులచే సంలిప్తములుగా నుండ నటులే, సూక్ష్మ రూపమున 'నేను' ఆత్మరూపమున సర్వ వస్తువులకు నధిష్ఠాతను, బ్రకాశకుఁడనునై యున్నను, కేవ లము నిర్లిప్తుడను. కనుక "నచాహం తేష్వవస్థితః"

సర్వసాధకమండలి కొక్కమాట—సర్వ సంప్రదాయ ముల వారికిని, ఈయపూర్వ గీతావాణి వినుచున్నది.—

ఎవరె సంప్రదాయ మెట్టిదేగానీ; ఎవఁడేరీతినే నుపాసింపనీ; తన యిష్టదేవత కేవఁడేపేరేనిఁబెట్టనీ; ఏ రూపమేఁగానీ; ఆయిష్టదేవతయే సర్వవ్యాపి, సర్వశక్తిమంతము, అను చోట నెట్టి మతభేదమును లేదు. ఇమ్మాట నెల్లరు నిస్సంశయముగా స్వీకరించిరి. కనుక, నీ యిష్టదేవుఁడు వాస్తవముగా నెవఁడు?– ఆ సర్వవ్యాపి సర్వశక్తి మద్వస్తువేది? యనునదియే యెల్లరకు వాంఛనీయము, అత్యావశ్యకము కాదా? కనుక, సర్వకల్యాణకాంక్షి, పరమ కృపామయుఁడు భగవంతుఁడు, నేఁడు గురుమూర్తితో నిల్చి, యర్జునుని నిమిత్తము చేసికొని యన్నది వినుము :– ఆత్మరూపమున సర్వజీవులందును నేనే యున్నాను. అపుడు సర్వజీవులు నేనే. నేను స్వయంప్రకాశుఁడను. కనుక నే సర్వ వస్తువులు ప్రకాశించుచున్నవి. కనుక, సర్వవ్యాపి, సర్వశక్తి మద్వస్తువు, మనుష్య మాత్రున కభీష్టదేవత, యీ నేనే. ఆత్మయే. దానికంటె వేఱొండు లేదు. ఉండనుజాలదు. ఒకపేరు; ఒకమూర్తియుఁగలది యెన్నఁడును, సర్వవ్యాపియు సర్వశక్తిమంతమును గాఁజాలదు. ఆత్మయొక్కటే, సర్వమూర్తిగాను సర్వశక్తిగాను నుద్భాసించుచున్నది. కావునఁ జెప్పెడి దేమనఁగా, గణేశ–విష్ణు–సూర్య–శివ–శక్తి–యింకేమి కానీ, ఆత్మ, బ్రహ్మము, పరమేశ్వరుఁడు, భగవంతుఁడు, శ్రీగురుఁడు మున్నగు పేళ్ళతో నొప్పుదేని నేనుపాసింపనీ, వారెల్లరు, నీయొక్క వస్తువునే (సర్వవ్యాపియు, సర్వశక్తిమంతుఁడునైన) నన్నే యుపాసించుచున్నారు.

ఇష్టదేవుఁడెవ్వఁడు? అతని స్వరూపమెట్టిది? ఎంత దూరమందున్నాఁడు? అను నిట్టి సంశయములను బొత్తిగా నిరాకరించియే భగవానుఁడు "మయాతతమిదం సర్వం జగద వ్యక్తమూర్తినా" యనెను. సర్వమూర్తులు, నా (నేనుయొక్క) మూర్తులే; సర్వనామములు, నా (నేనుయొక్క) నామములే; ఇదే యపూర్వశిక్ష. ఇదే రాజగుహ్యయోగము.

ఇపుడొక ప్రశ్నము—"స్వామీ! నాది యనుచు నీకొక పేరులేదంటివి; ఒక రూపము లేదంటివి; సర్వనామ రూపములు నావే యంటివి. అటులంటే, నీగణేశ సూర్య విష్ణు శివ దుర్గా అల్లాహో మున్నగు నామములతో నీయుపాసన మెందులకుఁ జేయవలయును? ఎవని కే నామ మిష్టమో, యే రూపమిష్టమో, యానామరూపములతోనే యుపాసనమగు చున్నదే," యని;—అవును; నిజమే; కాని, యిది యుచ్చాధి కారులమాట. భగవదుపాసనమందుఁ బైమెట్టు నెక్కినవారి మాట. భగవత్స్వరూపోపలబ్ధి బాగుగానైనట్టియు, బుద్ధిహద్దును దాటి నామరూపముల కతీతమైన క్షేత్రమును జేరినట్టియు భాగ్య వంతుల నోర నిమ్మాట శోభించును. ఇట్టి యవస్థ రానంత దాఁక శాస్త్రనిర్దిష్టమై గురూపదిష్టమైన నామరూపములను గైకొనియే, సాధనమో యుపాసనమో చేయుట తప్పదు. సరే; సర్వనామములతోను, సర్వరూపములతోను, నతఁడే యున్నపుడు, విశిష్టనామరూపములతో నుపాసింపఁగా వచ్చు నాపత్తియు లేదు. సరికదా, ఇటులు చేయఁజేయను అవిశిష్ట నామరూపముల గండి తెగిపోయి, అతఁడు, స్వప్రకాశస్వరూప

ముతో, సర్వవ్యాపి శక్తిమత్స్వరూపముతోఁ దన్నుఁ దా బయల్పెట్టుకొని; నీ సర్వసంశయములను ఛేదించును.

నచమత్స్థాని భూతాని పశ్యమే యోగమైశ్వరమ్।
భూతభృన్నచ భూతస్థో మమాత్మా భూతభావనః॥ 5

మెల్ల మెల్లగా నర్జునుని బుద్ధిని నిర్విశేషస్వరూపమున కాకర్షించుచున్నాఁడు.

వాస్తవముగా, సర్వభూతములు నాయందవస్థితములు కావు. నాయాత్మ భూతధారకమును భూతపాలకమునై యున్నది. వాస్తవముగా భూతస్థము కాదు.

గురురూపి భగవంతుఁడు, అరుంధతీ దర్శన న్యాయముగాఁ గ్రమముగా శిష్యుని బుద్ధిని, అతిసూక్ష్మమైన యాత్మ స్వరూపము వంకకు లాగుచున్నాఁడు.

ఇంతకుమున్ను "మత్ స్థాని సర్వభూతాని" యని యిప్పుడు "నచమత్ స్థాని భూతాని" భూతసమూహము నాయందవస్థితము కాదు. అనుచున్నాఁడు. ఈ రెండు వాక్యములును స్థూలదృష్టికిఁ బరస్పరవిరుద్ధముగానే తోఁచినను, వాస్తవముగా విరోధివాక్యములు కావు. సాధకులు శ్రీగురు కృపచే ననుభవరాజ్యమందుఁ బ్రవేశింపఁ జాలినపుడు, సరిగా నిట్టులే యనుభవింపఁగలరు. తొలుత "మయాతతమిదం సర్వం" కనుకనే, "మత్ స్థాని సర్వభూతాని" యను ననుభవముకా నారంభించును. నేనే సర్వభూతములకు నాధారము; భూత సమూహము నాకాధారము కాదు. నేను సూక్ష్మబోధమయ

మూర్తితో సర్వమును బ్రకాశింపఁజేయుచున్నాను. అంతేగాక ధరించుచున్నాను. నేనే భూతభరణమును భూతపాలనమును జేయుచున్నాను, అను నిట్టి ప్రత్యక్షానుభూతి యగునపుడే సాధకులు ధన్యులగుదురు. ఇదే, యీశ్వరక్షేత్రము వెంటనే ప్రతీయమానమగు నవస్థావిశేషము. ఇట్టి యనుభవమును ఇట్టి యాస్వాదనము నెంత సుఖమయము!! (ఎంత యానందమయము) ఒక్క నేనే సత్యాసత్యముగా బహురూపములతో విరాజిల్లుచున్నాను. బహుభావీయ ప్రకాశము నాదే. ఇది తప్పించి జగత్తునందు ద్వైతమనుట కేమియు లేదు; అను నిట్టి యనుభవమే మనుష్యునకయినపుడు, మఱివానికి త్యాగగ్రహణములనెడి మాటయే యుండదు. మఱి నేను దేనిని గ్రహించుట? అంతయు నా విలాసమాత్రమే. వాస్తవముగా భూతసమూహ మొక పదార్థమే కాదు. ఆత్మయొక్క ఆనందమయ భావ విలాసమాత్రమే. దానికంటె వేఱుగా వస్తుత్వమన్న దే లేదు. అను నిట్టి క్షేత్రమునకు సాధకుఁడు చేరునపుడు, బ్రహ్మము యొక్క స్వగత భేదమును మాత్రమే చూచును. సజాతీయ విజాతీయ భేదజ్ఞానము మొదలంటఁ దిరోహితమగును. ఏలనఁగా నీయవస్థయందు "నేను" నకు విజాతీయమైన మఱియొక నేను కలదనెడి ప్రతీతి బొత్తిగా నుండదు. నాకంటె వ్యతీతమైన విజాతీయవస్తువొకటి కలదనెడి యుపలబ్ధియే కాదు. కేవల స్వగతభేదప్రతీతి కాఁజొచ్చును.- నేనే భావమయుఁడనై బహురూపములతో వెలయుచున్నాను. ఈ బహుత్వము నాకంటె విలక్షణము కానేకాదు. ఏకాన్తలక్షణముగుంగాదు.

అనిర్వచనీయరూపముతో, నేనే (బహురూపములతో) బహు భావములతో భావితుఁడనగుచున్నాను. ఇట్టి యుపలబ్ధికే సాధారణమైన పేరు "ఈశ్వరలాభము. జీవునందు మును జెప్పిన మూఁడు తెఱఁగుల భేదజ్ఞానము పరిపుష్టమై యున్నది. మఱి యీశ్వరునియం దిస్వగతభేదమున్నదని, యీపాతదృష్టిచేఁ దోఁచునుగాని వాస్తవముగా నీశ్వరుఁడైన వానియందు ఆ స్వగతభేదమును లేదు." అనెడి యీ పరమసూక్ష్మతత్త్వము దుర్గమము, అతినిర్మలబుద్ధితక్క దీనిని ధరించునదియొండు లేదు. కనుకఁ దొలుత శిష్యునకు మును జెప్పినట్లు "మత్ స్థాని సర్వ భూతాని" పర్యంతము తెలియఁజెప్పి, యుపలబ్ధి, చేయించి, యప్పుడు మెల్లమెల్లగా, నిర్విశేష సత్త్వంక కాతని దృష్టి నాకర్షించుచు, "పశ్యమే యోగమైశ్వరమ్" అనుచున్నాఁడు. ఓ యర్జునా! అనసూయ ప్రియతమ శిష్యుఁడా! చూడు. తెలివి కంటితోఁ జూడుము. అవధరింపుము. ఆ యైశ్వర యోగము ననుభవింపుము. ఈశ్వరత్వపు మహిమము నెఱుంగుము. నేనే సర్వభూతములను ధరియించువాఁడను; పాలించు వాఁడను. ఈ యపూర్వ మహాత్మ్యము ననుక్షణము నను స్మరించుకొను చుండుము. ఇటులు కొన్నాళ్లు చేయఁగా — అనఁగా నా యీ యీశ్వర యోగక్షేత్రమందుఁ గొన్ని క్షణములు నిల్వఁగల్గు యోగ్యత కలుగఁగానే, "నచమత్ స్థాని భూతాని"యని తెలియఁగలవు. వాస్తవముగా భూత సమూహము నాయం దవస్థితము కాదు. నేనసంగుఁడను. – సంసక్తుఁడనుగాను. నేను చేతనుఁడను. నాయందెట్టి భావస్పందము

గాని, జడత్వసంపర్కముగాని లేదు. ఉండఁజాలదు. నేను సర్వభూతములను, ఆధేయములుగాఁజేసి, యాధారరూపముగానుందును. అదియు సరికాదు, ఏమన, నేను సత్తా స్వరూపవస్తువను. సత్తలు రెండుండవు. సత్తసత్తామాత్రమే. సత్తనాశ్రయించి ప్రకాశించునది, యేదేని మఱియొక సత్తావత్పదార్థమువలెఁ దోఁచినను, దానికి వేఱు సత్తలేదు. ఉండఁజాలదు. ఒక పూవును జూచుచున్నావనుకో; ఇది పూవని నీకన్ను చూపినది. నీకన్ను, నీమనస్సు, నీబుద్ధి, యను నిమ్ముగ్గురును నొకచోటఁజేరి, పూవు యొక్క సత్తను ప్రకాశింపఁజేసినవి. సరే; పూవు సత్త ప్రకాశింపకమున్నె, నీయాత్మ సత్తా ప్రకాశము ఆవశ్యకము. కారణమగు సత్త యొకటి లేక, మఱి యొక దాని సత్త యనుభవమునకురాదు. ఇపుడు జాగ్రీతికమైన సర్వపదార్థములు, దేహమనోబుద్ధులదాఁక, ఆత్మ సత్తా ప్రకాశమున కధీనమైనవే. ఆత్మసత్తా ప్రకాశమైన తర్వాత, మఱియొక పదార్థము ప్రకాశించును. సత్త, ప్రకాశము-సచ్చిత్ స్వరూపము అనునది, (యాత్మ) యొక్కటే. ఆత్మ స్వరూపమే. అనాత్మ యనునది (ఆత్మకంటె వేఱయినది) సత్తామయము, ప్రకాశమయము కాఁజాలదు. సత్తామయ ప్రకాశమయముగా, నేవస్తుమాత్రమును గనుచున్నామో, వాస్తవముగా నది, వస్తుధర్మము కాదు. వస్తుధర్మము రూపరసాది కాఠిన్యతారళ్యాదికము మాత్రమే. సత్తయుఁ బ్రకాశమును వస్తువునందు లేదు. అది (నేను నందు)

భగవంతుని యందున్నది. భగవత్సత్త—భగవచ్చైతన్యము — వల్లనే వస్తువులు ప్రతిభాసించును.

ఒకప్పుడు తొలిచూపునకు భగవంతుఁడే యాధార ముగా నీజగత్తును ధరించుచున్నాఁడని తోఁచునుగాని, యింకను ముందేగి చూచినచో, బుద్ధి నిర్మలమైన యెడ, ఆ భగవం తుఁడు-సత్తామయ ప్రకాశమయ స్వరూపమగు, నాత్మయను దానియందెట్టి యాధారాధేయభావమును లేదనియేఁ తోఁచును. కేవల జగద్దర్శనము చేయువారి చూపునకు మాత్రమే యాధారాధేయ భావము పొడకట్టుచుండును. రాఁబోవు మంత్ర మందు, భగవంతుఁడు తానే దృష్టాన్త పూర్వకముగాఁ జక్కఁగాఁ దెలియఁజెప్పును.

భూత భృత్తను, భూతభావనుఁడను నైనను, నా యాత్మ భూతస్థముకాదు. సర్వభూతములను ధరించువాఁడను, పాలించువాఁడనైనను నేను భూతస్థుఁడనుగాను. భూత భృత్పద ముచే, జగదుపాదాన కారణత్వమును, భూతభావన పదముచే, జగన్నిమిత్త కారణత్వమును, దెలియఁబడును. ఉపాదాన కారణము మాత్రమే కార్యమును ధరించునది. మృత్తిక ఘట మును ధరించునది యగునటులే, యని యెఱుంగునది. ఇఁక నిమిత్తకారణమే (కర్తయే) భూతములను పాలించునది. ఈ రెండును (అనఁగా) నభిన్న నిమిత్తోపాదాన కారణత్వము. ఒక్క పరమేశ్వరునియందే యున్నది. నేనే యీ జగత్తున కుపాదాన కారణమనై యున్నాను. అనఁగా సచ్చిదానంద స్వరూపుఁడనైన నా యందే యీ జగద్విలాసము సాగు

చున్నది. నేనే జగత్పాలన నిమిత్తమను. అనఁగా నేనే జగత్ సృష్ట్యాది కర్తయు నియంతయునైన పరమేశ్వరుఁడను. ఇటులు నేనేసర్వతో భావముతో జగదాకారముతో, వెలయుచున్నను, స్వరూపముచే భూతస్థుఁడనుగాను. అనఁగా భూతములతోఁ బాటు నాకాధారాధేయ భావము లేదు. కారణము-జగద్విలాస ముగాఁ బ్రకాశించునపుడు, నేనే నాభావవిలాసమును జూడఁ గోరినవాఁడనైనను, అది నా స్వరూప విషయమున నొక విధ మైన యజ్ఞానము యొక్క ఫలమే. అజ్ఞాన కాలమందుఁ గానఁ బడి; పిదప జ్ఞానకాలమందుండనిదే, రజ్జుసర్పమువలె ననిర్వచ నీయమగును. వాస్తవముగాఁ ద్రాటియందు సర్పగుణమొక్క టియు లేదు. రజ్జువు (త్రాడు) సర్పమున కుపాదానకారణ మును నిమిత్తకారణమును నగుచున్నది. అటులే నేను భూత భృత్తును,భూతభావనుఁడునునైనను,వాస్తవముగా భూతస్థుఁడను గాఁజాలను. అనఁగా నాతోడ నీజగత్తున కాధారాధేయ భావము సంభవింపదు.

ఈ శ్లోకమందు మఱొక్కమాట—"మమాత్మా" నా యాత్మ; అనగా నేనేయని భావము. అభేదోపచారమందీ షష్ఠీవిభక్తి ప్రయోగమైనది. ఇది కొందఱి మతము. మఱి కొందఱు, ఆత్మశబ్దమునకు నిటమనస్సని యర్థము చెప్పిరి. (ఆత్మామనఃశరీరంచ-అ.కో) నామనస్సే భూతభృత్తు, భూత భావనము నైనది. సంకల్పమే సృష్టి-జగత్తు సంకల్పమే మనో ధర్మము, "సంకల్పాత్మకం మనః" మనస్సునకు సంకల్పమే రూపము. నేను సర్వభావాతీత, గుణాతీత నిర్వికల్ప చైతన్య

స్వరూప వస్తువను. ఆ నేనే మనోమయరూపకల్పనము చేసి కొన్నపుడు, అనఁగా నేనే నన్ను సంకల్పమయ కామమయ రూపమునఁ జూచుకొన్నపుడే యీ సృష్టి ప్రపంచము పరికల్పితము కాఁజొచ్చును.

యథాకాశస్థితో నిత్యం వాయుః సర్వత్రగో మహాన్।
తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ॥ ౬

అంతట సంచరించునట్టియు, గొప్పదైనట్టియు, వాయువు, నిత్యము నాకాశమందున్నది. అటులే సర్వభూతములు నాయందున్నవి. అర్జునా ! ఉపాసనవలన దీని. . .నీవవధరింపుము అనఁగా నుపాసనముచే దీని యుపలబ్ధి నీకగును.

రాజగుహ్య జ్ఞానమునుగూర్చి ప్రస్తావించునపుడే యర్జునునకు, విజ్ఞానసహిత జ్ఞానోపదేశము చేయుదునని ప్రతిజ్ఞచేసి భగవంతుఁడు, చక్కని దృష్టాంతముతోఁ దెలియఁజెప్పఁబూని, యాకాశమందు వాయువు నిల్చియున్నటులే, సర్వభూతములును నాయందున్నవి. ఇది బుద్ధివలన నీ వెఱింగికొనవలయునన్నదే, యీ మంత్రమందలి సారాంశము.

ఆకాశము వాయువున కుపాదానకారణము. అనఁగా నాకాశమువలన వాయువు పుట్టినది. దేనివలన దేనిపుట్టుక యో, యది దాని కుపాదానకారణము. దారమువలన వస్త్రము పుట్టినది. కనుక వస్త్రమునకు దారమే యుపాదానకారణము. ఈ విధముగానే యిచ్చటను నెఱుంగునది.

తాత్పర్యమేమి? ఈ యుపాదానమే లేకున్నచో, దాని కార్యమును లేకపోవును. తఱచుగా సాధనభాషయందు దీనినే, ఆశ్రయ-ఆశ్రిత భావమందురు. ఆకాశము వాయువున కేకాన్తాశ్రయమైనటులే, వాయువు ఆకాశమున కేకాన్తాశ్రితము. ఇటులే సర్వభూతములు నాయందు (నేనునందు) నిల్చియున్నవి. నేను సత్తామయుఁడను, ప్రకాశమయుఁడను, గాన నా సత్తను నా ప్రకాశమును నాశ్రయించియే, సర్వభూతములు సత్తావంతములును ప్రకాశవంతములును నగుచున్నవి. ఈశరీరము సైతము నా (నేనుయొక్క) సత్తచేతనే సత్తావంతమగుచున్నది. కొంచెము ధీరముగాఁ జూడుము. దేహజ్ఞానమునకుఁ బూర్వము నా (నేనుయొక్క) యాత్మసత్తావిషయక జ్ఞానము, అస్ఫుటముగాఁ ప్రకాశించును. తొలుత "నేను" అను నీ జ్ఞానము గలుగును. 'నేను' అనెడి జ్ఞానము నడుమ నా (నేను యొక్క) అస్తిత్వమును, దాని యనుభవమునుండును. ఈ నేను, అనెడిది తొలుదొల్త నుదయించిన వెనుక, దేహాది సర్వ పదార్థముల యస్తిత్వమును, తద్విషయక జ్ఞానము నుదయించును. 'నేను' ఒక్కటే యాశ్రయము. తక్కినవన్నియు నాకు (నేనునకు) ఆశ్రితములు. ఈ నేనే సచ్చిదానందస్వరూప భగవంతుఁడు. దీనిని బట్టుకొనవలయును – తెలిసికొనవలయును. విషయమతి దురూహము. ఎంత సులభమో, అంత కఠోరము. ఒక శాస్త్రవాక్యము. "క్షురస్యధారా నిశితాదురత్యయా". ఈ యాత్మజ్ఞాన పథము, మిగుల దుర్గమము. మంగలి కత్తిదారువలె నతిశాణితము. సరే, ఏమయినంగానీ; ఆకాశము నాశ్ర

యించిన వాయువువలె, జీవుఁడవు నీవు, నా యొడియందే నిత్యమున్నావు. చూఁడు, ఆకాశవాయువులు రెండును నిరవయవ ద్రవ్యములే. ఆకాశమును బట్టిచూడ, వాయువు స్థూలమును వ్యాప్యమునైనది. ఆకాశము, స్థిరము, ధీరము, నిర్లిప్తము; వాయువో సర్వత్రగామి, చంచలము, గొప్పది. సరిగా నిటులే, నేనును ఆకాశమువలె వ్యాపకుఁడను. సూక్ష్ముఁడను, అసంగుఁడను; ఇఁక జీవుఁడవు నీవో, నన్నుఁబట్టి చూడ, వ్యాప్యుఁడవు; సూక్ష్మతాహీనుఁడవు; చంచలుఁడవు; జన్మమృత్యురూప సంసారమందు గతిమంతుఁడవు.

ఇవు డర్జునున కొక యాశంక గలుగవచ్చును — వాయువునకు "మహాన్" (గొప్పది) అను విశేషణ మొకటి యున్నది. అటయిన, నేనును 'మహాన్" కానా? యని — 'అవును; నిజముగా నీవును 'మహాన్'వే, ఇదిగో, జీవుఁడెంత దాఁక తనది మహత్పరిమాణమని తెలియఁజాలఁడో, అంత దాఁక వాని కీరాజగుహ్యాయోగ మందధికారమే లేదు. ఇమ్మాంస పిండమందలి నేను, అసలు నేనుకాదు. ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ క్రమమున నేను మహత్తరుఁడనే, యనెడి విజ్ఞానమయ క్షేత్రమందు నిల్చి తన సర్వత్ర వ్యాపకత్వమును, మహత్త్వమును, అనుభవింపఁ గల్గునప్పుడే, యేకాన్తాశ్రయ స్వరూపమును, తత్పరవర్తియునైన యాత్మ యొక్క సంధానము నొందును. అది యాకాశమువలె నంతట నిండియున్నది యైనను, కేవలము అసంగము (దేనినంటనిది) యనుట నవధరింప సమర్థుఁడగును.

సాధనమార్గమందు సైతము, ఆర్యర్షులు, మున్మున్నుగా ఆకాశమువలె సర్వత్రవ్యాపించి యుండు విష్ణుసత్తాబోధమునే యుపదేశించిరి. సత్యప్రతిష్ఠను జేయఁగాఁ జేయఁగాను, లేదా, ఆచమనప్రక్రియా రహస్యమును బల్మాఱు తలంచుచురాఁగాను (దీనికై, తెనాలి, సాధన గ్రంథమండలి యందు లభించు, దేవపూజారహస్యము, (శ్రీ) సత్యనారాయణశర్మ సాధనము, అను గ్రంథములను దప్పక చూచునది) సాధకుఁడు తోల్త నీయాకాశమువంటి సూక్ష్మతత్త్వము యొక్క సంధానము నొందును. క్రమముగా నీయాకాశమందే (పరమవ్యోమమందే) సర్వము నిల్చియున్నదని యవధరింపఁగల్గును. సరే, కాని, సాధకా ! ఈ యాకాశము, నీవనుభవించుచున్న భౌతికబాహ్యాకాశముకాదు సుమా. అది లోపలి వస్తువు. చైతన్య ధర్మియము. అది యుండనీ —

సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్॥ 
౭

కుంతీనందనా ! ప్రలయకాలమందు-కల్పావసానమందు ("బహుస్యామ్" అనెడి సంకల్ప ప్రవాహము నిల్చిపోఁగానే) సర్వభూతములును (అవ్యాకృత యనెడి) నా ప్రకృతి యందు (సృష్టి స్థితిలయ తిరోధానానుగ్రహా ఇతి ప్రకృష్టాః కృతయః యస్యాః సా ప్రకృతిః) విలీనములై పోవును. మఱల సృష్టికాలమందు (సంకల్పోదయ మగునపుడు) నేనే విశేష భావములతో సృజింతును. (వెలికి విడుతును) అనఁగా, నంతర్లీనములైన సర్వభూతములను దొల్లిటివలెనే వెలికి వెలయింతునని భావము.

అర్జునుఁడొక ప్రశ్నము వేయవచ్చును.—"సరే, తెలిసి నది. నీవు సర్వభూతములను ఆకాశమువలె ధరించి యుంచితివి కాని, వీని యుత్పత్తి ప్రలయములెట్లు సంఘటితములగు చున్నవి ?" అని.——దీనికి భగవంతుఁడు బదులిచ్చుచున్నాఁడు. ఓ కుంతీ తనయుఁడా! వినుము-సర్వరూపములతో, బహు రూపములతో వెలయుచు, నీ కింద్రియ గోచరమగుచున్న భూత సముదాయము, మఱల నా ప్రకృతినేచేరి పోవును; అనఁగా ప్రకృతియందే లీనమైపోవును. మఱలఁ గల్పాదియందు (సృష్టికాలమందు) ఆ సర్వభూతములను నేనే వెలికి సృజింతును. ప్రకృతి యనఁగానేమి ? సత్త్వరజస్తమోగుణముల (అవస్థల) సామ్యావస్థయే ప్రకృతి; సత్త్వగుణము ప్రఖ్యా—ప్రకాశ స్వరూపము; రజోగుణము క్రియా-ప్రవృత్తిస్వరూపము, తమోగుణము స్థితి-నిరోధ స్వరూపము. ఇంకను సరళముగాఁ జెప్పుచో; సత్త్వగుణము సర్థము, ఆత్మసత్తావిషయక జ్ఞానము-అనఁగా భగవంతుని యస్తిత్వమందుఁ జెదరని నమ్మకము. రజోగుణము-ఆత్మయొక్క యస్తిత్వమును వెదకి వెలిపుచ్చు ప్రయత్నస్వరూపము. అటులే, తమోగుణము. ఈ రెండవస్థల యొక్క నిరోధ స్వరూపము. ఈ త్రిగుణతత్త్వజ్ఞానము నొపినంతగా సంగ్రహించుకొనక, యాధ్యాత్మికరంగమందు, అడుగు పెట్టుటకే యధికారముండదు.

విశుద్ధచైతన్యమందు, అనఁగా నిర్వికల్ప నిరంజన పరమాత్మ సత్తయందు, అనాది సిద్ధమైన కొంచెమజ్ఞాన ముండును. "నేను నన్నెఱుఁగను" అన్నదే దాని స్వరూపము ఆ యజ్ఞా

నముకూడ, జ్ఞానముపైనే యున్నది. ఏలన- "ఎఱుఁగను" అను నీ యజ్ఞానము సైతము వాస్తవముగా నొక జ్ఞానమే. ఈ యజ్ఞానమును జ్ఞానమును సపూర్వ్వముగాఁ జేరియుండుటే, మాయ-లీల-పురుష ప్రకృతి సంయోగము, అనఁబడును. దేని స్వరూపమే జ్ఞానమో, యదే మనసునందు "నే నెఱుఁగను" అన్నచో, మనసు చేయు నా విచారమును లీలయే యన వలదా ? నవయువకుఁడైన తండ్రి, తన జ్ఞానగౌరవమునుమఱచి పోకున్నను, శిశువులైన తన బిడ్డలతోఁ దాను నొక బాలకునిఁ బోలి యాటలాడి యానందించునటులే, యిదియుంగాదా ? సరే; అగుఁగాక; పరమాత్మ, చిన్మయి, అమ్మ "నన్ను నేనెఱుఁగను" అని యెఱుఁగుటకై యొక్కసారి యులికిపడును. అనఁగా నాత్మ స్వరూపము నెఱుఁగుటకై యొక్కసారి స్వేచ్ఛచేసగు నొక స్ఫురణము (అదరు) నొందును. ఒక చంచలత కానఁ బడును. దీని పేరే రజోగుణము.

ఈ మొదటి స్పందనము (అదరు) తోనే దాని యిరు వంకల మఱి రెండు స్పందనములు బయలుదేరును. ఒకటి ప్రకాశము; రెండవది స్థితి; ఆ మొదటి స్పందనముచేఁ బర మాత్మయందు వెలయు విశేష భావమువలనఁ దన్నుఁదాఁ దెలియుటయే ప్రకాశము. దాని పేరే సత్త్వగుణము. ఆ రెండిటిని నిల్పివేయఁగల స్పందనముపేరే స్థితి, అదే తమోగుణము.

ఈ మూడును నొండొంటి సంసర్గము గలవి. ఒకదాని విడిచి మఱియొకటి యుండఁజాలదు. ఒకటి మఱియొక దానిని బూర్తిగా నణఁచివేయఁ బ్రయాసపడు చుండును. ఈ మూడు

గుణములును బహిర్ముఖ స్పందనముగలవి యైనట్లే, యంతర్ముఖ స్పందన ధర్మమునుం గలవి. జ్ఞానాజ్ఞానములు రెండునుం జేరి యున్న సత్త్వపైనే, యీ మూడు విధముల స్పందనములు నగును. కనుకనే వీనికి, అజ్ఞానము వంక వికాసమున్నట్లే జ్ఞానము వంకనుంగలదు. (ఏ స్పందనములు, అజ్ఞానమును, అనఁగా—తన్నుఁదాఁ దెలియకుండుటను దెలిపినవో వానిపేరే యసురులు. ఏ స్పందనములు, జ్ఞానమును — ఆత్మసత్తను జాగరితను జేయుటకు సాయపడునో, అవే దేవతలు.)

ఈ విషయము కేవలము సులభము కాదు. కనుక మఱల సంక్షేపముగాను సులభముగాను, మును జెప్పిన విషయమునే యాలోచింతము. "నన్ను నే నెఱుఁగను" అనుకొని, తెలిసి కొనుటకై చేయు ప్రయత్నము పేరే రజోగుణము. ఈ ప్రయత్నము ఫలముగాఁ గొంచె కొంచెము తెలియుటే సత్త్వ గుణము. అందాబోధమును సిల్పియుంచుట పేరే తమో గుణము. అవే యోగశాస్త్రమందు, ప్రఖ్యా-ప్రవృత్తి స్థితి, యనియు, శాంత ఘోరమూఢావస్థలనియుఁ జెప్పబడెను. అవే గీతలందు, ప్రకాశ ప్రవృత్తి మోహములని పేరుకొనఁ బడెను. (14-23)

చక్కఁగా నెమ్మదిగా, నీ త్రిగుణ స్వరూపమును మనసునకుఁ బట్టించు కొనుట తక్క మాయాలీలా ప్రకృతిత్త్వాది పారిభాషికముల యర్థము నెఱుంగుటకుఁగాని రాజగుహ్య యోగమును దలకెక్కించు కొనుటకుఁగాని యుపాయాంతరము లేదు.

సత్త్వగుణము ప్రకాశశీల భావము; రజోగుణము క్రియాశీల భావము. తమోగుణము ఈరెండిటిని ధరించి (నిల్పి) యుంచు భావము. ఇవి యెల్లపుడును బరిణాములు - పరివర్తన శీలములు. ఈ మూడిటి పరిణామమనే జడజగత్తు, బ్రహ్మాది జడ పరిణామ పర్యన్తము నీ మూడు గుణముల సంయోగ వియోగ మిశ్రణములు తక్క మఱేమియుంగాదు.

సుఖదుఃఖాదులును త్రిగుణాత్మకములే. ఎక్కడ నధిక క్రియాశీలత (చేష్ట) వలన నత్యల్పమైన యాత్మబోధ స్ఫురణ మగునో యది దుఃఖము. ఏలన, నచటం గ్రియాభాగ మధికము. ప్రకాశభాగము తక్కువ, ఎచట సత్త్వగుణ క్రియ, అనంగాం బ్రకాశభావము, అధికమును, రజోగుణ క్రియ (చంచలత) తక్కువయో యదే సుఖము. మఱి, తమోగుణక్రియ ప్రబలమై ప్రకాశభావము బొత్తిగా నుండదో, సుఖదుఃఖము లింతయుం దెలియంబడవో, దానిపేరే మోహము.

సత్త్వగుణము యొక్క యఖండ ప్రకాశము- చరమ పరిణామము-అనంగాం గేవలాత్మ బోధస్ఫురణము, దానినే, విశుద్ధాత్మ బోధమందురు. ఆ యవస్థను జేరునపుడే రజోగుణము యొక్కయును జరమపరిణామ మగును. దీనిపేరే పర వైరాగ్యము. అనంగా, 'నే నెవరు' అనుదాని నెఱుంగుటకైన యుద్యమము లేకుండుట. ఇట్టి తమోగుణము యొక్క చరమ పరిణామము నిరోధము. అనంగా మఱి రజోగుణము లేవకుండ నడ్డగించి యుంచుటే.

ఈ విధముగా మూఁడు గుణములకును రెండు వైపు లేర్పడినవి. ఒకవైపు సృష్టిస్థితి లయములు-జీవజగత్తు, జనన మరణములు సుఖదుఃఖములు మున్నగునవి. ఇంక, రెండవ వైపున, అఖండ ప్రకాశము, పరవైరాగ్యము, నిరోధము. ఇంకను సరళముగాఁ జెప్పినచో, ఒకవంక భోగము, రెండవ వంక అపవర్గము - ముక్తి. మూఁడు గుణముల భోగాభి ముఖ గతి పేరే యసురభావము. వాని యపవర్గాభి ముఖగతిపేరే దేవభావము. ఈ రెండిటికిని అవిరతసంగ్రామము. ఏనాఁడీ సంగ్రామము సమాప్తమగునో (కురుక్షేత్ర యుద్ధము ముగి యునో) ఆనాఁడే జీవుఁడు గుణాతీతుఁడై పోవును. ఆనాఁడే భోగాపవర్గములు బంధనముక్తులు ననువాని భ్రమము పూర్తిగాఁ దొలఁగును.

అబ్బా! సాధకా! మనము కడుదూరము వోయితిమి. వినుము, మఱి సులభముగా నెఱుఁగఁ జూడుము. "నన్ను నే నెఱుఁగుమను" అనెడి యవిప్లవ జ్ఞానధారయే సత్త్వగుణము యొక్క పూర్ణ ప్రకాశమయావస్థ. "నన్ను నే నెఱుఁగను" అను ట్టి యజ్ఞాన స్వరూపజ్ఞానమే యవ్యక్త ప్రకృతి. ఈ యవ్యక్త ప్రకృతి వలన మూఁడు స్పందనములు వెలయును. మొదటి స్పందనమందుఁ దన్నుఁదా నెఱుంగుటకైన ప్రయత్నము తల సూపును. దాని పేరే రజోగుణము నభివ్యక్తి. ఆ ప్రయత్న ఫలముగా, నేదేనొక యనాత్మ వస్తువును బట్టుకొని, యాత్మ బోధము నుదో్బధింపఁజేయును. ఈ యనాత్మ వస్తువు పేరే తమోగుణము. అటులే, యించుకంత యాత్మబోధమగుట పేరే

సత్త్వగుణము, అనాత్మ వస్తువు నాశ్రయించుట వలనఁ గొంచె కొంచెము ఆత్మబోధమగుటపేరే త్రిగుణాత్మక ప్రాకృతావస్థ. సమస్తమైన యనాత్మ ప్రతీతులు లోపించిపోయినపుడు మఱల జీవుఁడు తన సత్తను వెదకికొన్నను దొరకదు. ఎందాఁక విషయ సంస్పర్శమును–అనాత్మ వస్తు సంస్పర్శమును, అతిక్ర మించి జీవుఁడు ఆత్మ సత్తావబోధమును బొందఁజాలఁడో, యంత దాఁక, (నేనే) సచ్చిదానంద స్వరూపాత్మ సత్త్వర జస్తమో మయ ప్రకృతి రూపమునఁ బ్రకాశించుచుండును.

చూడు, జీవించియుండుటకే సర్వజీవులును గోరు చుందురు. కారణము, – జీవితులై యుండుటనఁగా, "నే నున్నాను" అనెడి జ్ఞానము (బోధము) యొక్క ప్రకటావస్థయే నిద్రవేళ, "నేను" అనుదాని బోధముండదు. అనెడి జ్ఞాన మగును. (అనుకొనును) వాస్తవముగా నట్లుకాదు. అప్పుడును, అజ్ఞానమునకు జ్ఞాతరూపమున, అనఁగా "నేనేమియు నెఱుఁగను," అనెడి యవస్థ నెఱుంగు వాఁడుగా, 'నేను' ఉండనేయున్నది. కనుక నిద్రాకాలమందు అహంత్వబోధము (నేను దనపుఁ దెలివి) విలయమైన దనెడి సందేహము వలదు. కాని మృత్యువు వలన గొప్ప భయము, గొప్ప దుఃఖము కలుగును; కారణ మేమి? ఆమరణావస్థయందు "నే నున్నా"ననెడి బోధము మఱి యుండదు. ఏమికానీ; ఏ యవస్థయేకానీ; నే నున్నాననెడి బోధముపేరే సత్త్వగుణము. ఈ బోధము నుద్దీపింపఁజేయు చేష్టపేరే రజోగుణము. దేని నవలంబించి యీ బోధ ముద్దీ పించునో యదేత మోగుణము. ఇది యీపరమాత్మవస్తువుకంటెను

వేఱుకాదు, మఱియేకాన్త తత్స్వరూప వస్తువునుంగాదు. కను కనే యీ ప్రకృతి సదసద నిర్వచనీయమైనది. సత్తనిగాని, యసత్తనిగాని నిర్వచింపరానిది. దీని మఱియొక పేరే మాయ. ఎప్పుడు నేను మాయారూపమున నాత్మ ప్రకాశము చేయుదునో (=నన్ను నేను వెలయించు కొందునో) అనఁగా, అనాత్మ బహు భావములను గర్భమందు ధరించి, ప్రసవ ప్రతిపాలన సంహరణాది క్రియలతో లిప్తుఁడనగుదునో, యపుడే నాపేరు (నేను పేరు) మాయా. అపుడే నేను మాతృత్వము నొంది వెలయుదును. (మాతృత్వం యాతీతి మాయా). ఇపుడు చూడు పుర్జునా!

కల్పక్షయమందు, అనఁగా నీ యన్ని కల్పనములు నవసాన మొందునపుడు, నా ప్రకృతియందు, వచ్చి చేరిపోవును. మఱలఁ గల్పనలు ప్రకటమై యుబికినపుడు, నా ప్రకృతి నుండియే ప్రకాశించును (బయల్పడును.) జాగ్రత్ స్వప్నము లనెడి రెండవస్థలయందే జీవుఁడ వీవు ప్రతిక్షణమును గల్పనము జేయుచునుందువు. ఎన్నో మంచిచెడ్డ భావములు నీ మనసునందు బయలగుచుండును; మఱి యణఁగుచుండును. ఇది గుర్తింపుము. అదే కల్పనయు, కల్పక్షయము. ఈ కల్పక్షయము, కల్పాదియు ననుక్షణము సాగుచునే యుండును. సుషుప్తి (గాఢనిద్రా) కాలమందు, ఈ కల్పక్షయావస్థ చక్కఁగా వ్యక్తమగును. అటులే జాగ్రత్కాలమందుఁ గల్పాద్యవస్థ లెస్సగాఁ గుర్తింపఁబడును.

చూడుము నీకల్పనలన్నియు నెచ్చటను బుకుచున్నవో మఱి యెచటఁ జేరి పోవుచున్నవో యది నీ కవ్యక్తము; అనఁగా ఆ స్థానమెట్టిదో, యది నీ వెట్టులుం దెలియఁజూపఁజాలవు. ఇంద్రియ గ్రాహ్యముకాదు, కనుక నవ్యక్తము. అంతేకాదు. ఈయవ్యక్తావస్థ, అసలున్నదో లేదో, యన్నదియు నీవు చెప్పలేవు, కార్యమువలనఁ గారణమును బూర్తిగా నూహింపనుంగాదు. బల్బు వెలుగుచున్నది; ఫాన్ (విసనకఱ్ఱ) తిరుగుచున్నది. ఆకార్యములను గంటఁజూచి, విద్యుచ్ఛక్తి ప్రవహించు చున్నదని, కనుక నిన్నిపనులు సంపన్నములగు చున్నవని, నిశ్చయించి కొందువు. సరిగా నిట్టులే, యెల్లవేళల నగుచుండు, నీ కల్పక్షయ కల్పారంభములవలన, నీ యవ్యక్త స్వరూపము, ఈ కారణ స్వరూపము నిశ్చయముగా నున్నదని తెలియఁగల్గు చున్నావు, ధారణము చేయఁగల్గుదువు. ఈ కల్పనలను బట్టుకొని, మెల్ల మెల్లఁగా ముందడుగు వేయుము. వందసారులు, లక్షసారులు నీవు విఫలుఁడవే యగుదువుగాక; అపుడును ముందడుగు వేయ మానకు; నిశ్చయముగాఁ బట్టుకొనఁగలవు. ఏమంటేని, నా ప్రకృతియు, 'నేను'ను అభిన్న వస్తువులమే (ఒక్కటే) కాదా, ఇదిగో ప్రకృతి నుపేక్షించియే, నీవు దీనుఁడవు, హీనుఁడవు, పతితుఁడవు, దలితుఁడవు, ఛిన్నమర్మఁడవు, నగుచున్నావు. ప్రకృతినే, అన్వయనుము. ప్రకృతి చరణములందే నీ యశ్రుపూర్ణకృతజ్ఞతాంజలి సమర్పింపుము. నన్ను (నేనును) బొందుదువు. జీవప్రకృతి, యీశ్వర ప్రకృతిగాఁ బ్రత్యక్షమగును (అనుభూత మగును.) ప్రకృతి సాక్షా

త్కార మొందనంతదాఁక, ప్రకృతి కార్యములను – అనఁగాఁ గల్పనలను, ప్రకృతి యని యెన్నుచుందుము. కల్పనయుఁ బ్రకృతియు నొకటే వస్తువు. ఘటము ప్రకృతికంటె వేఱేమి యుంగాదు. ఈ ప్రకృతియే, యమ్మ. ఈ ప్రకృతియే రాధ. ఈ ప్రకృతియే సర్వదేవదేవులు. దీనినే పూజింపుము. నీ యాసలు నెఱవేఱును. నీ జీవనము ధన్యమగును. నన్ను (నేనును) బొందుదువు.

విసృజామి–త్యజామి; సృజ్ ధాతువు నర్థము త్యాగము విడుపు. కల్పక్షయమందు నాలో విలీనమగుచున్న దేదో, దానినే కల్పాదియందు మఱలఁ బరిత్యజించి–విలీనావస్థ నుండి వెలిఁబెట్టి వ్యక్తావస్థకుఁ దెత్తును. ఇదే సృష్టి.

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునఃపునః ।
భూతగ్రామ మిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్ ॥ ౮

నేను స్వకీయమైన ప్రకృతిని వశమొనర్చుకొని, ప్రకృతికి వశీభూతమై యుండుటచే, నస్వతంత్రమైన యీ భూత గ్రామమును మఱల మఱల సృష్టించు చుందును.

ఓ యర్జునా! నీ ప్రకృతికి వశీభూతుఁడవై, నిన్ను నీవు మఱచిన జీవుఁడవు. నేనో–ప్రకృతికి వశీభూతుఁడనుగాను. నా స్వకీయ ప్రకృతిని, ముందు జెప్పిన (మామికా) ప్రకృతిని నేను స్వీకరించి, అనఁగా ద్రష్ట (సాక్షి) రూపమున నుండునపుడే, యీ కానవచ్చు భూత సమూహమును—అనుక్షణము నుద

యించుచు విలీనమగుచుండు కల్పనా సమూహమును — సృష్టింప నారంభింతును. భూత సముదాయ మెప్పుడును, అవశమే. ఏలనఁగా, దానికి రవ్వంతయు స్వాతంత్ర్యములేదు. కామకర్మాదులకుఁ బరవశమైన భూత సమూహము ప్రకృతి వల్లనే పరిచాలితమయి, జన్మ జరామృత్యు సుఖదుఃఖాదులైన యవస్థలను విపర్యయముగా భోగించుచుండును. జీవుల యీ కర్మభోగములందుఁ దను కర్తృత్వమేమియు లేదు. నేను ప్రకృతిని స్వీకరించునపుడే, నా స్వేచ్ఛాపూర్వకలీలచేఁ బ్రకృతికి వశీభూతుఁడనుగాను. కారణమేనఁగా, నా సత్తచేతను, చైతన్యము వల్లను నుపరంజితమయియే, ప్రకృతి స్వకీయసత్తను జేతన భావమును నొందుచున్నది. నన్ను (నేనును) వెనుకఁ బెట్టినచోఁ, బ్రకృతికిఁ బ్రకృతిత్వమే యుండదు. కనుకనే, మంత్రమందు "స్వాంప్రకృతి మవష్టభ్య" అన్నాఁడు. ఎప్పుడు నేను ప్రకృతి ద్రష్టనుగాఁ గల్పించుకొందునో — లీలావశమే యనుచు, స్వేచ్ఛాకృతమే యనుచు; కాని లేదు — ఎట్లో ప్రకృతిని స్వీకరింతునో, అనఁగా చిత్ప్రతిబింబమును వేయుదునో, అప్పుడే ప్రకృతి, క్రియాశీలయుఁ, బరిణామశీలయునై, యీ యసంఖ్య భూతములను—కల్పనలను సృష్టింప మొదలిడును. ఈసృష్టి కార్యమందుఁ బ్రకృతికి నెట్టి కర్తృత్వమును లేదు నేనే ప్రకృతి రూపమునొంది, యనాది జన్మసంచితమైన నానావిధ సంస్కారములతోఁ గూడిన భూత నిచయమును, ఆయా కర్మాదుల ననుసరించి మాటిమాటికి సృష్టించుచుండును.

చూడు; నీవు-నీ ప్రకృతి (స్వభావము) అను నీ రెండును వేర్వేఱు వస్తువులుగాఁ బ్రతిభాతములగు చుండును. నీవు పలు సార్లు "నా స్వభావము" అను చుందువుగదా. ఇమ్మాటచేత సైతము, నీ నేను వేఱు వస్తువని, నీ స్వభావము వేఱు వస్తువనియే తలంచుచుందువు. కాని కార్యకాలమందు ధీరముగా విచారించుచో నీ నేనే నీ ప్రకృతి స్వరూపమై పోవును, అనఁగాఁ బ్రకృతియే నేనన్నమాట తేలిపోవును. ప్రకృతిని వెనుకఁ బెట్టినచో నేనుండదు. నేనును వెనుకఁబెట్టినచోఁ బ్రకృతి యుండదు. ఇట్టి భావముతో నేను బ్రకృతిగాఁ వెలయునప్పుడే నీయనంత కల్పనలు నుబుకఁజొచ్చును. మంచి, చెడ్డ - సత్, అసత్ - ఎన్నిరకముల కల్పనములు రేవగళ్లుఁ జేయుచున్నావో, చేసితివో, చేయుదువో వానికి మొదలు తుద తెలియరాదు. అనాది ప్రవాహరూపమునఁ దెంపులేక, యీ కల్పనలు సాగుచున్నవి. ఇది నీ సృష్టియైనటులే, యీ బ్రహ్మాండసృష్టియు, స్థితిక్షయరూపమైన సమష్టిక్రియయుఁ బరమేశ్వరుఁడనైన నాచేతనే సంఘటిత మగుచున్నది. ఆయవస్థయందు-నేను "స్వాంప్రకృతి మవష్టభ్య" అయినపుడే యింత విశేషత్వము. నేను బ్రకృతి రూపముతోనే యాత్మ ప్రకాశము చేసికొందును. అనఁగా నన్ను నేను వెలయించుకొందును.

ఇక్కడ నొక యాశంక కలుగవచ్చును.—"నీవు పరమేశ్వరుఁడవే యనుము. నీవే ప్రకృతి రూపముతో నాత్మ ప్రకాశముచేసి భూతగ్రామ సృష్టి చేసితివే యనుము. సరే, సృష్టి కర్తవే నీ వగుతే నీ భూత సమూహమందింత వైచిత్ర్య

మెందులకు ? ఒకఁడు చిరదుఃఖి; ఒకఁడు చిరసుఖి; ఇటులున్న వైచిత్ర్యమందు, నీ దయయు నీ నిష్ఠురతయు రెండును గాన వచ్చుచున్న వే. నీవు సర్వసముఁడవు కదా, నీ యీ సృష్టి చక్రమందింత వైచిత్ర్య మెందులకో ?" యని.

అవును, ఆ పాతదృష్టి మాత్రముతో నీ వైచిత్ర్యమును గని నా యందు దయానిష్ఠురతల సమావేశమును గుర్తించు చున్నావు. కాని కొంచెము ధీరముగాఁ జూడుము—"అవశం భూతగ్రామమ్" ఈ భూతసముదాయము, అవశము-అస్వతంత్రము. దీనికెట్టి కర్తృత్వమును లేదు. పూర్వతనమైన కర్మ వశమునఁ దదనురూప ఫలభోగమును జేయుచుండును. ఇందు నా వైచిత్ర్యదోషము లేదు. ఆ వైషమ్యదోషము నాదికాదు.

నచ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనంజయ ।
ఉదాసీన వదాసీన మసక్తం తేషు కర్మసు ॥ ౯

ధనంజయా ! ప్రకృతిచేతనైన యీ కర్మములు నన్నుఁ గట్టి పెట్టఁజాలవు. ఏలన, ఆ సర్వకర్మములందును నేను కేవలము నిర్లిప్తుఁడనై యుదాసీనునివలె నుందును.

ఓ ధనంజయా ! నీవు కుబేరుని గెలిచి ప్రచురమైన ధనములను దెచ్చితివి. అనతిక్రమణీయ పరాక్రమ శాలివి, కనుకఁ గర్మపరవశత్వమనెడి బంధనమును జయించు (త్రెంచు కొను) సామర్థ్యము నీ యందు నిక్కముగా నున్నది.

"తాని కర్మాణిమాంననిబధ్నన్తి" ఆ ప్రకృతి కృత కర్మ సమూహము నన్ను బంధింపఁజాలదు. "కర్మములకు నేనే

కర్తను. ఈ ఫలము నపేక్షించి యీ కర్మముచేయుచున్నాను" అనెడి జ్ఞానముండును, గాని, కర్మసమూహ మవ్యక్త ప్రకృతి నుండియే పుట్టుచున్నది, మఱలనందే చేరిపోవును. అను నిట్టి జ్ఞానము సాధారణముగా నుండదు. "నేనే కర్తను, ఈ కర్మము వలన నాకీ ఫలలాభమగును" అను నిట్టి జ్ఞానముతోనే కర్మములు చేయఁబడును గనుక, కర్మ జనితమైన యొక సంస్కారముండి పోవును. ఇదిగో—ఈ సంస్కారము వల్లనే మఱలఁ దజ్జాతీయమైన కర్మములు పుట్టుచున్నవి. మఱల దానిచేనైన సంస్కారములే పుట్టుచున్నవి. ఈ విధముగా ననాదికాలము నుండియు, అనాది కర్మ సంస్కారముల గట్టి కట్టునందు సర్వజీవులు బద్ధులగు చున్నారు. ఏ విధముగాను వారు తమ యీ కర్మచక్రపు సుడినుండి విడివడఁ జాలరు.

అయినను, అర్జునా! చూడుము. నేను నిత్యము ప్రతి బ్రహ్మాండసృష్టి, స్థితిలయరూపమైన చెప్పరాని గొప్పకర్మా చరణమందు వ్రతినై యున్నను, కర్మజనిత బంధనావస్థను నేను జిక్కను.

"ఏమి? ప్రభువా! మేము కర్మములను జేసినంతనే బద్ధులమగుదుము, నీవు అంత గొప్ప కర్మ మాచరించుచున్నను, బద్ధుఁడవు కాకుండుటయు నెటులయ్యె" నందువేమో—వినుము "ఉదాసీనవదాసీనమ్" నేను తటస్థునివలె-ద్రష్టవలె (సాక్షివలె) నుందును. "అసక్తం తేషు కర్మసు" ఆ ప్రకృతి కృత కర్మములందు సర్వదా నేననాసక్తుఁడను, నిర్లిప్తుఁడనై యుందును. నేనెన్నఁడును వానియెడ, అహంత్వమమత్వ

బోధమును జేర్పను. నే నుదాసీన పురుషుఁడను. వానికిఁ బై నెంతో యెత్తున నుదాసీనుఁడనై యుందును. ప్రకృతి కంటెనుం బరమైన యూర్ధ్వతమలోకమందు నే నుందును. ఎట్లును ప్రకృతి కృతకర్మములందు నేను బద్ధుఁడనుగాను. నేను నిత్య ముక్త నిర్లిప్తుఁడ; నీశ్వరుఁడను. కర్మ సంస్కారములు నన్నంటవు, అంటఁజాలవు.

"తెలిసినది. భగవంతుఁడా! నీవీశ్వరుఁడవు; కనుక నీకుఁ గర్మాసక్తి లేదు. కర్మబంధనము లేదు. నేను జీవుఁడను. నా కేమిదారి? నాకుఁ గర్మాసక్తికలదు. కావున బంధనమును గలదు. ఇం కేమి యుపాయము?" అను నర్జునుని గోడువిని,— కాదు, అర్జునా! నీవు జీవుఁడవుకావు. నీవును జనుఁడవే; నేనును జనుఁడనే; నేనే నీ లోపలనుండి వెలయుచున్నాననెడి దానిని నీవులక్షింపకున్నావు. నీవు నాకంటె వేఱనుచుఁ గూరు చున్నావు; కనుకనే యజ్ఞానకృత బంధనమందుఁ గట్టువడి పోతివి, రమ్ము. జ్ఞానలాభము నొందుము. రాజగుహ్యయోగ మందధికారి వగుము, నీవును, నన్నుఁబోలి నిర్లిప్తుఁడవై యుండఁగలవు. కావున నా (నేను యొక్క) రూపమును నీ యెదుట నుద్భాసింపఁ జేయుచున్నాను.

సరే, వినుము. ఏ యుపాయము వలన నీవును గర్మ బంధముక్తి నొందఁగలవో, యది సంక్షేపముగాఁ జెప్పెదను. ప్రాణములొడ్డి యైనను వినుచుఁ బొమ్ము. మొట్టమొదట నీ కెట్టి కర్తవ్యమును లేదన దృఢముగా నెఱుఁగుము. నీ కెట్టి యోపికయు లేదను కొనుము. నేను ప్రకృతి రూపమున నీ

తల్లినై, యెపుడు నిన్నే భావముతో నడుపుదునో, నీవపుడా భావముతోనే నడుతువు. ఎన్నిసార్లు నీ పురుషకారములు విఫలమైపోయినవో, ఎన్నిసారులు నీ పురుషప్రయత్నము లేకయే సఫలకాముఁడవై యాశాతీత ఫలమునొందితివో, నీయాశ లెన్ని యపూర్ణములుగా నుండిపోయెనో, ఆశించుటకు మున్నే యెన్ని పూర్ణము లయ్యెనో గుఱుతించితివా? ఎందుల కటు లగుచున్నది? అవన్నియుఁజూచి నీ కర్తృత్వమేమియు లేద నియు, సమస్తమును నా ప్రకృతిది; లేదా మాతృరూపిణి నైన నాది, యని చక్కఁగాఁ దెలిసికొనుము. నీ మంచి చెడ్డల బరువంతయు నా మీఁదనున్నది. నీ కెందేని మేలగుచో, అది నీ కర్తృత్వఫలమని యేతలంతువు. ఇన్నియునను భవించుచున్నావు, కాని నాపైనే నీ సర్వకర్తవ్యాకర్తవ్యముల భారము నర్పింప వేల? ప్రవాహ పతితకర్మమందుఁ గర్తృత్వబోధ శూన్యుఁ డవై ఫలాకాంక్షావర్జితుఁడవై కర్మములను జేయుచుఁ బొమ్ము. ఇటులు కొన్నాళ్లు చేయఁగల్గుటచేతనే, నీ చిత్తము శుద్ధ మగును. నీ సర్వకర్మములందును నా కర్తృత్వమునే కాంచుట విశేషముగా నలవాటై పోయినపుడే, నీ తెలివి కన్ను విడి పోవును. అపుడు నీలో "నేను" రూపమునఁ బ్రకాశించు చున్నదే, మఱేమియుఁగాదు, నీ యేకాన్తమైన యిష్టమని కనుఁగొనఁగలవు. ఈశ్వరుఁడు నేను, గురువు నేను, అమ్మ నేను; నీ బుద్ధిలోపలనుండి "నేను" రూపమున వెలయు చున్నాను. నీ బుద్ధికిఁ జేతనను గలిగించి, నీ సర్వకర్మములను ప్రేరణముచేసి, వెలయుచున్నదదే యని తెలిసినపుడు, నీ బుద్ధి ప్రకాశము ధర్మమయమై, ఆ నా (నేను) పైనే నీ లక్ష్యము

పడును. అంతట నీవు "నచమాంతాని కర్మాణి నిబధ్నన్తి" యని కనుఁగొనఁగలవు. ఆ నేనే "ఉదాసీన వదాసీనః అసక్తస్తేషు కర్మసు" అపుడు నీకు వేఱుగా మఱొక్క నే నుండదు. అపుడు నీవు "కృత్స్నకర్మకృత్" అయినను, "అకృత్స్నకర్మకృత్" ఆయి పోదువు.

ఇదే గీతాశాస్త్రము చేయు ప్రధానోపదేశము. ఈ నిష్కామ కర్మయోగమును ప్రవర్తింపఁజేయుటకే గీత యవతరించినది కనుకనే గీతాగురుఁడు భగవంతుఁడు, ప్రత్యేకాధ్యాయమందును, అన్ని వాక్యములలోను, నొక్క యీ లక్ష్యము వైపునకే జీవు నావాహితునిఁ జేయు చుండును.

మఱువకుమా, సాధకా! "ఉదాసీన వదాసీనం, అసక్తం తేషు కర్మసు." ఒక్కనాఁడయి పోఁజాలదు. చుమా, సత్య ప్రతిష్ఠా మార్గమం దగ్రసరుఁడవై శ్రీ గురుకృప గలిగినపుడు, ఈయవస్థాలాభ మెంతో కఠినముకాదు.

మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ ।
హేతునానేన కౌన్తేయ జగ ద్విపరివర్తతే॥ ౧౦

నే నధ్యక్షుఁడుగా నుండు నపుడే ప్రకృతి జగత్తును ప్రసవించును. కుంతీపుత్త్రుఁడా! ఈ కారణము చేతనే జగత్తు పరివర్తితమగుచున్నది.

దేవా! "నీవుదాసీనుఁడవై యుందువు. ఎట్టి కర్మమునకును కర్తృత్వము నీదికాదు." అంటేని, జగత్తు యొక్క విచిత్ర పరివర్తన మెట్లు సాధింపఁబడును? ప్రకృతియో -

జడము, దానికిఁ గర్తృత్వేచ్ఛ కలుగదు. ఇఁక నీవో – నిర్లిప్త చేతన పురుషుఁడవు; అగుచో, మఱి యీ విరాట్ సృష్టి చక్ర మెట్లగుచున్నది? అను నియ్యాశంకస్వతః కలుగఁగలదు; గాని కౌన్తేయా! నీవు చెదరని చిత్తముతో నవధరింప వల యును:– నేను చేతన పురుషుఁడను; నే నీశ్వరుఁడను. స్వకీయ సత్తను,ఆనందమును అవలంబించి స్వప్రకాశ రూపముతో నెల్ల పుడు విరాజిల్లుచుందును. నన్నధ్యక్షుఁడుగాను, నధిష్ఠాతగాను జేసికొనియే, ప్రకృతి సుందరి యీ జగత్తును ప్రసవించు చున్నది. నా సత్తా చైతన్యముల చేత నే యభిరంజితయై, ప్రకృతి జడయైనను, దనను జైతన్యశీలనుగాఁ దలంచుచున్నది. అనఁగా – ప్రకృతి చైతన్యాధిష్ఠానముతోఁ గూడికొన్నపుడే యది బుద్ధిరూపమున – మహత్తత్త్వరూపమునఁ బరివర్తిత యగును. అపుడు దానియందుఁ గర్తృత్వ భోక్తృత్వాదిక మంతయుఁ బ్రవృత్తమై ప్రకాశితముకాఁ జొచ్చును. కనుక నే విరామము లేక స్థావరజంగమ జగత్తు – కల్పనారాశి – ప్రస వము మొదలిడును. కౌన్తేయా! మఱొక్కమాట – కేవల ప్రకృతివల్లనే సృష్టి యసంభవము సుమా. మఱి నా యందో (నేనువందో) సృష్టి యనుచు నేమియు లేనేలేదు. అయినను జీవుల యనాది కామ్యకర్మవశమునవైన, యనాది కర్మబీజము లనేకి, యవ్యక్త ప్రకృతి నాయధ్యక్షతకు లోనై, నా (నేను యొక్క) సత్తచేతను ప్రకాశముచేతను, అస్తిత్వమయియుఁ గ్రియాశీలయు నగుచున్నది. కావున నిత్యపరివర్తనశీలయైన ప్రకృతియొక్క నిత్యపరివర్తనమునే జగత్పరివర్తనముగాఁ గను

చున్నావు. నీవునుం జూడుము - నా నేను, నా ప్రకృతి యను టచే నేదో నొక యవ్యక్తముగాఁ దలంతువో, యా రెండును వస్తువులే కానియెడ, నీ జననము, మరణము, సుఖము, దుఃఖము, భోగము, విభాగము మున్నగు దేని సంభావనయు నుండదు. నీవు సమస్తమును విడిచి, యనఁగాఁ బ్రకృతిని విడిచి, కేవలము 'నేను' అయిపోవునపుడే, నీవు సర్వభావవిముక్తుఁడగు చిదానంద శివుఁడ వగుదువు. కాని నీ నేను దనమును, అనఁగా అహం భావమును, దెగఁగొట్టి, నేను సర్వేంద్రియశక్తి సమన్వితుఁ డైన జనుఁడ ననుచు నిల్చితివి, పో; అపుడును నీ ప్రకృతి నిన్నంటియే యున్నది. మఱి నీ నేనును, ఎన్నివిధముల యాట లాడించుచున్నదో !- ఒకసారి నవ్వించును, ఒకతడవ యేడ్పించును, ఒకప్పుడు జన్మమెత్తించును; ఒకప్పుడు మరణశయ్యపైఁ బవళింపఁ జేయును; ఈ పరివర్తన మన్నది ప్రకృతికృతమైనను, ప్రకృతి యాటలకు ముగ్ధుఁడవగు చున్నావు. కనుకనే నీవు బద్ధజీవుఁడవు. ప్రకృతికంటెఁ బరమైన "నేనును" బట్టుకొన-తెలిసికొను శక్తిలేనంతగాఁ బ్రకృతికి, ఆత్మదానము చేసితివి. కనుక నీవు బద్ధజీవుఁడవు; నేను నిత్యముక్తుఁడైన యీశ్వరుఁడను. నేను ప్రకృతి కాత్మదానము చేసినను బద్ధుఁడనుగాను. నేను విజ్ఞానమయ మహేశ్వరుఁడను. ప్రకృతి నాయస్తిత్వమువల్లనే, చైతన్యమయము నైనదనుట నే నెఱుఁగుదును; ఎప్పుడును నెఱుఁగుదును. ఈ జ్ఞానము నన్ను విడిచిపోదు, కనుక నేను ముక్తుఁడనైన యీశ్వరుఁడను.

"సరే, నీవు నిత్యముక్తుఁడవు; ఈశ్వరుఁడవు మఱి నేను కర్మపాశ బద్ధుఁడనైన జీవుఁడను, అని పరిచయము చేసితివి. తెలిసినది. నీ నిజగుణమైన మేరలేని దయతో శిష్యునిఁగా గ్రహించితివికదా. ఈ బంధనము వలన విడివడు నుపాయమును దెలుపుము. అను పార్థునికి భగవంతుఁడు. —

చూడుము - ఇదిగో, ఈ ప్రకృతిని నాకంటె (నేను కంటె) వేఱయిన యొక జడపదార్థముగా నెన్నవలదు. అగ్నిమయమైన యినుపముక్కను, అగ్నియే యనుటచే హానియేమి! ఏలన, ఆ యినుపముక్కయొక్క ప్రత్యేక పరమాణువును అగ్నిమయమే. దీని ప్రత్యేక పరమాణువునందును దహనశక్తి యున్నది. ఇట్లే సరిగా జగత్తు నందంతటను నేనే చైతన్యమయుఁడనై పడుగుంబేకవలెఁ (ఓతప్రోతభావముతో) వ్యాపించి యున్నాను. నేనే ప్రకృతిరూపముతో, విశ్వరూపముతో నాత్మప్రకాశము చేయుచున్నాను. దీనిని అనుశీలన సహాయముతోఁ దెలియఁ బ్రయత్నింపుము. ఇదిగో, ఈ యనుశీలనము పేరే సత్యప్రతిష్ఠ. లోహాగ్నులకుఁ బోలి జడత్వచైతన్యాములకు భేదము బోధపడనంతదాఁక, చైతన్యవస్తువుయొక్క యథార్థసంధానము దొరకదు. అంతదాఁక జడపదార్థరూపముతో నీ యెదుటఁ దోఁచు దానిని సత్యరూపముగా, చైతన్యమయరూపముగా, నీశ్వరరూపముగా, ఇష్టరూపముగా, ఆత్మరూపముగాఁ జూచుచుండుము. ఓయీ! పార్థా! నేనే జడవస్తువేషము వేసికొని, నీ యెదుటఁ గానవచ్చుచుందును. (నీకు దర్శనమిచ్చుచుందును) నేనే ప్రకృతినయి మాతృరూపముతో నిన్నొడిలోఁ

జేసుకొని యున్నాను. నావైపు (నేను వైపు) చూడుము. నేనెటుల నిత్యముక్తుఁడనో, నీవు నట్లే, నిత్యముక్తుఁడవు కాఁగలవు. ఏలన నీవును నేనును, ఒక్కటే వస్తువు. ఎట్టి భేద మును లేదు. అబ్బాయి! నీ వంతటను నన్ను (నేనును) జూచుచుఁ జూచుచు, అహంమయుఁడవే (నేనే) యై పొమ్ము. నిన్ను మఱచిపో. నీవును నిత్యముక్తుఁడవనుట యతిసులభముగాఁ దెలియఁ గలవు.

అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్।
పరంభావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్॥ ౧౧

మూఢులైన మనుజులు మనుష్య శరీరమును దాల్చిన నన్ను అవజ్ఞ చేయుదురు. సర్వభూతమహేశ్వరమైన నా పరమ భావమును వారెఱుఁగరు.

అర్జునా! మూఢులు (మోహాచ్ఛన్నులు) నా పరమ భావము నెఱుంగనివారు, నేనే సర్వభూతమహేశ్వరుఁడనని తెలియనివారు. తెలియుటకై ప్రయత్నమైనను జేయనివారు మాత్రమే మనుష్య దేహధారినైన నన్ను (నేనును) అవజ్ఞ చేయుదురు. ప్రత్యేక జీవ దేహమందును, ప్రతి పరమాణువు నందును, నేనేయున్నాను. సత్యము. కాని, మనుష్య దేహా శ్రయమందు, నా యే స్వరూపము నెలయుచున్నదో, దానినే మిగుల నవజ్ఞాతముఁ జేయుచున్నారు. ఏమనఁగా, మానవుని కంటెను నీచ స్తరమందున్న జీవులైన తిర్యగ్జాతులకు జ్ఞాన వికా సము లేదు. కనుక నవి యవజ్ఞ యేమిచేయును? ఇఁక, మను

ష్యుని గంటెను, నుచ్చస్తరమందున్న యా దేవతావర్గము నిత్యము నాసత్తను ప్రత్యక్షము చేసికొనుచుండును, గావున నచ్చటను నెట్టి యవజ్ఞాబుద్ధి లేదు. ఈమధ్యస్తరమందలి మనుష్యులే నన్నుఁజూడరు. నా స్వరూపము నెఱుంగ బ్రయత్నింపరు. పైపెచ్చు, అసూయ అవజ్ఞ చేయుదురు. సారమేమనఁగా, - మనుష్యగణమే, ఆత్మమర్యాదా జ్ఞానహీనము, చూడు - ఆత్మనైన నేను, ఈశ్వరుఁడనైన నేను, ఏదేనొక మనుష్యదేహము నాశ్రయించి, ధర్మగ్లానిని దొలఁగించుటకై యావిర్భవించునపుడు, వారు నామనుష్యోచిత వ్యవహారమును జూచి, నాయీశ్వరీయ స్వరూపమువలన వంచితులగుచున్నారు. అనఁగా నాయెడ నీశ్వరబుద్ధి నుంచలేకున్నారు. ఇది చూడు. దంతవక్త్రుఁడు, శిశుపాలుఁడు కంసుఁడు, దుర్యోధనుఁడు మున్నగువారలే నా యీశ్వరత్వమును స్వీకరింపలేరైరి. ఏమి? ఎందుచేత స్వీకరింపఁ జాలరైరి? వారి చూపునందు నా మానవీయ దౌర్బల్యములే యెల్లప్పుడును ప్రతిభాసించినవి. సరే నీవెందుల కట్టి దౌర్బల్యములే చూపితి వందువేమో? - దానికి బదులు మాట ఇది - ఎల్లపుడు నీశ్వరీయ భావమందే నిల్చియున్నచో మఱి మనుష్యదేహము నాశ్రయించిన ప్రయోజనముండదు. మనుష్య దేహమందెన్ని విధముల దౌర్బల్యములుండగలవో, ఆ యన్నిటిలోనుండి నా స్వరూపము ప్రకాశింపగలదు. దీని నాచరించి చూపుటకే, నాకు మనుష్య రూపముతో నాత్మ ప్రకాశముచేయు పని పడుచుండును. సౌభాగ్యవంతులు, సుకృతిశాలురు నగువారలే, సర్వదా నా స్వాధీనతను, ఈశ్వరత్వమును

గుర్తింపఁగలరు. తోడ్తోనే తమ జీవనముల నున్నతికిఁ దెచ్చుకొనుచుందురు. అర్జునా! చూడు, నీవే నాయెడఁ బ్రత్యక్షమగు నీశ్వరబోధము స్థిరముగా నిల్పఁగల్గితివా? రెండురోజులు సరిగా నిల్చినది. సరి, మూఁడవనాఁడు యథాపూర్వముగా మానవీయ దుర్బలత వచ్చిపడినది, ఔరా! ఎట్టి యహంకారాగత విచార బుద్ధి వచ్చి నిల్చినది! యుక్తులెన్నో నీలోనే గలగలలాడి, మఱల నీశ్వరబోధమును స్థిరపెట్టలేక పోయినవి. ఎందుల కిట్లగునో యెఱుఁగుదువా? అపుడు నీవు మోహాచ్ఛన్నుఁడవై పోయితివి. నా పరమభావము మఱి నీ జ్ఞానమందుఁ బ్రతిఫలితము కాలేదు. సర్వభూత మహేశ్వర గురుఁడను నేనే యను తెలివి నీలోనుండి జాఱిపోయి "నీ వీశ్వరుఁడవే" యనెడి జ్ఞానము స్థిర పడినను నాకగు నుపకారమేమి? యనఁగలవు. ఒక్కసారి క్షణ మాత్రము కల్పన చేసియైనను, నా యీశ్వరత్వమును వెన్నంటి వడి యడుగు వేసిచూడు. ఆ క్షణమందే యెంత పవిత్రుఁడ వగుదువో, యెంత గొప్పఁదనము నీలోఁదోఁచునో, కనుఁగొనఁ గలవు.

నీభావి యీశ్వర జ్ఞానమును లెస్సగా మేలుకొల్పుటకై యవతారవాదమెంతగా సార్థకమో, చూడు. అవతార వాద మునకు నిరర్థకతను మిథ్యాత్వమును బ్రతిపాదించువారు, జగత్తునకును నీకుసైతము మిథ్యాత్వమును బ్రతిపాదించువారలే యనుకొమ్ము. పోనీ; వారిమాట వేఱు, "సర్వం మిథ్యా సాగరం మిథ్యా" యనుచోటను, ద్వైతమనుచు లేనేలేదను చోటను, అవతారమనునదియు లేదు. కాని, నిన్ను నీవు జీవ

రూపమునఁ బ్రత్యక్షానుభవము చేయునంతదాఁక, నీకు జగద్దర్శన మగుచుండు నంతదాఁక, అన్నాళ్ళును అవతారము నిశ్చయమే. కేవలము నీకొఱకే యవతారము; పరులకొఱకుఁ గాదు. అసంఖ్యులుగానున్న నరనారులను, అవతారరూపమునఁ గనుచూపుగల్గి ధన్యుఁడవగుము. కాఁగలవు. వేనవేలు నరనారులు నన్ను మనుష్యరూపునిగానే చూచి మనుష్య భావమునే పరిపోషించుచున్నారు. వేనవేలు నరనారులు నా కార్య కలాప వ్యవహారములయెడ దుఃఖితులై వెఱ్ఱివెఱ్ఱి యాలోచనములు చేయుచు బొత్తిగా నాకెడమై పోవుచున్నారు. కాని నీవు మాత్రము, నేనే యీమూర్తిఁదాల్చిన యీశ్వరుఁడనే సారథి రూపమున నీరథముపైఁ గూరుచున్నట్లు కనవలయును సుమా. ఎపుడేని మోహము నిన్నుఁ గప్పెనేని, ఎపుడేని నా ఈశ్వరత్వ బోధమున కెడమై పోదువేని, అపుడే నీచేత నేనవజ్ఞాతుఁడ నైతినన్నమాట. నాకవజ్ఞ చేయుటయన నా యీశ్వరత్వమంగీకరింపఁ బడలేదని యర్థము.

"ఆహా! దేవా! నీ యీశ్వరత్వమునెడ నెన్ని సంశయములు వచ్చిపడుచున్నవి! నన్ను సర్వకర్మములందు నియమించువాఁడే యీశ్వరుఁడు; నా జీవనమును యథార్థముగాఁ బరిచరింపఁ జేయువాఁడీశ్వరుఁడు. అతనినే యీశ్వరుఁడని స్వీకరింపఁ గలను. కాని నీవో నా రథచాలకుఁడవు మాత్రమే. నేను నీ యీశ్వరత్వము నెట్లునమ్మఁగలను?" అని యడుగఁగలవు.

అరరే! యుక్తిచేతను, తర్కముచేతను, ప్రమాణము చేతను నా యీశ్వరత్వమును స్థాపింపఁగోరుచున్నావా? ఇది

నీ దృష్టత్వము, శిశుత్వము మాత్రమే. నీ బుద్ధియందుఁ బ్రమాణ యోగ్యత యెంతకలదో, దానితో నన్నుఁ గొల్వఁ జూచుచున్నావా? నాయెడ నీకనుకూల వ్యవహారముండు నంత దాఁక నాయెడ నీకనుకూల ఘటనము లగుచుండు నంతదాఁక మాత్రమే. నీవు సన్నీశ్వరునిఁగాఁ దలంతువు. ప్రతికూల వ్యవహారమయ్యెనా; మఱి యీశ్వరుఁడనుగాను. ఇదే నీబుద్ధికిఁ బ్రమాణయోగ్యత లేదనుట. ఎందుకు లేదందువా? విను — అభిమన్యువధమైనపుడు నేను నీ సారథి మాత్రుఁడనే. కురుక్షేత్ర యుద్ధమందు విజయివైనచో, నేనీశ్వరుఁడనే. నీ బుద్ధియం దీశ్వరత్వము, అనీశ్వరత్వము నింతపాటిదేనా? ఇదే నీ బుద్ధి సామర్థ్యమా? ఇదంతయు నీ భ్రాంతభావము - బుద్ధికార్యము కాదు. ఈ గౌరవము అగౌరవము అనునది మనస్సు పనియే. బుద్ధి యనునది, దేనిని సత్యముగా నెన్నునో, యది మఱెన్నఁడును విచలితము కాదు. బుద్ధి నిశ్చయాత్మిక. (బుద్ధిస్వరూపము) అచ్చట నెవ్వఁడేని నా ఈశ్వర రూపమును దర్శింపఁగల్గెనేని వాని యా జ్ఞాన మెన్నఁడును జెదరిపోదు. ఇటుచూడు. అగ్ని వేడిగా నున్నదనెడి ఈ జ్ఞానము నీ స్థిరనిశ్చయ జ్ఞానమేకదా. ఎవ్వఁడేని వేనవేల యుక్తులతోను, ప్రత్యక్ష ప్రమాణములతోను, అగ్నికిఁ జల్లదనమును బ్రమాణితము చేసినను, నీ బుద్ధి కాదు, కాదు; అదియేదో కారణవశమున నటు లతనికిఁ దోఁచినది, కాని యగ్ని స్వభావముచే వేడిదే, యనియే చెప్పును. ఆవిధముగానే నిశ్చయ జ్ఞానముచే నెవ్వఁడేని. ఈశ్వరత్వమందుఁ బ్రతిష్ఠితుఁడైనచో, నీశ్వరబోధ మీవిధమైన నిశ్చయ జ్ఞానముచే

నిల్చిపోవునేని, వాఁడు పూర్తిగా నిర్విచారుఁడగును. ప్రమాణమే కావలయునేని, ఈశ్వరుఁడు సర్వవ్యాపి; సర్వశక్తిమంతుఁడు ననుమాటను విశ్వసింపవలయును. అదే సరియేని (సత్యమేని) సర్వశక్తిమంతుఁ డీశ్వరుఁడు; ఈ శరీరమందు విరాజిల్లుఁడా ! యని యెట్లు పలుకఁగలఁడు ? సరే. అప్పుడు సాధారణ పురుషునకును అవతార పురుషునకును భేదమేమి ? యని యడిగెదవా ? చూడుము. సాధారణ పురుషుఁడు, 'నే నీశ్వరుఁడను' అనుమాట నోర ననఁజాలఁడు. ఎవఁడేని దీని నంగీకరించి, యిదే సత్యమని మనసారఁబలుకఁ గల్గినపుడు, వాఁడు పరాగపరమాణువే కానిమ్ము; వాని నీశ్వరుఁడన్నచో, నీకగు హానియేమున్నది ? అందువా ? నీకేలాభము; అనవా, — నీకేక్షతి. నేను మొదటినుండియు, నెప్పుడెప్పుడు ధర్మమునకు గ్లాని వచ్చిపడునో, యపుడపుడల్ల నేనావిర్భవింతునని చెప్పుచునే యున్నాను. ఇదె యవతారవాద వాక్యము.

అవతారమందు విశ్వాసవంతుఁడై, మనుష్య దేహము నాశ్రయించిన నన్నీశ్వరరూపమునఁ గనుట యలవాటయిన వానికి ఈ మంత్రశ్లోక మేమిచెప్పునో యాలోచింపఁబడును.

ప్రత్యేక దేహమందును "నేను రూపము"తో నుండి (అహంకారము కాదు సుమా) 'నేను' అనుమాటచే గుర్తింపఁబడు వాఁడే ఈశ్వరుఁడు. ఈ సమస్తభౌతిక జగత్ ప్రపంచము, అతని సత్తచేతనే, ఆతనిప్రకాశముచేతనే ప్రకాశితమగునని తెలియలేని మనుష్యులే నన్ను (నేనునకు) అవజ్ఞచేయువారు. సర్వభూతములును "నేనునందే" యవస్థితములు నెడి మాట "మయా

తతమిదం సర్వం" అను శ్లోక వివరణమందుఁ జెప్పఁబడినది. ఈ నేనే సర్వభూత మహేశ్వరుఁడనియు, ఈ నేనే స్వప్రకాశుఁడనియు, ఈ నేనే సర్వభూతములకు సత్తాదాయకుఁడనియు, ఈ నేనే సర్వభూత ప్రకాశకుఁడనియు, దెలియని మనుష్యుఁడు, తనను దానే కడునవజ్ఞ చేసికొనుచున్నాఁడు. "నేను దుర్బలుడను, నేనుపాపిని, దురాచారుఁడను. నేనసూయుఁడనైన జీవుడను." మున్నగు భావముల రూపమున, మనుష్యుడా! నీవు పరమేశ్వరుఁడైన నన్ను (నేనును) అవమానించు నకృతజ్ఞ జీవుఁడవు. జన్మజన్మాంతరములనుండియు నిన్ను గుండెకత్తుకొని, నీచే స్వాధీనవిలాస భోగములను జేయించుచున్నాను. ధని, పాపి, దరిద్రుఁడు, సాధువు, పుణ్యవంతుఁడు, తస్కరుఁడు, రోగి, స్వస్థుఁడు, ఉచ్చుఁడు, నీచుఁడు - ఎప్పుడెట్టి మస్తాబు రుచికరమని తలంచి స్వీకరింతువో, అప్పుడట్టి మస్తాబునే చేయించి నిన్నొడిలోఁ జేర్చుకొనుచున్నాను. నీవునన్నుఁ జూడవు. చూడలేదు. ఇంచుకంత యాదరమైనను జేయలేదు. ఒక్కసారి నన్ను 'ఆత్మ' యనుపట్టున దూరముగాఁ దొలఁగిపోతివి. ఒక్కసారి యాత్మీయుఁడనియు స్వీకరింపవు. నీవు నిద్రించునప్పుడును నీకై నేను మేలుకొని యుందును. నీ మొకమువైపు రెప్పవేయక చూచుచుందును. మృత్యువు నోడిలో దొరలునపుడును, నేను సమానాదరముతో నే నిన్నొడియందుఁ జేర్చుకొనియే యుందును. ప్రేతలోకమునకో, దేవలోకమునకో, మనుజలోకమునకో, యే లోకమునకేనిఁబొమ్ము. నేను నీచిర సహచరుఁడనై యుందును. నేను నీనమ్మిన మిత్రుఁడను, నీచిర పురాతన

సేవకుఁడను, నీచిర జీవనగురుఁడను; చుట్టమును; నేస్తమను; నేనే నీ ఈశ్వరుఁడను. నన్ను (నేనును) బోల్చుకొనవు. ఔరా! నా ఈశ్వరథతో నిండిన హృదయ భేదియైన వాక్కును నీవు విన్నావా?

"అవజానన్తిమాం మూఢా మానుషీం తను మాశ్రితమ్" పశువుగా నున్నన్నాళ్ళు నీవు నన్నుఁ బోల్చుకొనలేనైతివి, పో; యిపుడు మనుష్యుఁడవైతివి. నేడైనను నన్ను (నేనును) బోల్చికొనవా? నన్నాదరింపవా? నేనేలేకున్న నీకేమియు లేను. ఉండదు. నీదియైన సర్వము – ఈ దేహము, ఇంద్రియములు, కొడుకులు, కూఁతులు, ఇల్లాండ్రు; విత్తము, యశస్సు, ప్రతిష్ఠ యేదేనంతయు 'నేను' పైనే యవస్థితమై యున్నది. నా సత్తచేతనే సత్తావంతుఁడవు. నేనే నీసర్వభావాధిష్ఠాతయైన ప్రియతమాత్మను, ఈశ్వరుఁడను. నన్ను (నేనును) ఎన్నాళ్ళు లవజ్ఞాతునిఁ జేయుదువు?

మోఘాశా మోఘకర్మాణః మోఘజ్ఞానా విచేతసః।
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః ॥ ౧౨

నాకు (నేనునకు) అవజ్ఞ చేయుటచేతనే మనుష్యుని యాశలన్నియు నిష్ఫలము లగుచున్నవి. కర్మసమూహమంతయు వ్యర్థమగుచున్నది. దానివలనఁ జిత్తవిక్షేపమగుచున్నది. దాని ఫలముగాఁ దామసియైన యాసురీ ప్రకృతిని, రాజసియునైన రాక్షసీ ప్రకృతిని, ఆశ్రయించుచున్నారు.

అర్జునా! నన్నవజ్ఞాతుని జేసిన ఫలముగా మనుజునకు మూఁడు దురవస్థలు వచ్చిపడుచున్నవి. ఆశయు వ్యర్థమగు చున్నది. కర్మములు వ్యర్థమగుచున్నవి. జ్ఞానమును వ్యర్థమగు చున్నది. ఆశకు సరియైన యర్థము = ఆశంస; అనఁగా ప్రార్థనము. సాధారణముగా నేదేనొక నిశ్చితవస్తువు నొందు టకై కాలమున కెదురుచూచుట పేరే ప్రతీక్ష. ఈ రెండిటిని లక్షించియే యిచట, 'ఆశా' శబ్దము ప్రయోగింపఁబడినది. ఆశ – ప్రతీక్ష యను రెంటి మూలమందుఁ బ్రార్థనమున్నది; లోపలఁ గల ప్రార్థనమే, ఆశా ప్రతీక్షా రూపమున వెలయును. కనుకనే, ఆశ వ్యర్థమగును – అనఁగాఁ బ్రార్థనమే వ్యర్థమగు ననుట. "దేవా! అనేకులు నీ కవజ్ఞ చేయువారయినను, ప్రార్థ నానురూప ఫలమును బొందుచుండుటఁ గనుచున్నామే" అందువేమో? సరే; నా కవజ్ఞచేయుటయు, నచటనే యాశా పూర్తి యగుటయుఁ గనుచున్నావు. ఇదిగో, అట్టిచోట వారి దృష్టిని నావైపు త్రిప్పుటకే యని యెఱుంగుము. చూడు; చిన్నపిల్లలకు మిఠాయిని (తీఁపుని తినుబడులను) ఆశపెట్టి విద్యా శిక్షణమునకును, మందు మ్రింగుటకును బ్రోత్సహింతుము. అటులే దేనిచే నాయెడ శ్రద్ధాళువు లగుదురో, నా యస్తిత్వమునందు విశ్వాసవంతు లగుదురో యరసి, యాలాభముఁ గలిగించుటకే యని తెలిసికొమ్ము. కాని ఈ విధముగా, ఆశాపూర్తి యగు చున్నను, ఆశాపూర్తి చేయుచున్న వారివైపు చూపు మఱల నపుడు, వాఁడతి శీఘ్రముగా నిరాశుఁడును భగ్నోత్సాహుఁ డునై చెడుట నీవే చూతువు. ఇపుడు వానికిఁ దన పురుషార్థము

నెడ సైతము విశ్వాసము లేదు. నాయెడ లక్ష్యముంచక పోయిన ఫలముగానె యిటులగుచుండును. ఆశారూపమున సైతము నేనే జీవుని హృదయమున వెలయుచుందునని యెఱుఁగని వారి ఆశలు నెఱవేఱుటచే, వారు మిగుల నానందితులై పురుషార్థములయెడ శ్రద్ధావంతు లగుదురు. మఱి యాశ నెఱవేఱనపుడు, పూర్తిగా భగ్నోద్యము లగుదురు. కనుక నె రెండు వైపులను వారికి విక్షిప్తత వచ్చిపడును. ఇందుచేత నె "విచేతసః" అను మాట ప్రయోగింపఁబడినది. — మఱియొక పక్షమున "మయాతతమిదం" జ్ఞానమందుఁ బ్రతిష్ఠితులైనవారు నన్ను వెనుకఁ బెట్టి యేమియుం జేయరు, కనుక వారి యాస నెఱవేఱు నపుడును, నెఱవేఱ నపుడును, సమభావముతో నే నన్ను జూతురు. కావున వారు విచేతసు లగుటకు హేతువును లేదు. ప్రశాంతచిత్తముతో నుందురు.

ఇపుడు "మోఘకర్మ" విషయము విను — కర్మ తత్త్వమును జెప్పెడి పని యిచట లేదు. సాధారణముగా "కర్మ" పదముచే జీవుని యాత్మాభిముఖగతియే పరిలక్షిత మగును. కర్మము వల్లనే మనుష్యుఁడు నానాఁటికి, అసత్తునుండి సత్యము వైపు, అగ్రసరుఁడగును. చూడుము : ఒకఁడు బ్రతికి యున్నంత కాలము వైధకర్మములో, అవైధకర్మములో, యథాసాధ్యముగాఁ జేయుచున్నను, ఆత్మాభిముఖగతి నింతయుఁ బొందఁ జాలఁడు, అపుడాతని కర్మకాండ మంతయు వ్యర్థమేకదా. నావైపు లక్ష్యముంచక, యెవఁడెట్టి కర్మము లొనర్చినను, అవి యసంభవ భావముతో నాచరింపఁ బడినవే, ఎవరికో అఱకుఁ

గర్మము లాచరించుటో, వారిని ఘసనసున నుంచక, కేవల కర్మము కొఱకే కర్మము చేయువాని కర్మములు సార్థకము లగునా? ప్రత్యేక కర్మమునకును నింతయో యంతయో ఫల ముండును. గాని యా ఫలము కర్త కనుభవయోగ్యము కానపుడు, వాని యా కర్మములు వ్యర్థములే కదా. చూడు: ఒక నిష్ఠాశాలి బ్రాహ్మణుడు, చిరకాల మాచార నిష్ఠలతోఁ బాటు సంధ్యావందనాది నిత్యకర్మానుష్ఠానము చేసినాఁడు; చేయుచున్నాఁడు; కాని భగవత్సాక్షాత్కారము కానపుడు, వాని విషయమునఁ గర్మములును సమయమును వ్యర్థములే కదా. ఆ కర్మముల ఫలముగా, నింతయో, యంతయో, యగ్రసరుఁడై నాఁడనుము. నిజమే కాని, యతఁ డగ్రసరుఁడై నట్లు తానే యెఱుఁగఁడు; కావున నవి వ్యర్థములే కదా. అంతట నిటులే యనుకొమ్ము.

భగవంతు నుద్దేశించి, చేయఁబడు కర్మమే కర్మము. తక్కిన దంతయు నకర్మమే. వ్యావహారిక జీవన యాపనాదికమో సాధన భజనాదికమో, సర్వము కర్మపదవాచ్యమే, యనుట యది నన్నుద్దేశించి చేయఁబడు నపుడే యగును. నేనే కర్మ రూపమున వెలసి యాత్మప్రతీతి సంపాదనముఁ జేయుచున్నాను. మనుష్యుఁడు కర్మమయమైన నా లీలావిలాసమును నడుపు యంత్రమే, యని తెలియక, నాయెడ లక్ష్యముంచనిచో, వాని కర్మములెల్ల వ్యర్థము లేల కావు?

మఱొకమాట – కర్మముల వలని ఫలము జ్ఞానము, "సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే" కర్మములు

చేయుండేము నాత్మజ్ఞానము లభింపనియెడ, నవి వ్యర్థములు కాకుండునా? ఆత్మజ్ఞాన ప్రతిష్ఠితుఁ డగుటయే కర్మఫలము. ఆ లాభమే లేనినాఁడు మనుజుఁడు మోఘకర్ముఁడే యగును. నాయెడ లక్ష్యముంచక నాకవజ్ఞచేసియే యిట్టి దుర్దశ నొందును.

మూఁడవది – మోఘజ్ఞానము. నేనొక్కఁడనే జ్ఞాన స్వరూప వస్తువను. నాకవజ్ఞచేసి యెన్ని విధముల విషయ జ్ఞానము (అనాత్మజ్ఞానము) నెంతగా గడింపనీ, మనుష్యుఁడు మోఘజ్ఞానియే యగును. ఏలన, – అనాత్మజ్ఞానము యథార్థ జ్ఞానము కాదు. అది యజ్ఞాన మాత్రమే. సందేహము లేదు. జాగతికమైన యెన్ని విధముల జ్ఞానముల యాలోచనము నేఁ జేయుము. సాంఖ్య వేదాన్తాది దర్శన శాస్త్రముల పాండిత్యము నెంతే గడింపుము. అంతయు వ్యర్థమే. నేను జ్ఞానమూర్తినోయి! జ్ఞానస్వరూపుఁడనైన నన్నుఁ జూడక యేమి గడించినను వ్యర్థమే. నేనే విషయజ్ఞానము సంతటిని ధరించిన వాఁడను. నా (నేను యొక్క) జ్ఞానపక్షము పైనే నీ సర్వము యొక్క నిలుకడ. నా (నేను యొక్క) జ్ఞానస్వరూపము లోపలనే, నీవు తెలిసియో తెలియకో విచరించు చున్నావు. ఈ మాట నెఱుఁగ లేనపుడు నీ సర్వజ్ఞానమును మోఘమే. నిష్ఫలమే. నన్నుఁ జూపని జ్ఞానము జ్ఞానమా? అది మాటకు మాత్రమే జ్ఞానముగాని, జ్ఞానపదవాచ్యమే కాదు.

సర్వ కర్మములందును జ్ఞానస్వరూపుఁడనైన నన్నుఁ గానని ఫలముగానే మనుష్యుఁడు చిత్తవిక్షేపమునొంది చెడును. ఏకమును మఱచి బహుత్వమందు ముగ్ధుఁడగు చున్నాఁడు.

చిత్తము, ఎంతెంతగా బహుత్వమునే పట్టుకొని పోవుచుండునో అంతంతగా వెఱ్ఱెత్తినట్లు విక్షిప్తమై పోవుచుండును. జ్ఞానమును బరిత్యజించి నన్ను (నేనును) జూడక, బాహ్యపదార్థములనే చూచుచోట నగు ఫలము చిత్తవిక్షేప మాత్రమే, సుమా. చిత్తవిక్షేపమే జ్ఞానస్వరూపుఁడనగు నన్నుఁ (నేనును) బ్రకాశింప నీయదు. జ్ఞాన మొక్కటే స్థిరతమగు వస్తువు. తక్కిన దెల్ల నస్థిర నిక్షేపమయమే. నిర్మల జలమందలి స్థిరసూర్యబింబము విక్షిప్త తరంగ పరంపరచే దర్శనయోగ్యము కాకుండునట్లే భయానకమైన చిత్తవిక్షేపమే, జ్ఞానస్వరూపుఁడనగు నా ప్రకాశమును గప్పివేయును. దీని ఫలముగా మనుష్యుఁడు మోహకారిణి రాక్షసీ ప్రకృతినో, ఆసురీ ప్రకృతినో యాశ్రయించి, యాబద్ధుఁడై పోవును. జ్ఞాన స్వరూపుఁడనైన నా కవజ్ఞచేసి, మనుజుఁడు కర్మసిద్ధియందైన యాశతో ముందునకుఁబోఁ జూచునేని, వాని యాశలు వ్యర్థమై పోవునటులే, వాని కర్మములును వాని జ్ఞానమును, నిష్ఫలములై పోవును. దీని ఫలముగా బాహ్య విభిన్నవస్తువుల యాకర్షణము మెండయి, వాని నిటునటు పరుగెత్తించును. అది మహాదుఃఖమయావస్థయే. అప్పుడే, "ప్రకృతిం మోహినీం శ్రితాః" అని భగవంతుఁ డనెను. దేహాత్మ బోధ, ధనాత్మ బోధ, పుత్రాత్మ బోధ, మన ఆత్మ బోధ గైకొని మతిపోయి తిరుగుట పేరే, మోహినీ ప్రకృతి నాశ్రయించి యుండుట. విశుద్ధాత్మ స్వరూపమును, స్వాభావికాత్మ స్వరూపము నైన జ్ఞానమునుండి జాఱిపోయి, (జ్ఞానము తొలఁగి) అనాత్మ వస్తువులందే యాత్మబోధముఁ గొని విచరిం

చుట, యెంత కష్టతరము! నాకుఁ (నేనునను) అవజ్ఞ చేయుట వలన నెంత భయానక పరిణామమో, చూడుము.

మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః।
భజ న్త్య నన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్॥ ౧౩

అర్జునా! మహాత్ములు దైవీ ప్రకృతిని మున్నుగా నాశ్రయించి నన్ను భూతగ్రామమున కవ్యయ కారణస్వరూపముగా నెఱుంగుటచే, నన్నే యనన్య మనస్కులై భజింతురు.

రాజసీ తామసీ ప్రకృతి వర్ణన మైనది. ఇపుడు సాత్త్విక ప్రకృతి మాట చెప్పఁబడును.

మహాత్ములు, అనఁగా నాత్మయే యెవ్వరియెడ గొప్పదిగాఁ బ్రతిఫలించునో వారు, మహాత్ములు. జగమున రెండు తెగల జనులు గాన వత్తురు. ఒక తెగ దేహాత్మబోధ సంపన్నులు. వీరికి ఆత్మ 'మహాన్' రూపమునఁ దోఁపదు. నశ్వర వస్తురూపమునను, దేహరూపమునను వీరియందుఁ బ్రకాశించును. కావున నిట్టి పురుషులు మహాత్ములు కాఁజాలరు. ఇఁక మనోబుద్ధ్యాదుల కంటెను, ఆత్మకు వేఱుదనమును గొప్పఁదనమును లెస్సగా నవధరింపఁగలవారే మహాత్ములు. వారు నాకు ఆత్మకు, అవజ్ఞ చేయరు. సర్వవస్తువులందును; సర్వకర్మములందును, నా (ఆత్మ) సత్తనే లక్షించుచుందురు. కనుక వారు దైవీప్రకృతి నవలంబించుటచే, అపూర్వానన్యమనస్కులే యగుదురు; నన్నే

భజించుచుందురు. అనన్యమనస్కులనఁగా - మనసునందు నా (ఆత్మ) సత్తదక్క నితరమైనదేని సత్తయు నెవరికిలేదో వారే యనన్యమనసులు. ఒక్క నా సత్తయే యీ జగద్రూపమునఁ బ్రతిఫలితమగుచున్నదని, అనఁగా - నేనే జగదాకారముతో నాకారితుఁడనై ప్రకాశింతుననెడి సత్యమును నిశ్చయముగా నవధరింపఁగలిగిన వారే, "మాం భజన్తి" కేవలము నా భజనమునే చేయుదురు. (నన్నంటియే యుందురు). ఏలన, నన్ను (నేనును) దప్పించి, వారికిఁ బ్రార్థనీయవస్తువు - ఇష్టవస్తువు - వేఱొకటి యుండఁజాలదు. మఱి నేనే సర్వమునైనపుడు, నన్ను (నేనును) విడిచి యితరమును దేనిని గోరుదురు !.

నా భజనమెందులకుఁ జేయుదురో, దాని హేతువిది - "జ్ఞాత్వా భూతాది మవ్యయమ్" నన్ను భూతాది - అవ్యయుఁడునని తెలిసియే భజింతురు. ఈ పరిదృశ్యమాన భూత పదార్థ సంచయమునకు నేనే ఆది, అనఁగా, కారణము, నా వల్లనే సర్వజగదుత్పత్తి స్థితిలయములగును. నేనే సర్వభూతముల యుత్పాదనమునకు నిమిత్త కారణము. నేనే ఉపాదాన కారణము. ఈ యుభయకారణ స్వరూపమైన నాకెట్టి పరివర్తనము గాని, పరిణామముగాని కాదు. కనుక నేనవ్యయుఁడను. నేను కర్మరూపమైన వ్యయస్వ రూపమును - అనఁగా విభిన్న రూపాంతరములను, గ్రహించుచున్నను, కారణ స్వరూపముచే నేనవ్యయుఁడను. భూత స్వరూపముచే నేను వ్యయుఁడను. భూతసమూహముయొక్క ఆదిస్వరూపముచే నేనవ్యయుఁడను.

కుండలు, గిన్నెలు, మూకుళ్లు మున్నగు రూపముల పరివర్తన మగుచు బహుత్వము కానఁబడుచున్నను, మృత్తికయొక్కటే, యయియున్నటులే, నేనీజగత్తున కవ్యయకారణమనని తెలిసి నా భజనము చేయుదురు. గురువాక్యమందును, వేదవాక్యమందును విశేషశ్రద్ధావంతు లగువారు మాత్రమే, గురువేదవాక్యములచే నా యీ భూతాది - అవ్యయ స్వరూపమును పరోక్షభావముచే నెఱింగికొని, దాని ప్రత్యక్షానుభవము చేసికొనుటకై, అనఁగా-ఆత్మస్వరూపమం దవస్థితులగుటకై నన్ను భజించుచుందురు, ఉపాసింతురు, సేవింతురు, ఆరాధింతురు, ధ్యానధారణాదికము ననుష్ఠింతురు.

ఆ భజనమెట్టిదో, యీ తరువాతి శ్లోకమందుఁ దెలుపుచున్నాఁడు.

సతతం కీర్తయన్తోమాం యతన్తశ్చ దృఢవ్రతాః
నమస్యన్తశ్చమాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥ ౧౪

ఇందు భజన ప్రకారమును జెప్పుచున్నాఁడు. వారు సర్వదా నా గుణములను గీర్తింతురు. నన్నొందుటకై యథాసాధ్య ప్రయత్నముఁ జేయుదురు. నియతానుష్ఠానపూర్వకమైన యమనియమాదుల ననుశీలింతురు. నాకుఁ భక్తితోఁ బ్రణమిల్లుదురు. ఇట్లు నిత్యయుక్తులైయుండి యుపాసింతురు.

మనుష్యుఁడు బహుసుకృత బలముచే దైవీప్రకృతి యంకమునందునిల్చును. మహాత్ముఁడగును. అపుడతఁ డేవిధముగా నా యుపాసన మొనర్చునో, యది యిపుడు చెప్పఁబడును. ఎల్లప్పుడును నాకీర్తనము చేయును. ఏలన "మయాతత

మిదం సర్వమ్” కనుక జగత్తునందు దేనికీర్తన మెవఁడు చేసినను అదివానికిఁ దెలిసియో తెలియకో నా (నేనుయొక్క) కీర్తనమే యగును. అపుడు మహాత్ములైనవారు, నేనే సర్వమును గాన గుణమహాత్మ్య కీర్తనము చేయువేళ, నన్నే (నేనుచే) కొని యాడుచున్నామని యెఱుఁగుదురు. ఎఱిఁగియే కీర్తింతురు.

ఇక్కాలమున బహువిధములుగా నామకీర్తనాదికము జరుగుట కనుచున్నాము. గాని యది ఈ “మాం కీర్తయన్తః” అను వాక్యముయొక్క దురాగతాను శీలనము. “నామ రూప ముతో నామియే నెలయుచున్నాఁడు. నామముతోనె (శ్రీ)హరి తానున్నాఁడు” అనెడి మాటయొక్క సార్థక్యము ననుభవించు వారి నామకీర్తన కార్యమే సార్థకమగును. అదే యీ గీతోక్త కీర్తనము. “మాం పరిత్యజ్య” నన్ను వెనుకఁబెట్టి - ప్రాణ దేవతయెడ లక్ష్యముంచకచేయు నామకీర్తనము, యథార్థ కీర్తనమునకుఁ బూర్వవర్తి సాధనముమాత్రమే. మంత్ర జప ములు సైతము, కీర్తనములోనికే వచ్చును. జపవేళ, మంత్రము చైతన్యమయము చైతన్యయుక్తము చైతన్యస్ఫూర్తియుఁగా దేని, ఆ జపము యథార్థ జపమనఁబడదు. అదియు యథార్థ జపమునకు ముందగు సాధనమే. (దీనివిపుల వివరణమునకై, నా వ్రాసిన దేవ పూజారహస్యమును జూచునది.)

యతన్తః — యత్నము చేయుదురు - నన్నొందుటకై తీవ్రయత్నము చేయుదురు. ఎవని యత్నమెంత తీవ్రముగా నుండునో, నేను వానికంత సన్నిహితుఁడుగా నగుదును. కొందఱు “ప్రయత్నములేకయే భగవత్కరుణచే సర్వము సంపన్న

మగును. ఆ సమయము వచ్చినపుడతఁడే పిల్చును" అందురు. గాని, వారికిని, ఆసర్వమయ భగవత్కరుణ నొందుటకై ప్రయత్నము తప్పదు. ఉచిత సమయమందు భగవంతుఁడు, తానే పిల్చునని చేతులు ముడుచుకొని యెదురుచూచుచో నెంత దాఁక నాసమయము రాదో యంతదాఁక, సాంసారికమైన యెడపెడ దెబ్బలను గిక్కురుమనక యోర్చుకొనుటకై ప్రయత్నము వలదా?

స్థూలయత్నము లేక జగత్తునందేదియు లభియింపదు. వెలపెట్టక ఏదియు దొరకదు. కృపయు మూల్యాలభ్యమే, యనుమాట యెల్లరకును రుచింపక పోయినను – సత్యమెయగుచు. ఎక్కడైనను జూడుము. ప్రయత్నము లేకయే యేదేనిఁ ప్రాపించినను, నీకంటికిఁ గానరాకే, యత్నముచాటు దాగియున్న దనుకొమ్ము. చెప్పెడిదేమనఁగా, కొంచెకొంచెము యత్నము జరుగుచున్నప్పుడు భగవత్కృపయే యత్నాకారమున వెలసిన దని తెలిసికొమ్ము. యత్నమే కార్యమునకుఁ దొలుతటిది. యత్నమెన్నఁడును వ్యర్థముకాదు. ఏదియెట్లయినను, దైవీ ప్రకృతి నాశ్రయించిన మహాత్ములయం దాలక్షణము తప్పక ప్రకాశించును.

దృఢవ్రతాః— నిశ్చిత నియమముల నవలంబించువారు దృఢవ్రతులు. నన్నొందుటకే దృఢనిశ్చయులై, యేదేనొక విశిష్ట నియమమును బూనువారు. విశిష్ట నియమమునకే వ్రతమనిపేరు. కొందఱు నామసంకీర్తనము చేయుదురు. కొందఱు తపస్సు చేయుదురు, కొందఱు ధ్యానము చేయుదురు,

కొందఱు యోగము చేయుదురు. కొందఱు పూజలు చేయుదురు. ఇవన్నియు నిచట వ్రతశబ్దమునకు లక్ష్యములే. ఈ సర్వకర్మములందును, లేదా వ్రతానుష్ఠానము నందును గొంత దార్ఢ్యము కావలయును. అనఁగా, నిశ్చయముగ నాకు దీనివలన భగవత్ప్రాప్తి యగుననెడి విషయమున నెట్టి సంశయమును లేదు." అనునిట్టి నిశ్చయజ్ఞానమే, భగవత్ప్రాప్తికైన ముఖ్యోపాయము. ఎవఁడేది చేయనీ; ఉపాసనా ప్రకారము నందెట్టి మేలుగీళ్ళును లేవు. ఎవఁడేది చేసినను, వానికి దానియందు దృఢనిశ్చయ జ్ఞానమావశ్యకము. ప్రతిదినము పాఱతో మన్ను త్రవ్వుటయనెడి పనిచేసినను; దానియందు వానికి దృఢనిశ్చయ జ్ఞానమున్నయెడల, దానివల్లనే వానికి భగవత్ప్రాప్తి కాఁగలదు.

అనేకులు ప్రత్యహము యథానియమముగా సంధ్యావందనము, పూజ, జపము, తపస్సు మున్నగునవి చేయుదురు. కాని దృఢత లేదు. అనఁగా, నీ సర్వకర్మములను జేయుటవలన భగవత్సంగ లాభమగుననెడి విశ్వాసమునకుఁ గడుదవ్వున్నారు. ఈవిధముగా శుభకర్మములు చేయఁగాఁ జేయఁగా నపుడెప్పుడో భగవంతుని దయ కలుగునని వారు తలంతురు. అదిసరే! వారి యీ భావమునందుఁ దప్పులేదు. గాని, యీ కార్యములఁ జేయు కాలమందే, భగవత్ స్పర్శమునొంది ధన్యులమగుచున్నామనెడి యానందోపలబ్ధి వారికింకను గాలేదు. ఎవ్వరును దమసాధన ప్రణాళియందు మార్పుచేయు నావశ్యకత లేదు. శాక్తుఁడు శాక్తుఁడుగానే యుండనీ; హిందువు హిందువుగానే

యుండనీ; ముసల్మాన్ ముసల్మాన్ గానే యుండనీ; ఎవఁడేది చేయునో యా సాధనమే శ్రేష్ఠము. ఆ సాధనమందే నిల్చి ఈ "మయాతత మిదమ్" భావమునందు, లక్ష్యము నిల్పఁగల్గెనేని, వాఁడు దృఢనిశ్చయవంతుఁడే కాఁగలడు. "మయాతత మిదం" జ్ఞానమునందు నిల్వఁగల్గుటకుమున్న "నేను దృఢవ్రతుఁడనై పోతి"నని కూర్చున్నను, మనము దానిని నమ్మరాదు. ఏలన, - ఈశ్వరుని సర్వవ్యాపిత్వము, సరిగా ననుభవింప నంతదాఁక, యథార్థముగా దృఢవ్రతుఁడు కాఁజాలడు. అంతదాఁక నైనది దృఢవ్రతమునకైన సాధనమే కాఁగలదు. దైవీప్రకృతి లాభము నొందిన మహాత్ములు మాత్రమే, నన్నొందుటకు దృఢవ్రత శీలురగుదురు. వారే నా (నేనుయొక్క-) సర్వవ్యాపక స్వరూపోపలబ్ధికై దృఢవ్రతులగుదురు. నన్నుఁగోరెడి వారి చరిత్రమం దీరెండు లక్షణములు తమంతనే వెలయును.

"నమస్యన్తశ్చమాం భక్త్యా" భక్తితో నాకుఁ బ్రణమిల్లుదురు. (ప్రణామతత్త్వమునకై నా వ్రాసిన "దేవపూజారహస్య" మనెడి గ్రంథమును జూచునది.) ఇచట భక్తిసంబంధమునఁ గొంత యాలోచనము చేయుదము. భక్తియనఁగా, నిచట మనము, స్వచ్ఛమైన సరళమైన ప్రేమము అనుకొందము అదే సులభముగా బోధపడును. అట్టి యర్థమందు మత భేదములును నుండఁజాలవు. నారదభక్తి సూత్రములందు "పరానురక్తి" యనియు, నారదభక్తి సూత్రములందు "పరమప్రేమరూపా" యనియు, నీరెండు మాటలచేత నేది తెలుపఁ బ్రయత్నింపఁ బడెనో, యాదిమన బుద్ధిశక్తిచేత "సత్ప్రేమ" గానే

తలంపఁబడును, ఏమయినను, 'ప్రేమ' యను నెట్టివస్తువో యది తెలియఁజూపుట కెవ్వరికిఁగాదు. ఏలన, సర్వజీవులందును ప్రేమ యింతయో యంతయో యున్నది. భగవంతుని యెడనగు దానికే భక్తియని పేరు. తక్కు జాగతిక వస్తువుల యెడనగు ప్రేమను మోహకారక ప్రేమనే యనుము; మఱేమన్నను హానిలేదు. ఇపుడు భగవంతుని ప్రేమించుట యనునది యెట్లు ప్రాప్తించునో చూడవలయును. ఇచటఁ బ్రేమ మనము భక్తి యనియే ప్రయోగింతము. భక్తి యనునది జన్యవస్తువు కాదు. అనఁగాఁ బుట్టింపఁదగు వస్తువుకాదు. అది నిత్యవస్తువు, కావున దీనివలన భక్తి పుట్టుననెడి, యొక హేతువుగాని, యుపాయము గాని లేదు.

జాగతిక ప్రేమ, అనుకూల వస్తువుతోనో, అనుకూల వ్యక్తితోనో ఘనిష్ఠమై పుట్టు ననుకొందురు. కాని భగవంతుని యెడ నైన ప్రేమ (భక్తి) యట్టిది కాదు. ఇది యవ్యాజమైన - కారణములేని, పూర్తిగా నప్రాకృతమైన వస్తువు. భక్తి నిత్య సిద్ధము. ఒక కర్మమువల్ల నది పుట్టునని గాని, కర్మము చేయ కున్న నది లోపించునని గాని, యనరాదు. అది స్వయం సిద్ధము. మనుష్యుఁడు యథార్థముగా దేనిని ప్రేమించునో యదె భగ వంతుఁడను, నిమ్మాట ననేకులు స్వీకరింప నొల్లరు. అపుడే వారు నిత్యసిద్ధ భక్తి వలన వంచితులగుదురు; అనఁగా నది లేకుండఁ బోదురు. భేదజ్ఞాన మెందుసంతదాఁక యథార్థ ప్రేమ కలుగదు. అది ప్రేమము యొక్క అనుశీలనము మాత్రమే. మనుష్యుఁడు, అన్నిటికంటె నధికముగా నన్నే -

నేను నే - తననే ప్రేమించు ననుచోట సందేహమే లేదు. మఱి యీ ప్రేమ కెట్టి విశేష హేతువును లేదు. మనము మన నేను నొక్క క్షణమైన విడిచియుండఁ జాలము. విడుచుట కిష్ట పడము. సుఖమునందు, దుఃఖమునందు, స్వర్గమందు, నరక మందు, సర్వత్ర నేను నొకటికే యుందుము. నేనుపట్లనైన యీ ప్రియభావము ఏదేనొక సాధనము వలన వచ్చినదా? లేక స్వతఃసిద్ధమా? ఇట్టి నేనును భగవంతుఁడని తలంపఁ గల్గినచో, భక్తి నీకు స్వయంసిద్ధముగానే లభించు వస్తువై పోవును. అయ్యో! ఎవనియెడ నీవు ప్రేమ చూపుచున్నావో, అతఁడు భగవంతుఁడను మాట మఱచి పోవుదువు. ఆ నేను జీవుఁడందువు నేనునే ప్రేమింతువు. అది భగవంతుఁడని నమ్మఁజాలవు. అదె పాపము; అదే యజ్ఞానము. దీని వల్లనే మనము భక్తి సముద్ర మందు మునుఁగు చున్నను, భక్తిహీనులమును, దీనులమునై చెడు చున్నాము. కనుకనే కృపామయుఁడు, భగవంతుఁడు కన్నులను వ్రేళ్ళతోఁ గప్పి "మయా తత మిదం సర్వ" మ్మని చూపుచున్నాఁడు. నేను యొక్క స్వరూపము, నేను యొక్క మహత్త్వము, నేను యొక్క గౌరవము హృదయంగమ మైన పుడు, ఆ నే ననెడి వస్తువు నెఱుంగఁ గల్గినపుడు, మఱి భక్తికై వారి వీరి గుమ్మముల నెక్కనక్కఱ లేదు.

జ్ఞానమును భక్తియు భిన్న వస్తువులు కావు. ఆత్మజ్ఞానము- ఆత్మప్రేమ - యను వానికి శబ్దమాత్ర భేదమే. కాని వాస్తవ ముగా భేదము లేదు. భగవంతుఁడు మనకు వేఱొకఁడుగా నుండునంతదాఁక, యథార్థ భక్తి కలుగఁ జాలదు. నా నే నన్న దే

భగవంతుఁడు, భగవంతున కాత్మదానము చేయక యున్నంత కాలము, భగవంతుఁడు వేఱొకఁడుగానే యుండును. పరు నెన్నఁడైనఁ బ్రేమింతుమా? మన నేను, అనునది స్వరూప ముచే, నేను అయి యున్నను పరరూపము (భిన్నరూపము) గానే యున్నది. నేను యొక్క పరిచయమును గలిగించు గొప్ప బలము మన బుద్ధి పర్యంతమే కలదు. మఱి, బుద్ధి కంటెను బరపారమందుఁ గూర్చున్నవాఁడే (బుద్ధితత్త్వమును మీఱి యున్నవాఁడే) నేను; వాఁడే పరుఁడు; వాఁడే పురుషుఁడు; వాఁడే పురుషోత్తముఁడు అతని యెడఁ జూపఁబడు ప్రేమయే పరకీయ ప్రేమ. వైష్ణవశాస్త్రమందు, అతనిని బ్రేమించుటయే జరుగను. ప్రేమనే యతని స్వరూపము. ప్రేమమే యచటి స్వతఃసిద్ధ వస్తువు. ఆ ప్రేమ సముద్రమందుఁ జేరుట పేరే పర కీయప్రేమ లాభము. ఈ ప్రేమ సముద్రమును జేరు దారి యందు, ఎన్నివిధముల లక్షణములు వెలయునో! గగుర్పాటు, కన్నీరు, వణకు, చెమట, నృత్యము, గానము, ఇట్టి వెన్నో చెప్పలేము. ఇవన్నియు నా ప్రేమమయమైన దాని సమీపవర్తి మార్గమందనుట మఱువకు. పరమప్రేమమయ స్వరూపమందుఁ జేరి పోయిన తర్వాత, మఱి యచట నేమగునో, యది చెప్ప టకు వీలయిన విషయము కాదు. ఔరా! అది మూగవాని బెల్లము తిండి. అది, మాటను మనసున మీఱిన యవస్థ. అచట నెట్టి భేదమును లేదు. హృదయములో హృదయము చేరిపోయి, యొకటై పోయినది. ("నమామి సోమం సోమానాం హృదయం హృదయోపరి") నేను లేదు గనుక నేనే యున్నది.

అచటఁ బ్రేమ ప్రేమిక భేదము లేదు. ఆ తత్త్వ మపూర్వము, అనిర్వచనీయము. ఆ ప్రేమను నదే పొందవలయును; అదే తెలిసికోనవలయును; అదే యనుభవింప వలయును; కనుకనే ప్రేమకై ప్రాకులాడి లాలాయితుఁడవు కాకుము.

సాధకా! దేనియెడ నీ ప్రేమము స్వాభావికమో, దానినే యీశ్వరుఁడని స్వీకరింప నభ్యసింపుము. ఈశ్వరునిఁ గల్పించుకొనకుము. అతఁడు స్వతఃసిద్ధముగా నాత్మరూపమున నంతటిలోను నున్నాఁడు. అతని మఱే లక్షణమును గానలేకున్నను, ఎవఁడు లేకున్న నీ నేనే యుండదో, నేను నకును నేనెవ్వఁడో, యతఁడే యీశ్వరుఁడు. అతఁడే "మయా తత మిదం" అని చెప్పి చూపుచున్నాఁడు. ఇమ్మాటయందు నీకు గట్టి నమ్మకము కుదురునేని, భక్తి నీకుఁ దనంతనే లభ్యమగును. ఇట్టి భక్తి నుద్దీపింపఁ జేయుటకుఁ బ్రణామముఁ జేయవలయును. కనుకనే "నమస్యన్తశ్చ మాం భక్త్యా" అనెను. మహాత్ములును దైవీ ప్రకృతి సంపన్నులు నైనవారు, ఇట్టి ప్రణామమును జేయకుండఁ జాలరు. ఎవని సత్తచే నా (నేనుయొక్క) సత్త యున్నదో, ఎవఁడు నా నేను నకును నేనై యున్నాఁడో, నూతడెంత ప్రియతముఁడగునో, అది మఱి చెప్ప వలయునా! తనంతటనే తలకాయ వంగిపోవును. తనంతనే భక్తిపూర్వక ప్రణామము జరిగిపోవును. (సిద్ధమగును.) "తస్మైతుభ్య మహాం దేవ భూయో భూయో నమామ్యహమ్। తస్మైతుభ్యం నమస్తేఽస్తు తుభ్యం మహ్యం నమో నమః।" ఈ విధముగా నెడతెగని ప్రణామము కాఁజొచ్చును. అపుడే మంత్రమందుఁ

జెప్పఁబడిన "నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే" నిత్యయుక్తులై యుపాసించుట యగును. (ఈ ప్రణామ తత్త్వమును గూర్చి నా వ్రాసిన దేవపూజా రహస్యమును జూడవలసిది).

మహాత్ములీ ౪ భావములతో నుపాసింతురు. 1. సతతం కీర్తయన్తః 2. యతన్తః 3. దృఢవ్రతాః 4. నమస్యన్తశ్చ మాం భక్త్యా. ఈ నాలుగు విధములుగా నా (నేనుయొక్క) యుపాసనము చేయఁబడును. ఇంతకుమున్ను పైతము, "చతుర్విధా భజన్తేమాం జనాః సుకృతినోఽర్జున" 1. ఆర్తః 2. జిజ్ఞాసుః 3. అర్థార్థీ 4. జ్ఞానీ, యని చెప్పఁబడినది. తమయార్తి తొలఁగుటకై మనుష్యులు భగవంతుని బిల్చుచుండు నంతదాఁక వారు "కీర్తయన్తః"; జిజ్ఞాసువులైనపుడు "యతన్తః"; అర్థార్థులగునపుడు "దృఢవ్రతాః"; ఇదిగో, జ్ఞానులగునప్పుడే "భక్త్యా నమస్యన్తః" అగుదురు. దీనివలన, జ్ఞానము గలుగునంతదాఁక భక్తిపూర్వక ప్రణామమున కధికారమే లేదని తోఁచునుగదా. మఱియిట్టి ప్రణామము మనుగడలో నొక్కసారి చేయఁగలైనా - అతని జీవనము సార్థకమైపోవును. మనమింకను దీనియందసమర్థులమే. కనుక మాటిమాటికి భక్తిప్రణామము నభినయించుచున్నాము. ఆశయేమనఁగా,-ఈ విధమైన ప్రణామాభినయము చేయగాఁజేయఁగా నెన్నఁడో యొకనాఁడు భక్తిసహిత యథార్థ ప్రణామము చేయఁగల్గుదుము. అనఁగా, కేవల జ్ఞానమయ స్వరూపసంధానమునొంది, సర్వవిధ భేదజ్ఞానము తొలఁగి, పరమానందముతో, అద్వితీయ పరమానందస్వరూపమునందుఁ జేరిపోవుదుము.

జ్ఞానముగొప్పదా? భక్తిగొప్పదా? జ్ఞానశ్రద్ధ మంచిదా? భక్తిమంచిదా? జ్ఞానమార్గము సులభమా? భక్తిమార్గము సులభమా? అనునిట్టి ప్రశ్నముల కుత్తరములు చెప్పుచుఁ గాలక్షేపము చేయక, స్వయంజ్ఞాన స్వరూపమెవరో, స్వయం ప్రేమస్వరూపమెవరో వారికి శరణాగతులమైతిమేని సర్వసంశయములు తొలఁగును. జీవనము ధన్యమగును.

మఱొక్కమాట, - "నిత్యయుక్తాః" దీనికిని రెండర్థములు కాఁగలవు. నిత్యస్వరూపవస్తువు, ఆత్మ - భగవంతుఁడు. ఆతనితో సర్వదా చేరియుండువారే నిత్యయుక్తులు. సర్వదా యనుటచే, సర్వావస్థలయందునని తెలియఁదగును. యుక్తులై యుండుట యెట్లగుననునది, యింతకుమున్నే "సతతం కీర్తయన్తః" అనుదాని వివరణమందుఁ జెప్పఁబడినది. ఉపాసనా శబ్దమునకు — సమీపమందాసనమునుగొనుట యనియర్థము. ఏవిధమైన సాధనమేఁగాని, దైనందిన సాధన భజనవేళను, భగవంతునకు సన్నిహితుఁడు కానిచో, అనఁగా నేనతనికే యేకాంత సన్నిహితుఁడ ననెడి తెలివి లేకున్నపుడది యుపాసనమే యనఁబడదు. అట్టియపుడు బ్రతికినన్నాళ్ళును, ధర్మకర్మానుష్ఠానము చేయుచున్నను, ఉపాసనాహీనుఁడై, జన్మము వ్యర్థమగుట చూచి యనుతాపము నొందవలసివచ్చును. ప్రత్యేక కార్యము నుపాసనారూపమున నగుట యావశ్యకము. ప్రత్యేక కర్మము నడుమ, మనమాతనికి సన్నిహితముగా నే యున్నామని యనుభవించు సామర్థ్యము గల్గిన పిమ్మటనే, సరియైన యుపాసనమగును.

జ్ఞానిచో నుపాసనమే కాదు; ఉపాసనావిహిత కర్మములుకూడ, సాధారణ కర్మములవంటివే యైపోవును.

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మా ము పాసతే।
యేకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ॥ ౧౫

కొందఱు జ్ఞానమనెడి యజ్ఞముచే నన్నుఁ బూజించుచు నుపాసింతురు. వారు ఒకప్పుడు ఏకత్వముతోను, అనఁగా సభేద బుద్ధితోను, మఱియొకప్పుడు, పృథగ్భావముతోను, ఒకప్పుడు విశ్వరూపముగాను, నిటులనేక విధములుగా నుపాసింతురు.

వివరణము – రాజగుహ్యయోగ సూచనమందు, భగవంతుఁడు, "జ్ఞానం విజ్ఞానసహితం" సాధన సహిత జ్ఞానమును నీకుఁ దెల్పెదనన్నాఁడు. జ్ఞానోపదేశమును మున్నే యిచ్చెను. ఇప్పుడు, "సతతం కీర్తయన్తః" అనుదానితో మొదలయిన శ్లోకముచే, ఆ జ్ఞానమునకగు సాధన రహస్యమును జూపుచున్నాఁడు. వెనుకటి శ్లోకమందు, భక్తిపూర్వ నమస్కారమని, యిపుడా తర్వాతి యవస్థను సైతము తెలియఁజెప్పుచున్నాఁడు. ఆత్మకు భక్తితో యథార్థ ప్రణామము చేయుటతోనే, ప్రణమ్యము (నమస్కరింపఁబడునది) ప్రణామకర్త ప్రణామము, అనున వన్నియుఁ గలిసిపోయి యేకమైపోవును. ఎట్టి భేదమునుండదు. ఆత్మయొక్కటే సత్యస్వరూపముగాను జ్ఞానస్వరూపముగాను, ఆనందస్వరూపముగాను, బ్రహ్మముగాను బ్రతిభాసించును, గాన, జ్ఞాని జనులు దానినేవిధముగా నుపాసింతురో, యది తెలియఁజూపుచు భగవంతుఁడు – జ్ఞానరూపయజ్ఞముచేతనే నన్నుపాసించుచు నా (నేనునకు) సమీపమందు నిలుతురు,

దానిఫలముగా నేకత్వమే భాసింపఁజొచ్చును. అపుడు మఱి, ఉపాస్యము, ఉపాసకుఁడు ననెడి భేదముండదు. అట్టి యవస్థ యందు క్షణముండి దిగిపోవును. ఏలన - ఈ యేకమేవా ద్వితీయమందుఁ జాలసేపునిల్చు సామర్థ్యము జీవునకు వేగ ముగాఁ గలుగదు. దిగుచునే యేమి కనుగొనును ? - సత్తా మాత్ర స్వరూపమైన యీ యొక్క-వస్తువే - అదే - ఉపా స్యము, ఉపాసకుఁడు ననెడి పృథగ్భావముతో నున్నదనియు, అది యేకమును భిన్నభిన్నము సైతమనియు, వ్యష్టినామరూపము లొంది, సూర్యచంద్రాకాశాదులైన వేర్వేఱు రూపములతో, నదే విరాజిల్లుననియు, సమష్టి భావమున విశ్వరూపముతో నున్నదదే, జగత్ సృష్టి స్థితిలయరూపమునఁ దన్ను వెలయించు కొనుననియు, విశ్వరూపముతో నదే యీశ్వరుఁడును, పృథ గ్రూపమున నదే జీవుఁడనియు, ఏకరూపమందదే యాత్మ - బ్రహ్మమనియు, గనుగొనును. ఇటులు బహువిధములుగా జ్ఞానులచే నుపాసింపఁబడును. కనుకనే మంత్రమందు, "ఏకత్వేన బహుత్వేన విశ్వతోముఖమ్ ఇత్థం బహుధా జ్ఞానయజ్ఞేన మాం యజన్తః అన్యే ఉపాసతే" అని చెప్పఁబడినది.

ఇచట జ్ఞానుల యుపాసనమందొక విశేషము తోఁచును. వారు జ్ఞానయజ్ఞముచేతనే యుపాసింతురు. అనఁగా, వారు కేవల దర్శనము చేయుదురు. జ్ఞాన నేత్రముతో, అనుభవ దృష్టితో, ఒకప్పుడు భేదము, ఒకప్పుడభేదము, ఒకప్పుడు సమష్టి రూపముగా విశ్వరూపముగాను, అవిశ్వేశ్వరాత్మనుగాంతురు. ఇట్టి దర్శనము పేరే జ్ఞానయజ్ఞముచేనగు నుపాసనము.

జ్ఞానయజ్ఞ పదమునకు మఱియొక యర్థము - జ్ఞానమయ యజ్ఞము. ఈ బ్రహ్మాండమే యొక విశాల యజ్ఞాగారము. ప్రతి క్షణము, ప్రతి పరమాణువు నందును, ప్రాణస్పందన మనెడి కర్మము జరుగుచునే యుండును. ఒక్క ఱెప్పపాటు నదుకు మొదలు ముక్తిపర్యన్తము జగత్తునం దంతయుఁ గర్మమే. ఈ కర్మము యజ్ఞముగాఁ బరిణమించు నపుడే, అనఁగా - యథార్థముగాఁ గర్మముల కధిపతి యెవఁడో, వాని ప్రీతికొఱకే కర్మకాండము జరుపఁబడునపు డది యజ్ఞముగాఁ బరిణమించును. మూఁడవ యధ్యాయమందు "యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః" అని చెప్పఁబడినది. కనుక జ్ఞానుల విషయమునఁ గర్మము యజ్ఞమాత్రమే. అది వ్యావహారిక కర్మమే కానీ, శ్రౌతస్మార్తాది కర్మమే కానీ, జ్ఞానుల సర్వకర్మములు యజ్ఞమే; ఉపాసనమే. ఒక యాత్మ సంవేదనము, "బ్రహ్మాత్మ ద్రష్టుర్వ్యావ హృల్లీలైవ" బ్రహ్మాత్మైకత్వ దర్శికి వ్యవహార లీలయే; సాధారణ కర్మ[illegible] కాదు. జ్ఞానిచేయు జ్ఞాన యజ్ఞోపాసనా ప్రకార భేదములను జూపినాఁడు. "అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి" మున్నగు మహావాక్యములచేఁ బ్రతిపాదింపఁబడు నద్వయ జ్ఞాన స్వరూపముచే - పృథక్త్వేన - స్వగతభేద జ్ఞానముచే, సజాతీయ విజాతీయ భేదము, అన్ని విధముల నసంభవ మగుట వలన, జీవేశ్వరగతమైన యంగాంగి భేద మాత్రమును లక్షించి, యీ రెండవ ప్రకారమైన యుపాసనము జరుగును. ఎటులన - నేను బిందువు; నీవు సింధువు; నేను తరంగము; నీవు సాగరము; అను నీ రీతిగానే యని తెల

యునది. లేదా, ప్రత్యేక వ్యష్టిపదార్థ మందును, నీశ్వర బోధ ముంచి దర్శించుటనే, పృథక్త్వోపాసన మందురు. శ్రీ శంకరాచార్యులు దక్షిణామూర్తిస్తుతియందు, "భూరంభాంస్యనలా నిలాంబర మహర్నాథో హిమాంశుః పుమాన్" ఇత్యాది శ్లోకముచే బోధించినది యిదే. భూమి, జలము, అగ్ని, వాయువు ఆకాశము ననెడి పంచభూతములును, సూర్యచంద్రులును, జీవుఁడును - అనఁగా మనః ప్రాణ జీవులనెడి మూటి సముదాయమును - వేర్వేఱు రూపమున నెవని అష్టమూర్తులుగా వెలయునో, వానిని ప్రత్యేకముగాఁ గొనియో, — భౌతిక వస్తుమాత్రమును ప్రత్యేకముగాఁగొని, వ్యష్టిభావముతోఁ జేయు బ్రహ్మదర్శనమే పృథక్త్వోపాసనము. మఱి, విశ్వతోముఖోపాసనా శబ్దముచే, విశ్వరూపముగా సమష్టిరూపముగా నుపాసించుట. దీనినే బుద్ధిరూపమున - మహత్తత్త్వ రూపమున వెలయు బ్రహ్మోపాసన మందురు. మున్ను చెప్పిన "మయా తత మిదం సర్వం" అను వాక్యమును బట్టియే యిది తెలియఁ నగును. "అహమాత్మా" నేను బ్రహ్మము ననెడి యుపాసనమే, అభేదోపాసనము, "మయా తత మిదం సర్వమ్" అనెడి సమష్టి వ్యాపకత్వమును బట్టుకొని చేయఁబడు నుపాసన విశ్వతోముఖోపాసన. వీనిలో నెపుడేది యిచ్ఛగింపఁబడునో యపుడది చేయుటే పృథక్త్వోపాసన.

అహం క్రతు రహం యజ్ఞః స్వధాహ మహ మౌషధం।
మంత్రోఽహ మహమేవాజ్య మహమగ్ని రహం
హుతమ్॥ ౧౬

నేనే క్రతువను; నేనే యజ్ఞమను; నేనే స్వధను; నేనే యౌషధమను; నేనే మంత్రమను; నేనే యాజ్యమను; నేనే యగ్నిని; మఱి నేనే హుతమను.

వెనుకటి మంత్రమందుఁ జెప్పఁబడిన యుపాసనమును జ్ఞానమును దేటతెల్లముగాఁ దెల్పుటకై వరుసగాఁ జెప్పుచున్నాఁడు. నేను కేవలము నేనుగా నున్నప్పుడు నాయందెట్టి భేదమును లేదు. "నేనే నన్నెఱుఁగుదు" ననెడి యిట్టి జ్ఞానధారయందుఁ జేరగానే కేవల 'జ్ఞ' స్వరూపవస్తువే ప్రకాశించును. ఇదే జీవునకుఁ బరమలభ్యము, పరమగతి. ఏదియైనను – ఆ నేనే క్రతువు = (ఇది శ్రౌతయజ్ఞ విశేషము). యజ్ఞము స్మార్తయజ్ఞ విశేషము. స్వధా = పితృలోకము నుద్దేశించి చేయఁబడు శ్రాద్ధాదికము. ఔషధము = యజ్ఞమందు యాజిచేఁ బానము చేయఁబడు సోమవల్లీరసము. లేదా రోగహార ద్రవ్యము, లేదా సస్యాదికము. మంత్రము, ఆజ్యము, అగ్ని, హుతము (హోమము చేయఁబడు వస్తువు) ఇవన్నియు హవన సాధనములు. ఈ యన్నిటి రూపముతో నేది వెలయునో, అనఁగాఁ గర్మరూపమం దెన్ని భేదము లుండనీ – యవి యన్నియు నేనే. ఇది యనుభవ వాక్యమే కాని, చదువుటకు నేర్చుటకుఁ గానిది. నన్ను (నేనును) బట్టుకొనువాఁడు – తెలియఁ గల్గువాఁడు, అనఁగా, పూర్తిగా ననుభవింపఁ గలవాఁడు మాత్రమే, యిన్నిటియందును నా యొక్కని యనువర్తనమును గుర్తింపఁగల వాఁడగును. "మయా తత మిదం సర్వమ్" అనెడి వాక్యమును బూర్తిగా వివరించి సులువుగాఁ దెలువు

శ్లోకమిది. ప్రత్యేకమును బట్టుకొని, యన్నియు నేనే యని చెప్పి చూపుచున్నాఁడు. నన్ను (నేనును) విడిచి యెక్కడను నేదియు లేదు. నీవు జ్ఞానయజ్ఞముతో నే యుపాసింపుము. భక్తి తో నామకీర్తన జపాదికమే చేయుము. సర్వప్రకారములతోను, నా (నేనుయొక్క) యుపాసనమే నీవు చేయుదువు. నన్ను మానిన నీకు వేఱొండుపాస్యమే లేదు. నేను బహురూపము లతో నీ బహుత్వ వాంఛను దుడిచి వేయుదును. నీ క్రతు యజ్ఞాది వైధకర్మ రూపముతో నే నేనుందునని కాదుసుమా. నీ యాలుబిడ్డలు, నీ యశఃప్రతిష్ఠలు, నీ మానావమానములు, నీ జననమరణములు; అంతేనా? నీ సర్వము నేనే. ఔరా! ఇంకెంత చెప్పిచూపను? నీ యీ నేనను నదియు నేనే చుమా. నన్ను (నేనును) జూడుము. నన్ను (నేనును) ఆదరింపుము. నా (నేను) యెడఁ గృతజ్ఞుఁడ వగుము. నన్ను (నేనును) ఈశ్వరుఁ డని స్వీకరింపుము. నీ కష్టములన్నియుఁ దొలఁగును. నీ జన్మ జన్మాంతరముల నుండియు నగు నవజ్ఞచే నైన పాపము తొలఁగి పోవును.

పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః।
వేద్యం పవిత్ర మోంకారం ఋక్సామ యజురేవ చ॥ ౧౭

ఈ జగత్తునకు నేను, తండ్రిని, తల్లిని, ధాతను, పితా మహుడను, వేద్యము నేనే; పవిత్రము నేనే; ఓంకారము నేనే; ఋక్సామయజస్సులు నేనే.

అర్జునా! చూడు, నేను నీకొక్కనికే సర్వముగా నుండుటకాదు. విశ్వమున కంతటికిని దండ్రిని నేను. బీజప్రదుఁ

డైన తండ్రిని. నేనే ప్రకృతి గర్భమున; చిత్ ప్రతిబింబ రూపమున, బీజప్రదానము చేయుదును. కనుక నే నేను పితను. మఱి నేనే ప్రకృతి రూపముతో - శక్తి రూపముతో - నీ జగత్తును గర్భమునందు ధరింతును; ప్రసవింతును; పోషింతును; గనుక నేనే తల్లిని. మఱియు నీ జగత్తును బూర్ణముగా ధరింతును. గనుక నేనే ధాతను. పిచ్చివాఁడా! గ్రహింపుము; నేను సత్తామయుఁడను కన్కనే సత్తారూపినైన నావల్లనే యీ యనిర్వాచనీయమైన జగము ప్రతిభాసించుచున్నది. నేనే పితామహుఁడనైన బ్రహ్మను. - సృష్టికర్తయైన ప్రజాపతిని. సమస్త ప్రజా రూపముతో నైతను నేనే యాత్మప్రకాశము చేయుచున్నాను. అనఁగా నన్ను నేనే వెలయించుకొనుచున్నాను. నేను కేవలము బోధస్వరూపవస్తువను. నేను బోధశక్తి మయుఁడను, మనోమయుఁడనునై, యనంతకల్పనము చేయ మొదలిడునపుడే యీ ప్రజావర్గమునకు సత్త సంభవించుచున్నది. నా బహుభావముల తోడి కల్పనలే (సంకల్పములే) బహు ప్రజారూపముతో — స్థూల పదార్థరూపముతో వెలయును. కనుక నేను మనోమయుఁడను - సంకల్పమయుఁడను - సృష్టిశక్తిమయ బ్రహ్మను. ప్రజాపతిని.

మఱి, సర్వము నేనేయైనపుడు, వేద్యమో (తెలియఁదగినదో), వేదితవ్యమో (తెలియవలసినదో) లబ్ధవ్యమో (పొందవలసినదో) జీవున కేదేనిఁగానిమ్ము; అదియంతయు నేనే నేను వేద్యుఁడను (దెలియఁదగినవాఁడను). ఏలయన, ఒక్క విజ్ఞానమందు సర్వవిజ్ఞానములు సంభవములగును. అనఁగా

నన్నొక్కని దెలిసికొన్నచో నన్నిటి తెల్వియు గల్గును. జాగతిక పదార్థ స్వరూపము యథార్థముగాఁ దెలిసిపోయినపుడు, నేను గానే తెలిపోవును. ఏలయన, నేనే యభిన్ననిమిత్తోపాదాన కారణముగా నున్నాను. ఆత్మజ్ఞానము విశుద్ధము. దానియందెట్టి ద్వైతజ్ఞానమును లేదు. అదే నిర్మలము. ద్వైతజ్ఞానమే మలినత, అపవిత్రత. మనుజుఁడు పాపములెన్నియోఁ జేయనీ, నన్నొక్కనిఁ దాకఁగల్గినచో, (అనఁగా నన్నొక్కని నెఱుగఁగల్గినచో) సర్వ పాప విముక్తుఁడగును. (నానాత్వబోధమే పాపము). కాఁగలఁడు గాని యుత్తరక్షణమందే మఱల సర్వపాపియగును. కానీ; పవిత్ర స్వరూపుఁడనైన నన్ను (నేనును) ఏ ముహూర్తమున స్పృశించునో, (అనఁగా నాయెడ బహుత్వబోధము తొలఁగునో) యా ముహూర్తమందే యతఁడు నిష్పాపుఁడగును.

ఓంకారము - ప్రణవము అనఁగా నామరూపములతో నేనేయున్నాను. ఓంకారము బ్రహ్మమునకు వేదప్రసిద్ధమైన సాధకానుభూత సర్వశ్రేష్ఠ శబ్దము - నామము. అదిసరే తక్కిన మంత్రములు, శబ్దములు బ్రహ్మవాచకములైనవి, మఱిలేవా ! యందువే, - నదికాదు, ఓంకారము సర్వశ్రేష్ఠమనిరి. ఎందులకు శ్రేష్ఠము ? - అవియన్నియు నితరమైనవాసికిం జెల్లుచున్నవి.

ఋగ్యజుస్సామముల రూపమునను నేనే వెలయుచున్నాను. వేదముచేతను, వేదమూలకములైన యితర శాస్త్రముల చేతను బ్రతిపాదింపఁబడు జ్ఞానరాశిని నేనే ధరించుచున్నాను. ముందుగా నేను. స్వయం ప్రతిష్ఠుఁడనై తరువాత వేదాది

శాస్త్ర ప్రతిపాద్య జ్ఞానమును ధరించువాఁడనైనపుడు, నేనే వేదమను. నేను సత్త్వామయుఁడనై హృదయమును వికసింపఁ జేసెదను. గనుక నే వేదసత్తగానున్నాను. వేదాద్యంతములందుఁ బ్రతిష్ఠితమగు నీ ఓంకారము పవిత్రము. నా సర్వశ్రేష్ఠ నామమైన, ఓంకారము పవిత్రము. తనయందు మాలిన్యములు లేనిది. మలినములైనవానియందలి మాలిన్యములను దొలంచునది కావునను బవిత్రము. ఆ నా నామము ప్రణవము, (ప్రకృతి సముద్రమును నావవలె దాటించునది) సక్రమముగా నుపాసింపఁ బడునపుడు జీవులనంటిన, ఆణవ కార్మిక మాయికముల నెడి మాలిన్యములను దొలఁచునుగాన, పవిత్రము. మఱియు, పవి - వజ్రాయుధము - పిడుగు. "వజ్రముద్యతం" మృత్యువే వజ్రముగా వేదమనుచున్నది. ఆ"పవి"వలన - మృత్యువువలన - "త్ర" - కాపాడునది. మృత్యువువలన రక్షించుట యనఁగా, జనన మరణములనియే గ్రహించునది. కావున సంసార భయము వలనఁ గాపాడునది, యనియర్థము.

గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్।
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజ మవ్యయమ్ ॥ ౧౮

నేనే గతిని; నేనే భర్తను; నేనే ప్రభువను; నేనే సాక్షిని; నేనే నివాసమను; నేనే ప్రలయమను; నేనే స్థానమను; నేనే యాధారమను; మఱి నేనే యవ్యయబీజమను.

గతిరూపమున నేనే విరాజిల్లుచున్నాను. ప్రతిజీవుఁడును, ప్రతి క్షణమందును నావైపునకే పరుగున వచ్చుచున్నాఁడు. ఉపలభ్యమానగతి రూపమున నేనే వెలయుచున్నాను. నేను

స్వరూపముచే నిర్వికారుఁడను, నిత్యస్థిరుఁడనైనను జీవుల గతి రూపమున భాసిల్లుచున్నాను. అంధజీవులు నా యీ గతి మూర్తిని గానలేకుండుటచేతనే, హతాశులై భగ్నోద్యములై విషణ్ణులై చెడుచున్నారు. తెలిసియో తెలియకో జీవుఁడు నా వైపునకే వచ్చుచున్నాఁడనుట తెలియలేకుండుటచేతనే, స్వజనముతోనో, విత్తముతోనో యెడఁబాటు కలిగినపుడు దుఃఖపడి చెడుచున్నాఁడు. జీవుఁడు నన్ను (నేనును) మఱచుచున్నాఁడు గాని, నేనుమాత్రము జీవులను మఱువను. జీవుఁడా! నీవు నా గతిమూర్తిని జూచి యుద్యమ శీలుఁడవు కాఁగోరెదవేని, చూడు; నీలోలోనే యొక యసంతృప్తి, యొక యపూర్ణత, సర్వదా తలయెత్తుచునే యున్నవి. అదే, అదే నా గతి మూర్తి; చూడు, చూడుము. నన్నుఁజూడుము, ఆదరింపుము; ప్రణమిల్లుము. నన్ను దుర్జ్ఞేయునిగా (తెలియరానివానిగా) నెంచి మోసపోకుము. నేనెంత సులువుగా దొరుకువాఁడనో చూచుకో. నీ కోరిన వస్తువొక్కటి లభించినంతనే, యుత్తర క్షణమందే, మఱల నీలో నసంతృప్తి తలయెత్తుచుండును. ఈ యసంతృప్తి నాయెడనే పరిసమాప్తినొందును. నాయందుఁ బూర్ణముగా నాత్మవిస్మృతి కలుగనంతదాఁక నీ యసంతృప్తి యణఁగదు. శుద్ధబోధ స్వరూపుఁడనైన నా (నేను) యందుఁ జేరిపోఁగల్గుటచేతనే, యీ యతృప్తి తొలఁగి పరితృప్తి లభించును. ఈ యవస్థను జేరఁజాలనంతదాఁక, నేనే గతిరూపమైన జనన మరణ పరంపరను దాటించుకొని పోవుచుండును. నీవొక్క క్షణమైనను స్థిరముగానుండు నుపాయములేదు. నీవు, నీమనస్సు

చంచలమని యెంతగా ధిక్కరించుచున్నావో, నీకుఁ దెలియకయే యెంతగా నకర్మణ్యుఁడ వగుచున్నావో, యూహించుకో. కాని, అయ్యో! నేనే గతిరూపమునఁ బ్రతిక్షణమును నిన్నుఁ జంచలునిఁగాఁ జేయుచున్నానని కానలేకున్నావు. అసంతృప్తియే గతి లక్షణము. గతి యున్నంతదాఁక జిత్తము చంచలముగానే యుండును. అక్కటా! వత్సా! నీవు చిత్తవిక్షేపమును గనక, నా గతిమూర్తినిగాంచి ముగ్ధుఁడవగుచున్నావు. నన్నుఁ బొందితి వనుచు విశ్వసింపుము. అపుడు నీ చాంచల్యము, నీ యసంతృప్తియుఁ దొలఁగిపోవుట నీవేకాంతువు. అపుడు నన్నే (నేనే) భర్త (భరణకర్త) నని తెలిసికొనఁగలవు.

"భృ" ధాతువునర్థము, ధారణము, పోషణము. నిన్ను భరించు (ధరించు) వాడఁను, నిన్నుఁ బోషించువాఁడను నేనే యని కనుగొనఁగలవు. సత్తారూపమునను, అస్తిత్వ రూపమునను, నేను హృదయవికాసముఁ జేసితిని. కనుక నే నీవు స్వకీయ సత్త ననుభవింపఁగల్గుచున్నావు. ఇవే నేను జేయు ధారణ పోషణములు. స్థూలముగా, అన్నాదులచేత నన్నమయ కోశమును బోషింతును; సూక్ష్మముగా, జ్ఞాన స్తన్యమునిచ్చి, ప్రతి క్షణమును నిన్ను నేనే పోషించుచున్నాను. నీవు జన్మము తర్వాత జన్మమునుబొంది, కొంచెకొంచెముగా జ్ఞానలాభము నొందుచు దానిఫలముగా నన్నుఁగాంచు లాభమున కధికారివగుచున్నావు. అదే నా పోషణమూర్తి. ఈ నా మూర్తిని గాంచుటచేత నే, నీవు నన్నుఁ బ్రభువుగా నంగీకరింపకుండఁజాలవు. మఱి నీకెట్టి కర్తృత్వమును లేదుగదా. నేనే నిగ్రహించువాఁడను. అనుగ్రహించు

వాఁడను, గురుఁడనయి త్రిప్పుకొనువాఁడను నని యెఱింగినపై, నింక నీ కర్తృత్వబుద్ధి సడలిపోకుండునా ? అపుడే నీ సర్వకర్మములకును, నీ సర్వ సుఖదుఃఖాదులకును సర్వసంసార ధర్మములకును నేనే నియంతనని, ప్రభువననికనుగొనఁ గలవు.

ఇట్టిదర్శనమందలవాటు పడుదువేని, స్వయంప్రభుత్వబోధము (నేనే ప్రభుఁడననుకొనుచున్న నీ బోధము) లోలోపలనే మాసిపోఁగా, నపుడు నీవు, నన్నుఁ బ్రభుఁడుగానే గాక, సాక్షిగాను నేనే యున్నానని తెలిసికొనఁగలవు. నీ సుఖదుఃఖములు, నీ పాపపుణ్యములు, నీ స్వర్గనరకములు, నీ జన్మమృత్యువులు, నీ భోగమోక్షములు, మున్నగు నన్నిటికిని సాక్షిగా నేనేయున్నాను. నేనే వెలయించుచున్నాను. నా (నేనుయొక్క) ప్రకాశమువల్లనే, నీయెడ నివియన్నియుఁ బ్రతిభాసించుచున్నవి. సాక్షిగా, నెట్టి సంసారధర్మమునులేని ద్రష్టను. ఉదాసీనుఁడనై వెలయువాఁడనే. వీనియెడ నాకెట్టి కర్తృత్వ భోక్తృత్వములును లేవు. అను నింతవఱకుఁ గానఁగల్గినపైనపుడు; నేనే నివాసమనని గుర్తింపఁగలవు. నాయందే నీవు పూర్ణముగా నోతప్రోత భావముతో (పడుగుంబేకవలె) నున్నావు. నన్నుఁదప్పించి నీకిపుడేమియు వేఱుగాలేదు. ఈ నివాసస్వరూపము నాయందుండుట చేతనే, (ఉన్నపుడే) నీ సర్వదుశ్చింతలుఁ జేతితోఁదీసి పాఱవేసి నట్లగును. ఏలయన - అపుడు నీలోన వెలిని నన్నొక్కనినే ప్రత్యక్షము చేసికొన సమర్థుఁడవగుదువు. అపుడే నీకు యథార్థ శరణాగతి వచ్చును. నేనొక్కఁడనే నీ శరణము, ఆశ్రయము, రక్షకము, నా సత్తవల్లనే నీవు సత్తామయుఁడనైతివని తెలియఁ

గల్గినపుడే, నీ యాశ్రయముగాను, శరణముగాను నన్నుఁ గానఁగలవు. అపుడే నీవు "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అను మంత్రము నర్థమును బూర్తిగాఁ దెలియఁ గలుగుదువు; కాదా ?



దీనికిఁ బూర్వము (అనఁగా గతి భర్తాది స్వరూపముల యుపలబ్ధి యగుటకు ముందు) శరణాగతియే జరుగదు. అపుడేమయినను, ఎంతయినను, అది యశక్తులయు నజ్ఞానులయు శరణాగతియే. దానికి విలువ లేదనియే యనవచ్చును. లోకులు విపత్తులలోఁ బడినపుడు తమ యాత్మీయులకు శరణాగతు లగుదురు. ఆ గొడవలు గడవఁగానే, మఱి యా భావమే యుండదు. ఇది యట్టి శరణాగతి కాదు. లోన వెలిని నా సత్త యొక్కటే యనుభవించిన వెనుక, స్వాభావికముగా వచ్చు శరణాగతియే యథార్థ శరణాగతి. అట్టి శరణాగతి వచ్చినపైనే, నేను నీయెడ శరణరూపమున వెలయుచున్నటు తెలుంగుదువు.



ఆ తరువాత నేను నీ సుహృదుఁడను. ఎవఁడే నొక వ్యక్తి యెట్టి మాఱుమేలును గోరక యుపకారము చేయునో, వానిని సుహృదుఁ డందురు. శరణాగతుఁడవైన వెనుక నీ యథార్థసుహృత్తు నేనే యని నీకుఁ దెలియును. రవ్వంతేని ప్రత్యుపకారమును గృతజ్ఞతను నాశింపక జన్మజన్మాంతరముల నుండియు నీ వెంటనే పరుగెత్తి వచ్చుచున్నాను. నీకుఁ బ్రాణము (చైతన్యము) నిచ్చి ప్రాణమయుని జేసితిని. నీయెడఁ బ్రేమఁ జూపియే ప్రేమించుట నేర్పితిని. నీవు జాగతికమైన ధన జనములను బ్రేమింతువే; ఆ ప్రేమ వస్తువు నే నిచ్చినదే. నా సత్తే

ముగా, నీ లోపలనే యుండి నీకెన్నియో సలహాల నిచ్చుచున్నాను. అది నారకీయ భోగవాసన చరితార్థతకే యనుము, లేక స్వర్గీయ భోగవాసన చరితార్థము చేయుటకే యనుము. ఎప్పుడేది నీకావశ్యకమని తోఁచునో, దానినే నీకిచ్చుచున్నాను. ఎక్కడనో వెలినుండి కాదు. నీలోనే యాగూపముతో వెలసి, నీ మనోరథములు తీఱి తృప్తి గలుగు సాధనకై ప్రయాసం పడుచున్నాను. పడితిని. ఇఁక నిప్పుడు సర్వవాసనలు నివర్తించు క్షేత్రమందుఁ బరమానందమయ హిరణ్యధామ మందుఁ జేర్చి యుంచుటకు నేనే నిన్ను గుండె కత్తించుకొని పోవుచున్నాను. చూచుకో; నేనే నీ యేకాన్త సుహృదుఁడను. అంతరంగ బంధుఁడను. గుప్త సహచరుఁడను. విశ్వాసి మిత్రుఁడను. నన్నిపుడు చూడుము. జగత్తునందు నీ సుహృదుఁడను నేనే. మఱెవ్వఁడును గాఁడు. జీవుఁడా! ఈవిధముగా నన్నే (నేను నే) సుహృదుఁడని తెలుపఁ గలిగినపుడే, యనుభవింపఁ గలిగినపుడే, నేను నీకే కాదు, ఈ జగత్ ప్రపంచముయొక్క, అనంత బ్రహ్మాండముల యొక్క ప్రభవము, ప్రలయము, స్థానమునై యున్నానని కనుగొనఁ గలవు. నావల్లనే యీ సర్వ బ్రహ్మాండముల ప్రభవము (ఉత్పత్తియు) నావల్లనే వీని ప్రలయమును, నావల్లనే వీని స్థానము (స్థితియు) నగుచున్నవి. కనుక నేనే నిధానము, అనఁగా జగదాధారమునై యున్నాను. నేనే యీ జగత్తున కవ్యయబీజమును - అవి నశ్వర కారణమును. నిమిత్తోపాదానములు రెండును నేనే. నేనే జగత్కర్తను. నేనే జగదాకారముతో నాకారితుఁడను. తొలుత గతి భర్తృప్రభృతి రూపములతో నేనే కాన్పించు

కొంటిని. నా యీశ్వర రూపముతో నన్ను వెలయించుకొంటిని. (నన్నే యీశ్వరుఁడుగా నీ వొందితివి.) క్రమముగా సుహృద్రూపమున నన్నుఁ గనునపుడు, నేనే జగదీశ్వరుఁడనని తలంచితివి. ఇదిగో, నేను వ్యష్టిరూపమునఁ గేవలము నీ గురుఁడను; ఈశ్వరుఁడను; మఱి సమష్టిరూపమున నేనే జగద్గురుఁడను. అర్జునా! యిపుడు నన్ను గుర్తింపఁ గలిగితివా?

తపామ్యహ మహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ।
అమృతంచైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున॥ ౧౯

నేనే తాపము నిచ్చువాఁడను – తపనుఁడను; నేనే జల వర్షణమును అడ్డగించు చున్నాను; నేనే జలవర్షణమును, జేయుచున్నాను. అమృతమును, అనఁగా జీవనమును మృత్యువును నేనే. మఱియు సత్ – అసత్, అనెడి రెండును నేనే.

అర్జునుఁడా! నా యీ జగదీశ్వర రూపముయొక్క యభివ్యక్తిత్వమును జూడుము. సూర్య రూపముతో నేనే తాపమును గలిగించి పృథివి యందలి నీటి నింకింతును. జీవుల అగ్నిలో వ్రేల్చు నాహుతులన్నియుఁ బూర్తిగాఁ నాదిత్యునే చేరును. ఆ సూర్యుని వల్ల నే వాన; వాన వలన నన్నము; అన్నము వలనఁ బ్రజాసృష్టి రక్షణములు నగుచున్నవి.

ప్రభువా! యీ జగత్తుయొక్క ప్రభవ ప్రలయములు నేనే యంటివి, మఱి లౌకిక నియమముతో, అనఁగాఁ బ్రకృతి చేతనే సృష్టిప్రలయాదు లగుచున్నవి. సూర్యతాపము వలన భూగత జలము శోషిల్లుచున్నది. అదే మఱల వానఁగా గురియుచున్నది. దానివలన నన్నము, దానివలన జీవుల సృష్టిరక్షలు

నగుచున్నవి. శుక్రశోణిత సంబంధము సైతము అన్నవికారమే. కనుక, అన్నము వల్లనే ప్రజాసృష్టి యగుచున్నది. దేవా! అపుడు మఱి నీవెట్లు ప్రభవమ వైతివి? అనెడి యాశంకను దొలఁగించుటకే భగవంతుఁ డనుచున్నాఁడు.

"తపామ్యహమ్" తాపరూపమున నేనె వెలయుచున్నాను. నీవు వెలిని గాంచు సూర్యునిదే తాపమనియు, ఆ తాపముచేతనే నీ రింకుచున్నదనియు నెంచుచున్నావు. వాస్తవముగా నదికాదు. తాప మనునది నా ప్రకాశమే. తాపరూపమున నేనే వెలయుచున్నాను. వినుము, తాప మొక విధమైన యనుభూతి. అనుభూతి జడము కాదు. అది చేతనము. అనుభూతి వెలయనంతదాఁక, తాపమునకు సత్త యెక్కడిది! అనుభూతి. అనుభూతి యనునది నేను; చైతన్య స్వరూపాత్మను. అనుభవము నేను జేయుచున్నది. కనుకనే సూర్యుఁడు తాపమయుఁడు సూర్యుని సత్తయు, తాపము సత్తయు, నా సత్తపై నానుకొన్నవే. అబ్బాయీ! నీవు తాపమువైపు చూచుచున్నావు గాని, తాప మెక్కడిదో, యది చూడవు. కనుకనే యెంతకాలము బ్రతికి వెదకినను నన్నొందఁజాల కున్నావు. తాపమును దెలియఁ జూపునది తాపమే. అది నీగురుఁడు, నీయిష్టము, భగవంతుఁడునైన నేనే చుమా. నేనే "తపామి; వర్షం నిగృహ్ణామి" అనఁగానే, కొందఱు, 'వర్ష ప్రతిరోధము చేయుదును – అనావృష్టిని జేయుదును,' అని యర్థము చెప్పుదురు. దానివలన మన కేమియు హానిలేదు గాని, "జలము నాకర్షించుచున్నాను; ఆపైని మఱల విడుచుచున్నాను,– వర్షణమును జేయుచున్నాను"

అను నర్థమునే తెలియవలయును. వర్షశబ్దార్థము జలధార. అనఁగా భూగతమైన జలాంశము నంతటిని, యథాసంభవముగా నాకర్షించుటయు విడుచుటయు ననెడి పని, స్థూలదృష్టికిఁ గేవల ప్రకృతి నియమముగానే తోఁచు నదియు నేనే సుమా. శోషణము, వర్షణము (ఇంకించుట, కురియించుట) అను రెండిటి రూపముగా నా సత్తయే ప్రకాశించు చున్నది. నేను శోషణమును దలంచిన నదే యగును. వర్షణమును దలంచిన నదియే యగును. నన్నుఁ దప్పించి వీనికి వేఱు సత్తగాని, కార్యకారిత గాని లేదు. ఉండఁజాలదు. నీవు శోషణవర్షణములనే జగత్సృష్టి హేతువులు గాఁ దలంపకుమా, నా సత్తయే జగత్సృష్టికి యథార్థ హేతువు.

అంతేకాదు. జీవనము మరణమునని రెండుగా నీకు సాధారణముగాఁ దోఁచుచున్నవియు నేనేసుమా. నీవు బ్రతికి యున్నంతదాఁక నీ సత్తనుగాంతువు. కాని యిది జీవన — అస్తిత్వజ్ఞానము. దీనినిబట్టి 'నేనున్నాను' అని యనుభవింతువు. ఆ యస్తిత్వజ్ఞానము నీ నిజత్వముకాదు. అదియు నేనే. దేనికై నీవు దేవులాఁడి వెదకికొనుచున్నావో, యెవని నొందుటకు నీవు లాలాయితుఁడవగుచున్నానో, గురువనుచు నెవని చరణములం దాత్మార్పణము చేసితివో, ఆ నీయేకాన్త సాధ్య దేవతను నేనే. నీయస్తిత్వ జ్ఞానరూపముతో, అమృత స్వరూపముతో సతతము వెలయుచున్నాను. "సరే; నాథా! అమృతమునీవే; బాగు; వలన, అమృతమన్నను, అస్తిత్వ బోధమన్నను, ఒకటేమాట యని తెలిసినది, గాని మృత్యురూపముతోను, నీవే వెలయుదు

వన్నది, నాకెట్లునచ్చును?'' అందువేమో, వినుము. మృత్యువు- అస్తిత్వజ్ఞానము లేకుండుటే; సరే; ఈయభావ మెటనుండి వచ్చెను? అనఁగా, నీ యభావమును నీవుగా నెఱుంగుటెట్లు? అంటేని - మృత్యువు - అస్తిత్వజ్ఞానాభావము సైతము బోధ స్వరూప వస్తువేగాక, మఱేమియుఁగాదు. అభావబోధము లేనంతదాఁక అభావమునకు సత్తయెక్కడిది! కనుక, నీమృత్యు బోధ రూపముతోను, అస్తిత్వ బోధాభావరూపముతోను, నేనే యనాదికాలమునుండియు నీ గుండెలో నున్నాను. అయ్యో! భ్రాంతజీవుఁడా! నీవు మరణించియు నా హృదయమునకు దూరముండఁజాలవు. చంటిబిడ్డ అకారణముగాఁ దుళ్ళిపడునట్లు మృత్యుభయముచే భీతుఁడవై సంకుచిత ప్రాణముతో నిటుఁ దిరుగుచున్నావా? రవ్వంత స్వతంత్రముగాఁబోవ వెరవులేదు. అది నీచేతిలోనిదికాదు. మృత్యువెక్కడరాదు? ఎప్పుడురాదు? కాని భయపడకు. మృత్యురూపముతో సైతము నేనే, నీ యనాదికాల బంధువుఁడను. నీ చిరజీవన సఖుఁడనునై నిన్ను నాగుండె కత్తించుకొని యున్నాను. మరణమునందు సైతము నీవు నన్ను విడువఁజాలవు, అర్జునా! ఇటులే చూడుము. సత్తు నేనే. అసత్తునేనే.! సత్, అనఁగా అస్తిత్వమయ రూపముతో నీ ముంగలఁ దోచుచున్నాను. అసత్ అనఁగా, అస్తిత్వాభావ రూపముతోనునేనే ప్రతీయమానుఁడ నగుచున్నాను. ఇదిగో, యీ ప్రతీయ మానమగుచుండుటే యస్తిత్వము. అస్తిత్వము యొక్క అభావముగాను నేనే నీయెదుటనున్నాను. మెత్తపుమాట, తెల్లమగుమాట - స్థూలరూపమునను నేనే; సూక్ష్మరూపము

నను నేనే; 'కలదు' రూపముతో నెటులున్నానో, 'లేదు' రూపముతోను నటులేయున్నాను. 'నేనులేను' అనునట్టి యను భవ మెన్నఁడును యోగ్యముకాదు. నన్నుఁ బ్రతిషేధింప శక్యముకాదు. నన్ను (నేనును) జూడుము.

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే ।
తే పుణ్యమాసాద్య సురేంద్రలోక
మశ్నన్తి దివ్యాన్ దివిదేవభోగాన్ ॥ ౨౦

త్రిగుణాత్మక సకామ కర్మకాండమునెడఁ బక్షపాతు లైనవారు యజ్ఞాది కర్మములనుజేసి, నన్నుపాసించి, పాపరహితులై స్వర్గతిని గోరుకొందురు. దాని ఫలముగాఁ బుణ్యము గడించి దేవలోకమునుజేరి యచట నశేష స్వర్గీయ భోగ్య భోగముల భోగింతురు.

"భగవంతుఁడా! తాపరూపముతోను, వర్షరూపము తోను అన్నరూపముతోను సర్వము నీవే. సరే; మఱి యీ వృష్టికి నన్నాదులకు మూలమైన యాగయజ్ఞాది కాండముగ నీవెట్లు వెలయుదువు? అగ్నియందు లెస్సగా వ్రేల్వఁబడినది యాదిత్యునిఁజేరును; ఆదిత్యుని వలనఁ గ్రమముగా వానయు అన్నాదులును. ప్రజాసృష్టియునగును. వీనికన్నిటికి మూలమైన యగ్న్యాహుతి యాగయజ్ఞాదులందు, అధికాంశము త్రిగుణాత్మక సకామముగానే కానఁబడును, గదా. అందునీవెట్లు (ఏ భావముతో) నున్నావో? ఆ సకామకర్మల కెట్టిగతులు గల్గును?

వానితోడి నీ సంబంధము, ఏవిధముగా ననుభవ యోగ్య మగును ? అంతయు నీవైనపుడు పాప పుణ్యములు మఱేవి ?"

భగవంతుఁ డనుచున్నాఁడు - త్రైవిద్యాః - త్రిగుణాత్మక కర్మకాండముతో నన్నుపాసించువారు, సోమపాః = యజ్ఞ విశేష భోగులు; కనుకనే, పూతపాపాః = విగత కల్మషులు.

ఇచట మఱియొక యర్థము - విద్య యనఁగా జ్ఞానము. ఏ జ్ఞానము మూడు భావములతో స్పందితమగునో, అనఁగా సృష్టిస్థితి లయములుగాఁ బ్రకాశించునో, యదే త్రైవిద్య. మఱి "యయా తదక్షర మధిగమ్యతే సావిద్యా" అక్షరబ్రహ్మము దేనిచేఁ దెలియ వచ్చునో యదే విద్య యని మున్నంటిమి. విద్యయే-విద్యా, అవిద్యా భేదముతో రెండువిధముల లక్షింపఁ బడుచున్నది. విద్యా, జ్ఞానము - అను పదములు ఏకార్థ వాచకములు. విద్య, నిత్యము నఖండము నద్వితీయము నగుచో నది సాక్షాద్ బ్రహ్మవిద్య. మఱి యదే యల్పము ఖండము సద్వితీయమునై, ఉత్పత్తి వినాశధర్మి యగుచో, దానిపేరే యవిద్య-అజ్ఞానము. ఈ యవిద్యకు రెండు గతులు. ఒకటి జడాభిముఖి. రెండవది ఆత్మాభిముఖి అవిద్య- కేవలము జడవస్తువుల=విషయ మాత్రముల గ్రహణధారణ లయములనే చేయఁ జొచ్చునపుడు, అదే ముఖ్యముగా, అవిద్యా పదవాచ్యము. అదే నిత్యవస్తువున కభిముఖియై వెలయునపుడు త్రైవిద్య యనఁబడును. అనఁగా మనుష్యుఁడు,అవిద్యామోహముచేఁ గప్పఁబడియుండు నన్నాళ్ళమాట విడువుము. అతనికిఁ బాపపుణ్యవిషయక జ్ఞానము బాగుగా మొలకెత్తి, పుణ్యకర్మముఁ జేసి పాపకర్మ విషయక సంస్కారములను

శింపఁజేయఁ బ్రయత్నించును, ఆ ప్రయత్న చేష్టారూపమున వెలయు విద్యయే త్రైవిద్య. ఆ విధముగా, విద్యకు వేఱుగా నన్యమేదియు లేదు. ఆ విద్యయే, యీపవన్మూర్తితో వెలయు నపుడు – అప్రకాశితమగు నవస్థయం దుండునపుడు, దానినే యవిద్య యందురు. అదిగో, ఆ యప్రకాశితవద్భావమును దొలఁగించుటకై చేయఁబడు ప్రయత్నము (చేష్ట) నకే, మఱి యొక పేరు – పుణ్యలాభ ప్రయత్నము – పాపక్షయము చేసి పుణ్యలాభము నొందు ప్రయాసము. ఇదే యిచట 'త్రైవిద్య' యను పేర వర్ణింపఁ బడినది. పుణ్యమునకు, ఉత్పత్తి స్థితిలయ ములనెడి యవస్థలు మూడు, కనుక నిది త్రైవిద్య పేరఁ బరఁ గును.

బ్రహ్మవిద్యా రూపిణి, అమ్మ, యెవరియందిట్టి త్రివిధ స్పందన ధర్మమును గొని ప్రకాశించునో, వారిని త్రైవిద్యులే యనుము; సకామ కర్ములే యనుము; దురితక్షయ సుకృతి సంపాదన ప్రయాసులే యనుము; చెల్లును. మనుష్యులు మెల్ల మెల్లఁగా నవిద్యామోహమును దెగఁగొట్టఁ గోరునపుడు, అన్నిటికంటె ముందుగాఁ త్రైవిద్యులే యగుదురు. మనుష్యుని మన్గడ యందిట్టి యవస్థ, ఒక్కసారియే వచ్చును. కొందఱికిఁ అది యీ జీవనమందే వచ్చును. కొందఱికిఁ దరువాతి జన్మము నందు వచ్చును. ఎప్పుడో రాకమానదు.

ఇటులు త్రైవిద్యాపరాయణులగుట వల్లనే మనుష్యులు 'సోమపాః' అగుదురు. సోమరసపానము చేయ నలవాటు పడు దురు. అనఁగా "యజ్ఞశిష్టాశినః" అగుదురు – యజ్ఞమందు మిగి

లిన దానిని దినువార లగుదురు. దేవతల నుద్దేశించి ద్రవ్యాదుల నర్పించి వారి ప్రసాద రూపమున విషయగ్రహణమును భోగమును జేయుదురు. అటుల చేయనివాఁడు దొంగ. త్రైవిద్యుఁడగుట వల్లనే మనుష్యుఁడు సోమపుఁడగును. ఎంత చక్కని మాట!

మనుష్యుఁడు మొదటఁ గట్టుబాటు లేకయే తిరుగును. శాస్త్రమును మన్నింపఁడు; విధినిషేధములను బాటింపఁడు. యాగయజ్ఞపూజాది వైధకర్మములను మన్నింపఁడు. మఱేవో యవస్థ లందుఁబడి, తెలివి గల్గుచున్న కొలఁది మును చెప్పిన బాల్యభావమున లీనుఁడై యుండ నొల్లక, అపుడు పాపపుణ్యములనెడి రెండవస్థలను జక్కఁగాఁ బ్రత్యక్షానుభవము చేయును; దాని ఫలముగాఁ బుణ్యార్జనమునకును, బాపక్షయమునకును బ్రయత్నించును. పాపపుణ్యములను మొదటి కేతుఁజిచి వేయువారును, ఆడాడ నున్నారు, గాని, అకటా! పాపము! అది యెన్నఁడును జరుగనిది వారెఱుఁగరు. రెండిటి ఫలమును సమానముగా ననుభవింప వలయును. ఏమైనను మనుష్యుఁడు త్రైవిద్యను సరిగా సేవించునపుడు తప్పక సోమపాయి యగును. త్రైవిద్యాసేవి కాఁగానే, మనుగడలోఁ బ్రత్యేక కార్యమందును దేవతానుగ్రహ నిగ్రహములను జక్కఁగాఁ గానఁ గలఁడు. అహంకారము తఱిగి పోవును. కనుక సర్వకార్యములందును దేవతానుగ్రహ ప్రసాదములను బొందుటకుఁ బ్రయత్నించును.

ఇఁక రెండవవైపునుండి చూడుము. సోముఁడనఁగా, చంద్రుఁడు. అతనిని పానము చేయువారు, "సోమపాః"

చంద్రుడు మనస్సున కధిపతిదేవత, కనుక నిట సోమశబ్దముచే మనస్సని తెలియవలయును. మనస్సును పానముచేయువా రనఁగా, మనస్సుయొక్క స్వేచ్ఛాచారమును (ఉచ్ఛృంఖలగతి) కేవల విషయ భోగముల వంకకైన గతిని పానముచేయువారు - అడఁగించువారు. లేదా "పూ" ధాతువు పవిత్రార్థకము "సోమం పావయన్తీతి సోమపాః" సోముని - మనస్సును, విషయములవైపునఁబోనీక పవిత్రము చేయువారు సోమపులు, త్రైవిద్యా పరాయణులు తప్పక నానాఁటికి మనస్సును బవిత్రము చేసికొనుచుందురు. కనుక సోమపులగుదురు. (మనస్సనెడి యర్థమందు సోమశబ్దము శ్రుతులందుచు గాననగును). సరే; సోమపులు కాఁగానే పూతపాపులు - విగత కల్మషులగుదురు. పాపసంస్కారములు తొలఁగును.

మఱొకమాట - మనస్సును బవిత్రము చేయుటకు యోగశాస్త్రమందుఁ జెప్పఁబడిన, యాసనములు, ఖేచర్యాది ముద్రలు, హఠప్రాణాయామాదుల విషయమిట నుల్లేఖింపబడలేదు. త్రైవిద్యాసేవి యగుటచే - శాస్త్రవిహిత కర్మకాండమును సకామముగా ననుష్ఠించుటచే సైతము మనస్సు విశుద్ధమగును. కర్మకాండమంతటిలోను యోగ పద్ధతులు సుసజ్జితములైయున్నవి. సాధకులు తాము పూజాశ్రాద్ధాదులు మాత్రమే చేయుచున్నట్లు తలంతురుగాని, వీనిలో యమనియమాసన ప్రాణాయామాదులును దెలియకయే యైపోవుచున్నవి. తెలిసి చేసినపుడు కర్మకాండము మఱింత చిత్తశుద్ధికి సులభమైన శ్రేష్ఠోపాయము. సరే; మన ప్రసంగమునకు వత్తము

త్రైవిద్యులు, సోమపులు పూతపాపులు నగునపుడు "యజ్ఞై ర్మామిష్ట్వా" యజ్ఞములచే (కర్మకాండము - పూజ, ఉపాసన, శ్రాద్ధము, దానము స్తవము, తపస్య, యన్నియు యజ్ఞపదము నకు లక్ష్యములు) కర్మకాండముచే నన్నుపాసించి స్వర్గతిని గోరికొందురు. అన్ని విధముల సుగముగా నుండుటకే కోరుదురు. నన్నుఁ బూజింతురుగాని, నన్నుఁగోరరు. నన్నుఁదనువు విధాన ములతోఁ దామే సుఖముగానుండఁ గోరుదురు. అనఁగా నా కంటె తమ సత్తాభోగములు వేఱనెడి బోధమును విలీనము చేసికొన (అణఁగించుకొన) గోరరు. వారు పృథగ్భావముతో నుండుటే సుఖమయమనుకొందురు. ఇదే మనుష్యుఁడు కర్మము లాచరించి ప్రార్థించునది. ఇపుడును నెపుడును మనుష్యుఁడు తనకు దుఃఖానుభవము కాకుండుటకే ప్రార్థించుచుండును.

నేను కల్పవృక్షమను. నావలనఁ దేనిఁగోరికొందురో, దానినే నిర్విచారముగా నిత్తును. ఇదే నా స్వభావము, గాన వారి ప్రార్థనమెన్నఁడును వ్యర్థముకాదు. ఇదిగో, ఎందులకు వ్యర్థముకాదో వినుము - పూతపాపులై నా సత్తయందు విశ్వాసవంతులైరి. నిశ్చయముగా వారి కోరిక సఫలము చేయుదును.

సాధకా! మఱువకుమా; ఇచట "ప్రార్థయంతే" అను దానితో "పూతపాపాః, మామిష్ట్వా" అని రెండు మాట లున్నవి. చిత్తశుద్ధి కాక, ప్రార్థనము సఫలముకాదు. నా సత్త యందు దృఢవిశ్వాసము లేకున్ననుంగాదు. నన్నుఁ బ్రార్థించు ఫలముగా "తేపుణ్యం సురేంద్రలోక మాసాద్య" వారికిఁ

బుణ్యాలాభమును, సురేంద్రలోక ప్రాప్తియు నగును. లేదా, పుణ్యమయ దేవేంద్రలోక లాభమగును. స్వర్గతి ప్రార్థనా ఫలముగా స్వర్గలాభమగును. స్వర్గమనఁగా నతిశయ సుఖమయ స్థానము, దానివైపు పోవుటే స్వర్గతి – స్వర్గగమనము. సాధారణముగా మనుష్యుని దుర్గతి యనఁగా విషయాభిముఖగతి; – దుఃఖాభి ముఖగతి; దానికి విపరీతము సుఖాభిముఖగతి – స్వర్గమువైపు నడుచుట, తమ నిమ్నాభిముఖగతి, యూర్ధ్వాభిముఖగతి యగుటకే ప్రార్థింతురు. తత్ఫలముగా సురేంద్రలోక ప్రాప్తి యగును. మఱి రెండవవైపు చూడు – సాధకుఁడు సర్వదా దేవకార్యాదులను విడక తగిలియుండుటచే, వానికి దైవీప్రకృతి లభించును. ఆసురీరాక్షసీ ప్రకృతి తొలఁగును. సురేంద్రలోకప్రాప్తి యగుటయే దైవీప్రకృతి ప్రాప్తియన్నను, హానిలేదు. మఱొకమాట మఱువకు – ఇదివిని సురేంద్రలోకము (దేవలోకము) అనుపేరితో నొకటియున్నదా ? యని యొకరనవచ్చును. అపుడనవలసినది – అది మృత్యువు తరువాతి ఫలమనియే. ఇచట మనుష్యుఁడీ మనుగడయందు దైవీప్రకృతి లాభమొంది స్వర్గసుఖమును భోగింపఁగలఁడనుటయే చెప్పఁబడినది.

"అశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్" ఇప్పుడును, ఎప్పుడును ఈ లోకమందును, బరలోకమందును నుభయత్ర సమముగా స్వర్గీయ భోగముల ననుభవించును. స్వర్గమందు స్వర్గభోగముల ననుభవించును. త్రైవిద్యనొందని వారును, పూతపాపులు కానివారును, ఇహలోకమందును సుఖభోగముల

నొందఁజాలరు; అశాన్తి దుఃఖములు వారినంటియేయుండును. కనుకనే, యిహాముత్ర సుఖభోగముల నొందుటకై పుణ్యార్జనము చేయుటగును. మున్నుగాఁ బూతపాపులు కావలయును. పూతపాపులగు నుపాయము సోమపులగుటయే. సోమపులగుటకై త్రైవిద్యా పరాయణులు కావలయును. శాస్త్రీయవిధి నిషేధములను బాటింపవలయును.

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి।
ఏవం త్రయీధర్మమను ప్రపన్నా
గతాగతం కామకామా లభన్తే॥ ౨౧

వారా విశాల స్వర్గభోగముల భోగించి, పుణ్యక్షయము కాఁగానే మర్త్యలోకమును జొత్తురు. ఇటులు త్రయీ ధర్మ శరణమునొంది కామకాములైనవారు మాటి మాటికి గతాగతి నొందుదురు.

మునుజెప్పిన విశుద్ధప్రార్థనా ఫలముగాఁ దైవిద్యా పరాయణులు విపుల స్వర్గసుఖముల ననుభవింతురు, గాని భోగకాలమందు, ఆ స్వర్గసుఖదాత యెవఁడో, వానియెడ లక్ష్యము లేక పోవుచున్నారు. ఈ స్వర్గసుఖ రూపమున నేనే యున్నానని మాట మఱచిపోదురు. ఏలనఁగా, వారు యజ్ఞములతో నన్నుపాసించునపుడే నా స్వరూపము నెఱుంగఁగోరలేదు. ఎఱుంగు యోగ్యతయు వారికిలేదు. కనుక నావలన వారు కేవల స్వర్గసుఖములనే కోరికొనిరి. వారికదే లభించినది.

అప్పుడు భోగము నెడ ముగ్ధులెరి. స్వర్గమందు దుఃఖమనుచు నేమియు లేదు. కేవల సుఖమే, కోరినంత నే నెఱవేఱును. అభావము, అభియోగము నెన్నఁడు లేవు. బాగే; భోగ కాలము పరిమితి బద్ధమైన కారణమునఁ, బుణ్యాక్షయమైపోవును. కను క నే, మరణధర్మ శీలమైన యీ మర్త్య (మనుజ) లోకమందు మఱలఁ బ్రవేశింపవలసి వచ్చును. మఱల సాధారణమనుష్యుల వలెనే దుఃఖసంతాపము ననుభవించుటగును. పిదప మఱల నవిద్యా పరాయణులై పోవుదురు; మఱలఁ బుణ్యమార్జింతురు. మఱల స్వర్గమునకుఁ బోవుదురు. ఈ విధముగా గతాగతావస్థ నొందుదురు.

పుణ్యార్జనము, స్వర్గభోగము, పుణ్యక్షయము, పునర్జ న్మము, మఱలఁ బుణ్యార్జనము. ఈ క్రమమున గతాగతి యగు చున్నది. ఇదే సాధారణ నియమము. కామకాముఁడై యుండు నంతదాఁక అనఁగా - జీవుని నేనును భగవంతునికంటె వేఱు సత్తగల యొక ప్రత్యేకవస్తువనుచుఁ గూర్చున్నంతదాఁక ద్వైతజ్ఞానముండుటవలన, కామన యుండనే యుండును. కామన యుండునపుడు గతాగతి యనివార్యము. ఇదిగో దీనిపేరే సంసారము. ఎడతెగని జనన మరణములు, పాపము, పుణ్యము- నరకము, స్వర్గము అనువానిని వరుసగా భోగించుట పేరే సంసారము. ఈ జగత్తునందును, సర్వవిధముల పార్థివ సుఖము లతో మరియు వారితో, స్వర్గవాసులను దూచినచో, నిది సులభముగానే యనుభవమునకు వచ్చును. ఎంతగొప్ప సుఖమే కానీ, దానికంతము తప్పదు. పాపధర్మ సంస్కారములు

మనుష్యునెల్లప్పుడు దుఃఖినిగానే చేయును. పాపి, యెట్టియవస్థయందైనను, దనను సుఖవంతుఁడ ననుకొనఁజాలఁడు. త్రైవిద్యాసేవియై ధర్మపుణ్యార్జనము చేసినపుడు సుఖలాభము నొందుటగును. దేని లాభమునకైన వెలపెట్టక తప్పదు. స్వర్గాభమునకైన వెల పుణ్యము. నరకమునకైనవెల పాపము. వెలలేకయే విక్రయింపఁబడువాడు శ్రీహరియే. దేనివల్లను నతనిందెచ్చుట కాదు. తేగల్గితిమా – మఱిపోఁడు. ఆయన తనంతనే వచ్చును. వెలలేకయే కొనఁబడు నమూల్యనిధి యతఁడు. లోకమందు నీవు దేనినేని దెత్తువా – ఇచ్చి తెచ్చుకొనవలయును. దాని మాటయుండనీ, సాధనము వైపునను జూచుకో. వెలయెంతో అంతే. అదియును "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి" ఒకసారి పుణ్య ప్రభావముచే విశాల స్వర్గలోక భోగము. అది చెల్లఁగానే, మర్త్యలోక ప్రవేశము. స్వర్గలోకమనెడి మాటచేతనే యది నిరవచ్ఛిన్నమైన యానందమయ పరమాత్మ క్షేత్రము. మర్త్యలోకమయము మనోమయ క్షేత్రము. సమాధి సహాయముచే, విశాలము నిస్సీమమునైన యా బోధమయ పరమాత్మ క్షేత్రమందుఁ బ్రవేశించుటయుఁ సమాధివిడిపోఁగానే జీవక్షేత్రమునకు దిగుటయు నగుచుండును. (సమాధిని గూర్చి, నా "దేవీ సూక్త పరమార్థము"ను జూచునది.) ఈ విధముగా గతాగత లాభమగుచుండును. ఆ "కామకామా" యనునదే దీనికి మూలహేతువు. సాధకులకుఁ దక్కిన కామనలు తొలఁగుచున్నను, దేహాత్మబోధ సంబంధియగు దృఢానురాగమే,

విశుద్ధబోధ స్వరూపమగు నాత్మ క్షేత్రమునుండి జాఱిపోవుట కైన హేతువు.

ఈ విధముగాఁ గొన్నాళ్ళు రాకపోకలు చేయఁగాఁ జేయఁగా, తరువాయి నెప్పుడో "న సమాధి ర్న విక్షేపః" యనెడి భూమిక ప్రాప్తించును. సమాధియు లేదు; విక్షేపమును లేదు. ఒక్క పరమార్థ సత్తా విషయక నిశ్చయ జ్ఞానమును, ఆత్మకంటె మఱియొక వస్తువునకుఁ త్రైకాలిక సత్త లేదనెడి జ్ఞానమును నిల్చును. అట్టి జ్ఞానమందుఁ బ్రతిష్ఠితుఁ డగుటచే, మఱెట్టి యవస్థయం దుండనీ - సమాహితుఁడే కానీ, విక్షిప్తుఁడే కానీ, యీ రాకపోకలు మఱియుండవు. ఒకప్పుడు నెళ్ళిసను, అందెట్టి హర్ష విషాదములును నుండవు. చూడుమిదిగో - తొలుదొల్త చిత్తమందునాటిన నీ పాప సంస్కారము లనెడి ముండ్ల నూడఁ దీయుట్కై, పుణ్యము లనెడి ముండ్లను సంగ్రహించుకోవలయును. అందులకయి త్రైవిద్యా పరాయణులు కావలయును. కర్మకాండ సహాయముతోఁ బుణ్య సంస్కారములను గడింపవలయును. క్రమముగాఁ బాప సంస్కారములు క్షీణించి పోవును. ఈ ప్రకారముగా ముంటితో ముంటి నూడఁ దీయుట తప్పదు. మఱికొన్నాళ్ళ వెనుక రెండు ముండ్లును బరిత్యాజ్యములే యగును.

కొందఱు "పుణ్యము నక్కఱయే లేదు; అదియు నొక బంధనమే కనుక" నందురు. వారు భ్రాంతులు. పుణ్యము లేక పాపసంస్కారములు క్షీణింపవు. అవి క్షీణింపక చిత్తము నిర్మలము కాదు. చిత్తము నిర్మలముగాక, భగవత్ స్వరూపోపలబ్ధి

కాఁ జాలను. అభ్యుదయకాములు, నిః శ్రేయస (మోక్ష) కాములు నెల్లరును, తెలిసియో తెలియకో పుణ్యార్జనమును బాపక్షయమును జేసికొంచునే యున్నారనుట చక్కఁగాఁ బ్రత్యక్షమగుచునే యున్నదికదా. దీని యందన్యథాత్వ మెన్నఁడు నుండదు.

అనన్యా శ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం
వహామ్యహమ్॥ ౨౨

అనన్యులును, జింతించునపుడు నన్నే చింతించువారును, చింతించి చింతించి నన్నే యుపాసించువారును, నిత్యాభియుక్తులునైన వ్యక్తుల యోగక్షేమముల నేనే వహింతును.

మును జెప్పిన సంసారమార్గమందు, మఱి మఱి రాకపోకలు చేయుచుందురు. కనుక నపుడు పుణ్యమునెడ వితృష్ణ కలుగును. పాపమునెడ వితృష్ణ మున్నే తొలిగెను. ఇపుడు పుణ్యము యొక్క క్షయ ధర్మమును గని, పుణ్యమును సంపాదించు స్పృహయును తొలఁగఁ జొచ్చెను. దేనియందు క్షయోదయములు లేవో, యేది స్థిరమో, నిత్యమో, యట్టి వస్తువును సంధానించుకొన నారంభించును. ఆకాంక్ష పెరుగుట చూచి, నేనే సద్గురు రూపముతో వారిని జేరఁబారి సత్యవస్తువు నుపదేశింతును. గురువునెడనైన యేకాన్త శ్రద్ధచే వారు సజీవవిధిని దాని ననుసరింతురు. తత్ఫలముగా వారు, నన్ను విడిచి యెచ్చటను వేఱొండేదియు లేదనియు, పుణ్యరూపముతోను బాప

రూపముతోను నేనే యున్నానని యు, నాసత్తతోడిదే పాప పుణ్యముల సత్తయనియు గనుగొందురు. ఇది కనుగొనునపుడే మనుష్యు లనన్యు లగుదురు. ఎవరికి మఱియొకటి లేదో వారే యనన్యులు నాఁబడుదురు. నన్నొక్కని విడిచి, – సత్యమును విడిచి – మఱియొక వస్తువే లేదనెడి జ్ఞానమందు దృఢప్రతిష్ఠితులైనవారే యనన్యులు. వారు సాధారణ మనుష్యులవలెనే జగత్తునందు – సంసారము నందుండుట తప్పదుగాని, విషయరూపమున గ్రాహ్యమై వారియెడ నేది తోఁచినను, అది యంతయు నేనేయని, వారికిమర్మమర్మములందు, రోమరోమములందు నను భవమగును. "మయా తత మిదం సర్వ" మిత్యాద్యుపదేశము, వారి హృదయమం దెట్టి సంశయమును విపర్యయమును వచ్చి చలింపఁజేయ లేనంతగా వ్రేళ్ళు తన్నినది. ఇట్టి యవస్థ యెల్లరును గోరఁదగినదే. పలుసారులు పాపపుణ్య సంస్కారములచేత, నిలుకడ లేనివాఁడు కాఁగా గాఁగా, దాని పరిణామము విషమయ మనియు నశ్వరమనియుఁ దోఁచినపుడు, మనుష్యుఁ డిట్టి యనన్యుఁడు కాఁగలఁడు. భేదజ్ఞాన మంతయుఁ దొలఁగిపోయి, ఉన్నదది యొక్కటే, యనెడి జ్ఞానమందు నెఱి నిల్చిపోవును. క్రమముగా "బహుస్యామ్" అని సంకల్పించిన యా నేనే యీ బుచ్చి నేననెడి మహావాక్యార్థజ్ఞానమును జేరఁగలఁడు.

ఆ తరువాత, "చిన్తయన్తోమాం పర్యుపాసతే" — నా చింతనమే చేయుచు నన్నే యుపాసించును. అతఁడు చేసెడి దంతయు నా చింతయే; మఱొక్క చింత లేదు. ఇట్టి యుపాసనమే సమ్యగుపాసనము; సార్థకోపాసనము. జగమునం దుపాస

నము చేయు వారల నేకులు కలరు, కాని సార్థకోపాసన మొందఱు చేయుచున్నారు? ఉపాసన మనఁగా నా సమీపమందాసనమును గొనుట. అనఁగా నాకు సమీపస్థుఁ డగుట. ఉప + ఆసనము – ఉప + నిషద్ – రెండును దుల్యార్థకములే. జపము, పూజ, ధ్యానము, కీర్తనము, యోగము మున్నగున వన్నియు నుపాసనా పదవాచ్యములే. ఉపాసనములే యనఁబడును. నిజముగా నీ యనుష్ఠానములు చేయువేళ నాకు సమీపస్థులు కాఁగలరు. ఈ సమీపస్థితి వారి కపుడు హృదయంగమము కావలయును. అనుభవము కావలయును. కాకున్నచో నుపాసన సార్థక్యమేదీ?

ఎట్టియుపాసనము సార్థకమగునో, యది చెప్పుచున్నాఁడు "మాంచిన్తయన్తః పర్యుపాసతే" తో త్త నననన్యుఁడు కావలయు, అదే యధికారి లక్షణము. ఎట్టి వ్యక్తులు పర్యుపాసనమున కధికారులో, యది యీ 'యనన్య' శబ్దముచేఁ బ్రతిపాదింపఁ బడినది. 'ఉపాసతే' యను పదమునకుఁ జేర్పఁబడిన 'పరి' యను నుపసర్గమునకు సార్థకత కలదు. దాని యర్థము సర్వతోభావమున నని; కాఁగా, పర్యుపాసన మనఁగా సర్వతోభావమునఁ జేయు నుపాసనమని యర్థము. అదే సమ్యగుపాసనము. ఇంతేల! సత్యసత్యముగా నేను భగవంతునకు సన్నిహితుఁడనై యున్నానని తానే తెలిసికొనఁ గల్గినపుడది సార్థక సమ్యగుపాసనము. ఊరక మనస్సులో ననుకొన్నంత మాత్రమునఁ గాదు. అగ్నిని సమీపించినపుడు దాని వేఁడిమి శరీరమున కనుభవమగును. అగ్ని ధర్మము తనయందు యథాసంభవముగా సంక్రమించునట్లు, భగవంతునకు సన్నిహితుఁ డగుటచే నతని ధర్మము ఉపా

సకు నందుఁ దప్పక సంక్రమింప వలయును. నిత్యత్వము, శుద్ధత్వము, పాపరాహిత్యము, వ్యాపకత్వము, చిన్మయత్వము, మున్నగు ధర్మముల నుపాసకుఁ డుపాసనవేళఁ బ్రత్యక్షముగ ననుభవించునపుడే, యది సరియైన పర్యుపాసన మని తలఁపఁ వలయును.

ఏ యుపాయముచే నీపర్యుపాసనము కాఁగలదో చెప్పు చున్నాఁడు. "మాం చింతయంతః" నా చిన్తనము నే చేయుచుఁ నైన యుపాసనమే పర్యుపాసనము. ననుఁ జింతియించుట లేక, యూరకచేయు జపయోగకీర్తనా ద్యనుష్ఠానము పర్యుపాసనము కాఁజాలదు. సరే; చింతచేయుచో నా చింతనమేచేయుము. "మఱియెట్టి చింతలుం జేయవల"దందువేని, "మఱి ఈ జగత్తు, ఈ సంసారము, ఈ జీవనయాత్ర, ఈ దేహరక్ష. యనునిన్నిటి నిర్వాహ మెటులగును? ఏమిమాటయ్యా! ఎంత కఠినము! నీ చింతనము మాత్రమే యెట్లగును? విషయచింత యించు కంతయు లేకుండుట సంభవమా"? యందువేని – 'నీది, నాది' రెండు కాఁజాలవు గాని "అనన్యాః" అని తొలుతనే యంటిని. అనన్యులయినపుడే "మాం చిన్తయన్తః" కాఁగలరు. అపుడు స్వాభావికముగానే చిన్తనమగును. ఎట్టి ప్రయత్నము నక్కఱయు లేదు. కనుకనే తొలుదొల్త ననన్యులు కావలయును. నిజముగా సత్యప్రతిష్ఠా ప్రాణప్రతిష్ఠలచేతనే యనన్యులైపోదురు. సరే; అయిపోదురు, పో; కాని, వారి యోగక్షేమముల మాట యేమి? ప్రయోజనీయ వస్తు (ద్రవ్య) సంయోగము, అనఁగా, ప్రయోజనకారి వస్తువు చేరుటే యోగము. లభించిన యా వస్తువు

యొక్క రక్షణమే క్షేమము. ఇవే యోగక్షేమములు. ఇవెట్లు సాగునందువా ? "వహామ్యహమ్" వాని భారమునాది. నెత్తిని బెట్టుకొని తెచ్చియిత్తును. వానిఁ గూర్చి యుపాసకుఁడు, ఎదురు చూడఁబనియే లేదు. మనుష్యుఁడు త్రైవిద్యా భావము విడిచి, పాపపుణ్యముల గొడవను విడిచి యనన్యుఁడగునప్పుడు "మాం చిన్తయన్తః" యగును. ఆసమయమున నతనికేది ప్రయోజనమో, దానిని నేనే తెచ్చియిత్తును. దానిని నేనే రక్షింతును. వహధాతువు నర్థము ప్రాపణము. వహామి = ప్రాపయామి; ప్రాపింపఁజేయుదును. పొందింతును. ఎన్నఁడును దీని కన్యధాత్వము రాదు. అనేక భక్తశిరోమణుల యోగక్షేమములను, భగవంతుఁడు తానే తలఁదాల్చి తెచ్చియిచ్చుటకుఁ బరోక్ష ప్రత్యక్ష ప్రమాణములు, ఈయవిశ్వాసి యుగమందు సైతము వేనవేలుదొరకుచున్నవి. భగవద్వాక్యమందు రవ్వంతయైన నతిరంజిత ముండదు, లేదు.

"అటయినఁ బ్రభువా! నీవు కేవలభక్తుల యోగక్షేమములనే వహింతువన్నమాట. నిన్నెంచి మొఱపెట్టని భక్తిహీనుల కేమిదారి ?" అనెదవేమో — విను. అదికాదు. "కేవల భక్తులే యననేల ? భక్తులయు అభక్తులయు నెల్లరయు యోగక్షేమములను నేనే వహించుచున్నాను. బ్రహ్మమొదలు చిన్న జీవాణువు వఱకును యోగక్షేమములను నేనే వహించుచున్నాను" అనియందువా ? మఱి సాధకులు అసాధకులు, భక్తులు అభక్తులునను భేదమేమున్నది ?—నిజముగా భేదమున్నది "తేషాం నిత్యాభియుక్తానాం" ఆ నిత్యాభియుక్తవ్యక్తులయొడనే

అనఁగా "మాంచిన్తయన్తః పర్యుపాసతే" ఆ నిత్యాభియుక్తులయిన భక్తులయెడనే, యీ సత్యము ప్రకాశించుచుండును. వారుమాత్రమే దీనిని ప్రత్యక్షము చేసికొన సమర్థులు. ఇంకను దేటపఱతును - వినుము. నిత్య + అభియుక్తులు = నిత్యాభియుక్తులు, నిత్యవస్తువు నేను; నాయందభియుక్తులు, సర్వతో భావముతో యుక్తులైనవారు, నిత్యాభియుక్తులు. అనన్యులగుటచే నిత్యాభియుక్తత తప్పకగును. ఈ నిత్యాభియుక్త జనుల యెడనే, నా యోగక్షేమ వాహకత్వము ప్రకాశించును. అనఁగా, నా యోగక్షేమ వాహకత్వమును ప్రత్యక్షము చేసికొనువారు వారే, కాని, యసాధక జనులు ప్రత్యక్షము చేసికొనఁజాలరు. వారి యహంబుద్ధి తొలఁగిపోలేదు. అనన్యులు కాలేదు. కనుక, భగవఁతుడనైన నన్ను 'నేను' కంటె వేఱని యనుభవింతురు. ఏలన వారికి, "నేను" అనఁగానే దేహమే తోఁచును. వారు జీవభావీయాహంకారమునకు లోఁగిపోయి, 'నేనెల్లప్పుడు నీ విషయముల నార్జించుకొని రక్షించుకొనుచున్నాను' అనుకొనుచుండును. వారి యజ్ఞానమువలనఁ గలిగిన మిథ్యయందు, నాసత్యస్వరూపము మునిఁగిపోయి యుండును. కావున వారు, యోగక్షేమాది విషయమున, నాకర్తృత్వమును జూడక, తమ కర్తృత్వమునే చూతురు. ఇఁక నిత్యాభియుక్తులు అహంకారము తొలఁగినవారు. తెర తొలఁగిపోయినది, గనుక వారు నా సత్యస్వరూపమును ప్రత్యక్షముగానే చూతురు. భగవంతుఁడే యోగక్షేమ వాహకుడని యనుభవింతురు. మనుష్యుఁడిట్టి యవస్థను జేరిపోయినపుడు, వాని తలబరువు

చులకఁబడును. నేనే సంసార పాలనము చేయుచున్నాననెడి జ్ఞానము తొలఁగి, దుశ్చింత సన్నగిల్లి, నిట్టూర్చి, అమ్మ! బ్రతికితి నను. ఆనందముతో నుబ్బిపోవును.

ఇది యీ విధమునఁ గాఁగా – మఱియొకవంక "ఏమిటో, బ్రతుకంతయు దుఃఖమయము, నాటకము, వెక్కిరింతగాను దోఁచుచున్న" దనుచు నొక మర్మపీడ వచ్చిపడును. ఇది సాధకులకే యగును. తోడనే కృతజ్ఞత తోఁచుచుండును.

మఱియు, "నా ప్రయోజనముల నన్నింటిని, నేనాశింపకే, భగవంతుఁడే యిచ్చుచున్నాఁడు. కోరకమున్నే యనుచరుఁడైన సేవకునివలె, ననుకూలమిత్రునివలె, స్నేహమయ జననివలె, నూరక యిచ్చుచునేయున్నాడు. కాని, తన స్వరూపమును దాచుకొనియే యున్నాఁడు. ప్రతిఫలము నింతయుఁ గోరఁడు. ఊరకే నెయ్యము నెఱపును. ప్రేమింపకే ఈయఁడు–" అనునిట్టి యవస్థ సద్హృదయ వ్యక్తులకు గొప్ప మర్మపీడను గలిగింపకుండునా?

యోగక్షేమ శబ్దములకు మఱియొక యర్థము —

యోగము = నాతోఁగూడి యుండుటకైన (ధ్యాన ధారణ సమాధుల) సామర్థ్యము. క్షేమము = మంగళము, మంగళమనఁగా ముక్తియే. అదొక్కటే జీవుని మంగళము. యోగము వల్లనే ముక్తి లభించును. చిత్తవృత్తి నిరోధము దేని బహిర్లక్షణమో, అదే యోగము. యోగఫలము (స్వరూపము) సాక్షిస్వరూపమున నుండుట, యనెడి ముక్తి– ఈ రెండింటిని నేనే తెచ్చిపెట్టుదును. ప్రాపింపఁ జేయుదును. కేవలము ఐహిక

విషయ సంపాదనము, రక్షణము మాత్రమే కాదు. పారమార్థిక ముక్తి పర్యన్తము నేనే ప్రాపింపఁ జేయుదును. లేదా భోగాపవర్గములు రెండును నేనే యనుము. అపవర్గ ప్రథమావస్థ యోగము. ద్వితీయావస్థ క్షేమము.

యేఽప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః ।
తేఽపిమామేవ కౌన్తేయ యజన్త్యవిధి పూర్వకమ్ ॥ ౨౩

కౌన్తేయా! అన్యదేవతా భక్తులై శ్రద్ధతోఁ బూజాను లతోఁ గొల్చువారు కూడ, నా పూజలనే యవిధి పూర్వకముగాఁ జేయుచున్నారు.

అనన్యులు కాఁగల్గిన వారియూసే యిట లేదు. "దేవా! నీవేవారి సర్వభారములు నెత్తిని బెట్టుకొన్నావు. కాని, యన్య దేవతలను బూజించువారున్నారు. శ్రద్ధతోనే పూజింతురు. వారి యవస్థ యేమగును?"

ఇచట - అన్యశబ్దార్థము - నాకంటె - ఆత్మకంటె, భగవంతునికంటె వ్యతిరిక్తమైన యనియర్థము. అనఁగా నన్ను (ఆత్మను, పరమేశ్వరుని) కాదని, మనుష్యులచేఁ జేకొనఁబడి గౌరవింపఁబడినవారు, అన్యులు. అన్యులైన దేవతలు అన్య దేవతలు. వారి భక్తులు అన్యదేవతా భక్తులు. లేదా, నన్ను విడిచిన వారనుము.

చూడుము; తనను వైష్ణవునిఁగా భావించువాడు, ఎంత దాఁక విష్ణునాత్మగా భావింపఁజాలఁడో (తెలియఁజాలఁడో) అంతదాఁక, వాఁడు విష్ణుపూజ చేయుచున్నను, అన్యదేవతా పూజనే జేయువాఁడే. నేను శాక్తుఁడనని యభిమానించి యా

శక్తినే యాత్మగాఁ బరిగ్రహింపఁ జాలనంతదాఁక, వాఁడును అన్యదేవతా పూజకుఁడే. ఈరీతిని సర్వత్ర తన యిష్టదేవత ఆత్మదేవుఁడుగాఁ బ్రకాశింప నంతదాఁక, శ్రద్ధాభక్తులతో నిష్ట దేవపూజ చేయుచున్నను, అన్యదేవతాపూజ చేయుచున్నాఁడనుటే. పూజా శబ్దముచేఁ గేవల పూజయే కాదు. కీర్తనము, ధ్యానము, యోగము మున్నగు సాధనము లేవియైనను నిచటఁ బూజాశబ్దముచే గ్రాహ్యములు.

దేశమందు – పృథ్వియందు, సాంప్రదాయక భావములు ధర్మవిద్వేషములు నిండిపోయినవి. ఒకరి ధర్మమునుబట్టి చూడ, మఱియొకరి ధర్మము, ఉత్కృష్టముగానో అపకృష్టముగానో సామాన్య జనమనస్సులం దాధిపత్యము చేయుచుండును. దానికి మూలభూత కారణము, అన్యదేవతా పూజయే. అన్యదేవతా భక్తుఁ డగుటచేతనే, యీ విష మంతట వ్యాపించుచున్నది. భగవంతుని యీ మాట యర్థము యథార్థముగా మనసున కెక్కించుకోఁగల వారిమాట వేఱు. వారు విరోధములనన్నిటిని మీఁటి పైకిఁ బోయిరి. కాని, అట్టి వారల్పసంఖ్యాకులు. సాధారణ ధర్మోన్మాదు లీ సత్యము నెఱుఁగ ప్రయత్నమైనను జేయరు. ఇందువలనఁ బరస్పర భేదభావములను బెంచుకొని మృత్యువు వైపు ముందంజ వేయుచున్నారు. శ్రుతియు "మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి," అన్నది. ధర్మము నుద్దేశ్యమేమో, జీవనమునుద్దేశ్యమెమో మఱచిపోయి, యుపాయమువైపు చూపు సారించుటే కారణముగా నిట్టి భేదజ్ఞానము పెరిగిపోవు చున్నది. ఆత్మ యొక్కటే, సత్యమొక్కటే, బ్రహ్మ

మొక్కటే, వేఱువేఱుపాధులను గూడి, వేర్వేఱు నామరూప ములతో వెలయుచున్నదన్నమాట, వేయిసారులు చెప్పినను, వేసార్లు విన్నను, తలకెక్కమిని భేదజ్ఞానము సరిగా లోపింప కున్నది. అన్యదేవతా జ్ఞానము నిల్చియే యున్నది. తన యిష్ట దేవుఁడే యన్యదేవతగాఁ బూజింపఁబడు నంతదాఁక, ఇష్టమూర్తి వ్యతీతమైన యన్యమూర్తి దర్శనమునకైన భేదజ్ఞానము పెరుగు చునే యుండును. ఇందు వింత యేమున్నది?

ఒక మాట మాత్రము నిజము - "శ్రద్ధయాన్వితాః" అయి చెదరని శ్రద్ధతో, నన్యదేవతాపూజ చేయుచున్నచో, ఆ శ్రద్ధాప్రభావముచే, నెప్పుడో యొకనాఁడు, అన్యదేవ తన్మ యత్వము వచ్చును. మఱి జ్ఞానోదయ మగును. ఆనాఁడే, అన్య దేవుఁడో, సత్యదేవుఁడో, యొక్కఁడే భిన్నభిన్న మూర్తులుగా వెలయుచున్నాఁడని తలంప సమర్థుఁడగును.

సరే; ఏది యెట్లయినను, భగవంతుని మాట — అన్య దేవతలయెడ శ్రద్ధాసంపన్నులై, పూజోపాసనాదులు జరుపు వారు సైతము, కార్యతః నాపూజనే చేయుచున్నారు. ఏమన, ననుఁ దప్పించి యొక్కఁడను నేదియు లేదు. ఎక్కడనే నేదేని పేరితో, నేదేని రూపముతో, నేదేని గుణపూజ జరుగునే, నది నాపూజయే. సత్తారూపమున నేనే యన్నిటికంటె ముందుగా హృదయమును వికసింపఁ జేయుదును. నేనే జ్ఞానరూపముచే నా యాయి యాకారములతో నాకారితుఁడనగుచుందును. కనుక నన్ను విడిచి (నేనుకంటె వెలికి) యొక్కడికినిబోవు నుపాయము లేదు, అనఁగా నంతయు నాలోనే నేనుగానే యున్నది. కాని

"అవిధి పూర్వకం యజన్తి" అవిధి శబ్దార్థము విధిహీనము. అనఁగా నజ్ఞానము. అవిధిపూర్వక పూజయు బరమార్థదృష్టిచే నాపూజయే యైనను, ఆ పూజకులయెడ నజ్ఞాన ముండుటచేత, ఆ పూజ యవిధిపూర్వకమే యగుచున్నది. పూజచేయువారు, నేనే సర్వఘటపటము లంటును సర్వదా సర్వభావములతో జేరి యున్నానని, యెఱుఁగరు. వారు మంచుగడ్డ నెఱుంగుదురు గాని, జలము నెఱుఁగరు. వస్త్రము నెఱుఁగుదురు గాని, ప్రత్తి నెఱుఁగరు. ఇటులే, నామరూపముల నెఱుఁగుదురుగాని నన్నె ఱుఁగరు. ఆ వస్తువుల సత్తయేదో యెఱుఁగమిని, వారి పూజ యవిధిపూర్వకమే యైపోవు చున్నది.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ।
న తు మా మభిజానన్తి తత్త్వేనాత శ్చ్యవన్తి తే॥ ౨౪

నేనొక్కఁడనే సర్వవిధ యజ్ఞముల భోక్తను; ప్రభువను; వీరు తత్త్వముచే నన్నెఱుఁగరు. కనుక నే విచ్యుతు లగుచున్నారు.

"మయా తతమిదం సర్వమ్" మున్ను జెప్పియుంటిని. గాన సర్వయజ్ఞముల భోక్తను, ప్రభువను నేనే. నా వల్లనే సర్వయజ్ఞములు పుట్టుచున్నవి. నేనే సర్వయజ్ఞములయు ఫలాఫల భోక్తను. కనుక నన్యదేవతాపూజ చేయుటచే నేను, అవజ్ఞాతుఁడుగానో, అజ్ఞాతుఁడుగానో యుండిపోవుచున్నాను. ఇట్టి కనిష్ఠాధికారులకు నిజముగా నేను అపరిచితుఁడనే యగు చున్నాను. ఇంతకును వారి జపపూజాద్యనుష్ఠానము సార్థకమగు చున్నది, కనుక వారు నన్నొంద లేకున్నారు. సరి. వారు విచ్యుతులగు చున్నారు. అనఁగా, వారి సాధనము, అనుష్ఠాన కాల

మందే సార్థకమై పోవుచున్న దనెడి జ్ఞానముతో వారు నాకు దూరముగానే యుండిపోవు చున్నారు. సాధన చేయుచున్నను, అసాధకుల వలెనే యుండుటగు చున్నది. సర్వఫలములతోను విచ్యుతులగు చున్నారు. ఇందొక యాత్మసంవేదనము — "జపోధ్యానంచ పూజా చ నామసంకీర్తనాని చ। అహందేవ వియుక్తాని వికలాన్యాహ బ్రహ్మవిత్," జపాదులు అహందేవ వియుక్తములుగా నగుచుండు నంతదాఁక, నవి వికలములే; అనఁగా నవి యర్థపూర్ణములే గాని సంపూర్ణములు కావు. ఆశా నురూప ఫలము నిచ్చునవి కావు. అసలుమాట - వారు అన న్యులు కావలయును. కానంతదాఁక వారి "చ్యవ న్తి" తెగలోని వారే యగుదురు. ఇవి ప్రత్యక్షసిద్ధి మాటలు. పలుతావులందుఁ గొందఱు సాధకులయు, భక్తులయు, యోగులయు, వేలకొలఁది యనుయాయులు, వారిని ప్రత్యక్ష భగవంతులని చాటుచుం దురు. ఎవరిని భగవంతులని వీరందురో, వారుకూడ, అన్యదే వతా నిరతులే. అనన్యులు కానంతదాఁక, వారి బాలకీయా జ్ఞానము తొలఁగదు. మఱువకుమా - భగవంతుఁడు తానే యనన్యుల యోగక్షేమములను నేనే వహింతుననుటయు, అన్య దేవతా నిరతులు "చ్యవన్తి" యనుటయు, ఈ రెండు మాట లును విశేష లక్ష్యమందుచఁ దగినవి సుమా. మొట్టమొదటి ప్రతిజ్ఞ 'విజ్ఞానసహితమైన జ్ఞానము నుపదేశింతు'నని కాదా. విజ్ఞాన మనఁగా సాధనము. ఆ సాధన రహస్యమును జెప్పచుఁ జెప్పుచు, సాధనమం దెచ్చటెచ్చట నే దోషము లుండునో, ఏ ప్రకారముచే సాధనము ఫలదాయకమగునో, ఎట్టి సాధనమందు

శ్రమము లేదో ఇవి మొదలగు నెన్నియో తెలియఁ జూపు చున్నాఁడు, గానఁ బాఠకులు దీనియందు మిగుల గుఱుతుంచ వలయును.

ఒకమాట – ఈ యోగక్షేమవహనము, విచ్యుతియన్నవి కేవల సాధనమును గూర్చిన మాటలే కావు. వ్యావహారిక జీవన మందును నిట్టివే. వ్యక్తిగత దైనిక జీవన మందును, దేశవ్యాపి సమస్త జాతిగతభావ మందును నీ రెండుమాటలు కార్యకా రులే. ఇమ్మాటయందు విశేష లక్ష్యముంచి నడిచినపుడు, ఒక వ్యక్తికే కాదు, ఒక జాతికే కాదు, ఒక దేశమునకే కాదు, ఎట్టి సమస్యలు రానీ, ఎట్టి మీమాంసలు రానీ, వానికన్నిటికి సరియైన సమాధానము వచ్చును. అనన్యులు, అన్యదేవతా భక్తులు నైనవారికగు ఫలమును – యథాక్రమముగా, యోగ క్షేమ లాభము, విచ్యుతి యను వానిని గూర్చి యీ తర్వాతి శ్లోకమందు, మఱింత తేటగాఁ జెప్పుచున్నాఁడు.

యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః।
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపి
మామ్॥ ౨౫

దేవపూజానిరతులు దేవతలను, అనఁగా దేవలోకమును, పితృవ్రతులు పితృలోకమును, భూతయాజులు భూతములను జేరుదురు. మఱి నన్ను యజించువారు నన్నే చేరుదురు.

"యాదృశీ భావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ" దేవతా పూజ యందును, ఈశ్వరపూజ యందును, భేదము లనేకము లున్నవి. శివ దుర్గా గణేశ విష్ణు సూర్యులు మున్నగు నెల్లరు

దేవతలే. ఇంద్రాదులును దేవతలే. ఎవఁడు సర్వేశ్వరుఁడో, ఎవని శక్తి విశిష్టమో, వాఁడే దేవత. ఒక వ్యష్టి నుపాసించుచు వ్యష్టి శక్తిసంపన్ను లగుటకైన వాసన గలవారలే, దేవవ్రతులు. నోరితో వేయిసారులు, ఈశ్వరుఁడు, ఈశ్వరుఁ డనుచున్నను, ఆ యీశ్వరుని భిన్నుఁడుగా (ఖండితుఁడుగా) జూచు నేని యీశ్వర పూజ చేయువాఁడు, తప్పక దేవవ్రతుఁడే యగును. ఇట్లగుటచే వ్యష్టిభావము మాత్రమే లభించును. అపుడే వ్యష్టి భావమును బట్టి, యుత్కృష్టము – అపకృష్టము = (గొప్ప – కొలఁది) యనెడి భేదభావముచేఁ దారతమ్య మేర్పడును. కాని మఱువకుమా – ఇవియన్నియు దేవభావములే. ఈ విధముగాఁ బితృవ్రతులు పితృలోకమునెడ శ్రద్ధాభక్తులు గలవారలగుదురు. కనుక శ్రాద్ధతర్పణాది కార్యములందే విశేషాభ్యాసము గలవారలగుదురు. వారు పితృలోకమునే పొందుదురు. ఇంక, భూతేజ్యా (భూతయజ్ఞ) పరాయణులు = భూతములఁ సేవయందే నిరతులగువారు, భూతములనే పొందుదురు. భూత శబ్దముచేఁ బ్రాణులనియుం దెలియవలయును. కాసింత మోటుమాట – ఆలుబిడ్డలు మున్నగు సంసార ధర్మములందాసక్తులు, అనఁగా మనుష్య సేవయందే నిరతులగువారు, తదనురూప లోకమునే పొందుదురు. కాని, నను యజించువారు నన్నే పొందుదురు – ఆత్మయాజులగువారు, ఆత్మలాభమునే పొందుదురు. ఇప్పుడు, విశ్వాసము గలవారెల్లరు నాత్మయాజు లేల కారని, యొకమాట. పూర్వకల్పములం దపకృష్టులే యైనవారి గతియో – అంటేని, పూర్వకల్పములందుఁ దరబడిగా నుత్కృష్ట

తను గడించుచురాఁగా, జీవులు ఆత్మయాజులు కాఁగలరు. ఒక్కసారిగా నెవ్వఁడును మద్యాజి కాఁజాలఁడు. సాధారణముగా మనుష్యుఁడు తొలుత భూతేజ్యుఁడు - సంసారాసక్తుఁడుగానే యుండును. పిదప భూతప్రేతాదులయెడ విశ్వాసము చూపును. అన్నిటికంటె మున్ను స్థూలమందాసక్తుఁడై, పిదప సూక్ష్మలోకము నందింతయో యంతయో విశ్వాసము, అనురక్తి కలవాఁడగును. ఇప్పటి ఈ భారతదేశమందుఁ బలుతావుల పూజ - ఉపాసన సాగుచున్నది కాని, సత్యముగా శిక్షితులైన వారియందిది తగ్గిపోయినది. పితృలోకగతులైన పితరాదుల యెడలనైన శ్రద్ధతోఁ జేయఁబడు శ్రాద్ధకర్మమందు నడుచు వివిధ క్రియా ప్రణాళికయందు వినఁబడు మంత్రముల యర్థజ్ఞానముతో జరుపునపుడది, పితృవ్రతుల నతిశీఘ్రముగా దేవవ్రతులనుగాను ఆత్మవ్రతులనుగాను మార్చివేయును. పితృవ్రత దినమునకు 'తద్దినము' (తత్ + దినము) అని వ్యవహారము. తచ్ఛబ్దము బ్రహ్మార్థకము. బ్రహ్మజ్ఞానమిచ్చను, సత్యప్రతిష్ఠా భ్యాసముతోఁ గలిగించు నుపాయము, దీనిని మించినది లేదు. క్రమముగా దేవశక్తి యెడనైన విశ్వాసము నిల్చి దేవవ్రతుఁడగును. దేవవ్రతియై సాగి తుట్టతుదకు నాయెడ దృష్టిపడును. అపుడన్నిటిని విడిచి మద్యాజియగు ప్రయత్నము చేయును. బహు సౌభాగ్యవశమున బహు జన్మముల వెనుక నీయవస్థ వచ్చును. దీనిపై మఱి మిగులు లేదు. మిగులొక్కటే - అదే "మయా తతమిదం సర్వమ్" అనెడి జ్ఞానమయావస్థ. ఈ యవస్థకు వచ్చినవాఁడును, ఈ దేవతా పితృభూతగణాదుల యన్నిటి సేవాపూజాదులను విడక

చేయును. అదియు నవ్యాజి యయియే యపుడుచేయును. ఏలన, నన్ను విడిచి యెక్కడను నేదియు లేదు; కనుక దేవపితృ భూతాదులందు దేనిని జూచినను నడుమ నా సత్తను లక్షించు సామర్థ్యము కలుగును. నేనే సర్వయజ్ఞముల భోక్తను, ప్రభువ ననెడి జ్ఞానముగలుగు పర్యన్తము, దేవపిత్రాదులను బృథగ్భావముతోనే పూజించుచు ఆయన్నిటిని విడిచి క్రమముగా నన్నే పట్టుకొనఁ బ్రయత్నించును; గాని యపుడు సైతము స్వరూపము సరిగాఁ బట్టుకొనఁజాలడు. ఒక్కింత యస్ఫుటాభాసము మాత్రమే పొందును. ఆపైని దయఁదలచి నేనతని జ్ఞాననేత్రమును విప్పివేయునపుడు, సర్వ పితృదేవ భూతరూపముతో నేనేయున్నానని బయల్పడును. అపుడు మఱి త్యాజ్యమనుచు నేమియునుండదు; గ్రాహ్యమనుచును నేమియునుండదు. ప్రారబ్ధవశుఁడై యపుడు దేవపిత్రాదులను వేనిని సమీపించియుండెనో వానినపుడు, ఆత్మవిలాసముగాను, ఆత్మవిభూతిగాను గనుచుఁ బరమానంద సాగరమున మునిఁగిపోవును. ఆదృష్టి కలుగనంతకును "చ్యవన్తి" దశములోనే యుండును. తప్పదు. ఏమీ? "నతుమామభిజానన్తి తత్త్వేన" ఈ సర్వతత్త్వముల నడుమ నన్నుఁగనలేదు కనుకనే. నన్నొందనపుడు - నన్నుఁగానపుడు అనన్యసేవ యేయఁగును; ఈ రాకపోకలు (సంసారము) తప్పదు. ఈ దేవ పిత్రాదిరూపముతో నెవరు ప్రకటమైయున్నారో, యనెడి జ్ఞానము లేకుండుటచేతనే యీ విచ్యుతావస్థ ననుభవించుటగుచున్నది. ఇఁక, ఆత్మదృష్టి వికసింపఁగానే, యెప్పుడును

ఆనందమే; ఎప్పుడును శాన్తియే. అభావము, క్షయము మున్నగునవియే యుండవు అదే.

పత్రం పుష్పం ఫలంతోయం యో మే భక్త్యాప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః ॥ ౨౬

ఏ వ్యక్తియేని పత్రపుష్పఫలజలములందేదేని, భక్తితో నిచ్చునేని, నా ప్రయతాత్ముండు భక్తితో నిచ్చు నయ్యుపహారములను నేను దిందును.

సరే; ప్రభువా! నిన్నుఁబూజించువాఁడు నిన్నే చేరును దేవపితృభూతపూజా విధానములు నానా శాస్త్రములందుఁ గానవచ్చుచున్నవి. వీని కతిరిక్తముగా శిష్టాచారములను జూచి దేవపితృపూజ చేయుటెట్టులగునో, మఱి, నాథా! నీ (పరమాత్మ) పూజయెట్లు కాఁగలదో, తెలియకున్నది. నీవో-సర్వవ్యాపి చైతన్య స్వరూపవస్తువవు. ఎప్పుడు ఏ విధముగా నీపూజ జరుగఁగలదో, దయచేసి తెల్పవా?

ఏమి "యర్జునా! అట్లందువు? దేవతాపూజ, యేభావముతోఁ జేయుదురో, నా పూజయు, ఆ భావముతోనే కాఁగలదు. నానా విధోపచారములతోను దేవపూజ యగుచున్నటులే నా పూజయుఁ గాఁగలదు. పత్రపుష్ప ఫలజలాదులైన పూజా ప్రసిద్ధోపచారములతోనే, నా పూజయుఁ గాఁగలదు. తక్కిన నానావిధములైన యుపచారములను నీవు సంగ్రహింపఁగల్గితే, సరే; అవి నీ శక్తిని మించిపోయేనేని, రవ్వంత శ్రమముతో లభించు పత్రపుష్పఫల జలములనే సంగ్రహించి పూజింపవచ్చును. అవన్నియు సంగ్రహింపఁ జాలనపుడు, ఒక్క జలము

తోనే పూజింపవచ్చును. మఱే జలమును సంగ్రహింపలేనపుడు, నేత్ర జలముతోనే (కన్నీటితోనే) నాపూజ చేయవచ్చును. అదె అన్నిటికంటె సర్వార్హ జలము. నేను నీకుఁ బరమ ప్రియుఁడను గానా ? నీ యేకాన్త మిత్రుఁడనుగదా; నాకుఁగాక మఱి యెవ్వరికేమి చేయుదువు ? కనుక నాపూజ చేయుటెట్లులనెడి ప్రశ్నమే పుట్టఁజాలదు. అర్జున ! కేవల ప్రణామముతోనైనను నాపూజ చేయవచ్చును. నాకు (నేనునకు) నీవుగొప్ప యవజ్ఞ చేయుచునేయున్నావు. జన్మజన్మాంతరములనుండియు నవజ్ఞ అవహేలనము చేయుచునే వచ్చుచున్నావు. అట్టి నీ దుర్బలతను బాలబుద్ధిని దొలఁగించుటకే, ఈ పూజమాట చెప్పుచున్నాను."

నే ననంత బ్రహ్మాండముల కద్వితీయుఁడనయ్యు, నేఁడు గతిమాలినట్లు నీగుమ్మముకడనిల్చి పూజాభిక్షము నడుగుచున్నాను. నాయనా ! నేస్తమా ! నన్నుఁ బూజింపుము. ఆదరింపుము. ఒక్క ఆకు, ఒక్క పూవు, ఒక్క పండు, గోరెడు నీరు, నీవేది తేఁగలవో, దానినే నాకిమ్ము. పూజా భిక్షార్థిని. నాకు అవజ్ఞచేసియే, నీవు అవజ్ఞాతుఁడవు, ఉపేక్షితుఁడవు, దలితుఁడవు, మథితుఁడవునై యున్నావు. నీ యీ దుఃఖదుర్దశను జూచి, నేను మర్మపీడ ననుభవించుచున్నాను. నే నేడ్చుచున్నాను. నాకు గుండె పగులునంతటి దుఃఖము గల్గుచున్నది. అది నీ వెఱుఁగవు. అయినను నేను వచ్చుచున్నాను. నీయెదుట మెల్లమెల్లగా నాత్మప్రకాశము చేయుచున్నాను. నా పూజ వల్లనే నా యథార్థ స్వరూపము ప్రకాశించును. నా పూజ నీవు సరిగాఁ జేయకుండుటచేతనే, నేను దీనుఁడను హీనుఁడను

బికారిని అగుచున్నాను. మలినుఁడ నగుచున్నాను. సబలుఁడ నయ్యు బలవియుక్తుఁడనై గోసమూహము దోలుచున్నాను. నా ప్రకృతికి భిన్నమైన మలిన వస్త్రములనుదాల్చి, స్వార్థ సంకీర్ణమలిన స్థానమందుఁ గూరుచున్నాను. అట్టియపుడే పూజను గోరుదును. వడివడి పూజ నందుకొన వత్తును. నీవు యథార్థపూజ చేయలేక మోసగొంటి పూజచేసినను, నీ యా పూజనే యందుకొన వత్తును. ఎటులో నీచేఁ బూజితుఁడ నైన పుడే, నీవు నా మహత్త్వమును, సర్వవ్యాపకత్వమును ధరింపఁ గల్గుదువు దానిఫలముగా నీ దుఃఖములు దుర్దశలు పూర్తిగాఁ దొలఁగి పోవును. ఇందుకే నీ పూజల నర్థించుట, మున్నాటికి నా పూజలు చేయుమంచు మీ దువారములకడఁ దచ్చాడు చుండుట. పత్రపుష్పాదులలో నీవేది యీఁ గల్గిన నాకదే యిమ్ము. అంతలోనే సంప్రీతుఁడ నగుదును. భక్తితోను, శ్రద్ధ తోను, ఆస్తిక్య బుద్ధితోను నర్పింపుము. నిజముగా నేను సర్వ వ్యాపిని సర్వ శక్తిమంతుఁడను; నీ పూజ నందుకొన నెప్పుడును ఉన్ముఖుఁడనే, యనెడి విశ్వాసమును స్థిరముగా నుంచుకొని, యర్పింపుము. నావైపయినా మొగముచూచుచునర్పింపుము. నీవు దేవ పూజకుఁడవో, పితృవ్రతుఁడవో, భూతయాజివో, ఎవఁ డవే నగుము. కొంచెము శ్రద్ధతో శ్రత్ = సత్యము; సత్యమును ధరించు బుద్ధియే శ్రద్ధ. అట్టి బుద్ధితోఁ, బత్రపుష్ప ఫలాదుల నర్పింపుము. నీవిచ్చునపుడు రవ్వంత శ్రద్ధాభక్తులతో నర్పింతు వేని, నీ యా ప్రయతాత్మను (సంయత చిత్తమును) నీ విచ్చు నుపహారములను నే నెంత యాదరముతోఁ గొందునో, నీవే

చూడఁ గలవు. నీవే ప్రత్యక్షము చేసికొనఁ గలవు. నాయనా! అశ్నామి = భుజింతును. కడు నాఁకలి గొన్నవాఁడు తన యెదుట నుంచిన తినుబండముల నెంత తత్తఱపడి యాహారించునో, ప్రియుఁడా! అటులే నేనును, నీవు భక్తిపూర్వకముగా నిచ్చు పత్రపుష్పాదులవి యెంత తుచ్ఛములైనను సాదరముగా గ్రహింతును. అటు కాదేని నేను భుజింపను. నేను నిజముగా నే క్షుధార్తుఁడను. నేను అన్నార్థిని. నీలోని నిష్కపట భక్తియే నా యన్నము. అది లేకున్న నా యాఁకలి తీఱదు. పూజోపచారములనుజూడను. ఉపచారముల హెచ్చుదగ్గులు, మంచిసెడ్డలు నా లక్ష్య విషయములు కావు. నా లక్ష్య మంతయును భక్తిపైనే యుండును. నీవు నాకేమి యిచ్చినను నది యెంత భక్తిపూర్ణ మో చూచుచుందును. ఎంత సరళత, ఎంత నిష్కపటత, ఎంత నిఃస్వార్థత, నీ హృదయమున నిల్పి, నీదోయిటఁ బూలు పట్టుకొని నా యెదుర నిల్తునో యదే చూతును. కామనల తోను, వాసనలతోను నీ చిత్తము మలినమై యున్నను హాని లేదు, గాని సరళప్రాణముతో వచ్చుట, సరళప్రాణముతోఁ బలుకుట, సరళప్రాణముతో నీ వాసనల యొత్తిడిని నాకుఁ దెల్పుట, యైనపుడే నీపూజ భక్తిమయ మగును. లోపల వాసనారాశిని దాచుకొని, పైకి భక్తిని నిష్కామమును అభినయించుచుఁ గపటబుద్ధి నాశ్రయింపకుము. నాకుఁ దెలియక పోదులే. నే నంతర్యామి పరమపురుషుఁడను; నీ లోపలనే యుండి యంతయుఁ గనిపెట్టుచుందును; గనుక నీవు నాకడ కెపుడు వచ్చి నను విచ్చినమనసుతో రమ్ము. నేనే నీ తండ్రిని; నేనే నీ తల్లిని;

నేనే నీ చుట్టమను; నేనే నీ నేస్తమను; అని మున్నే చెప్పితిని. కనుక సందేహింపకు. సంకోచింపకు; భయపడకు. సరళశిశువు వలె నిర్విచారముగా నన్ను సమీపించుట, నీ శక్తికొలది, పుష్పాదిక మేదేనిఁ గానీ, సరళ ప్రాణముతో నిచ్చుట, అంతే చూచుకొనుము. ఇటులు భక్తితో నిచ్చిన యుపహారములనే, నేను సాదరముగా నందుకొందును.

ప్రభువా! "నేనే సర్వయజ్ఞభోక్తను గనుక, నీవు భక్తితోనే యిమ్ము; అభక్తితోనే యిమ్ము; ఎంతే నిమ్ము; ఎక్కడ నేనిమ్ము; ఏ భావముతోనే నెవరి పూజనేని జేయుము. అదంతయు నా పూజయే" యని తొలుత నంటివి. ఇపుడు, భక్తితో నిచ్చినపుడే, నీవిచ్చునది యందుకొందు నందువు. ఇదేటి మాటయ్యా! అనెదవేమో —— .

అర్జునా! అవును; నిక్కముగా సర్వవిధ యజ్ఞభోక్తను నేనే; యజ్ఞభోక్త మఱియొకఁడు లేఁడు. దీనికెన్నఁడు నన్యథాత్వ ముండఁజాలదు. ఇటఁ జెప్పెడి దేమనఁగా, —— సర్వయజ్ఞభోక్త నైన నేను, నాకు భక్తితో సర్పించువాఁ డెవఁడో, ప్రయతాత్ముఁడెవఁడో, పోల్చుకోఁ గలను. ప్రత్యక్షముచేసుకోఁ గలను. ప్రయతాత్ముఁడును, భక్తితో నిచ్చువాఁడును నేనే సర్వయజ్ఞభోక్తనని ప్రత్యక్షము చేసికోఁ గలఁడు. పూజాకాలమందే, యతఁడు చేయు పూజ నత్యాదరముతో నందుకొనుచున్నా ననుటను, యథార్థ సాధక భక్తజనులే యనుభవింపఁ గలరు. ప్రయతాత్ములును భక్తిసంపన్నులును గానివారు, పూజచేసియు నీ సార్థకత ననుభవింపఁజాలరు. చేనక్కడ నప్రకటనముగానే

యుండి (తెలియఁబడకే) వారి పూజాదికము నందుకొందును. నేను స్వప్రకటుఁడనై యున్నను, వారికి జ్ఞాననేత్రము లేకుంటచే, నయ్యజ్ఞాని భక్తిహీన పూజకడ, నపరిచితుఁడనుగానే చిరముండి పోదును. ఇఁక జ్ఞానిభక్తులో – తామిచ్చు పత్ర పుష్పాదికమును నే నెంత యాదరముతో నందుకొందునో కనుఁగొందురు. ఇదే భేదము.

మఱువకుమా, "యో మే భక్త్యా ప్రయచ్ఛతి" అనునిదే 'మే ప్రయచ్ఛతి' కావలయును. అన్యదేవతలకు 'ప్రయచ్ఛతి' యగుచో, "అహమశ్నామి" యెట్లు కాగలదు. కేవల ప్రయతాత్ములైన వారియెడ నేను ప్రత్యక్షముగా "అశ్నామి" భుజింతును. అట్టివారు కాఁజాలనియెడ వారన్యదేవతాసక్తులే. నిజముగా యజ్ఞభోక్తనయ్యును, వారియెడ నప్రకాశితుఁడుగానే యుందును. ఇదే ఈ మంత్రమందలి విశేష తాత్పర్యము.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥ ౨౭

ఓ కుంతీనందనా ! నీవేమి చేసినను, ఏమితిన్నను, ఏమి హావనము (హోమము) చేసినను, ఏమి దానము చేసినను – ఎట్టితపస్సు చేసినను, అదియెల్ల నాకే యర్పితమగునట్లు చేయవలయును.

వెనుకటి శ్లోకమునఁ బూజావిషయము చెప్పఁబడెను. ఇపుడు సాధారణ పూజా విషయమును జెప్పుచున్నాఁడు.

కౌన్తేయా! మాతృభక్త సంతానమా! నీవేమి చేసినను మనోవాక్కాయ శుద్ధితోఁజేయుము. కాని, యది మదర్పణ మగునట్లు చూడుమా.

మొదట - పత్ర పుష్పాదికమును మదర్పణము చేయు మనెను. అది నా విశేష పూజయనెను. ఇంతమాత్రముతో నే సాగదు. నీవేమి చేసినను, ఏ మాత్రము చేసినను అది మదర్పణముగా జరుగవలయును. "యత్కరోషి" యనుటవల్లనే సర్వ కర్మములును లక్ష్యములు. అయినను "అశ్నాసి, జుహోషి, దదాసి, తపస్యసి" యని నాల్గుమాటలు ప్రయోగింపఁబడినవి. సాధకులైనవారును, రాజగుహ్యయోగాధికారులును, "కరోషి" యనుటచే, నీ నాలుగు పనులనే విశేషభావముతో లక్షింతురు. దీనిచేఁ దదితర కర్మములందు వారికి, ఆస్థయే (గౌరవము ఆ ధా ర ప డు ట) యుండఁజాలదు. (అశన, హవన, దాన, తపస్యలు). అశన శబ్దముచే స్థూలమునకైన యన్నాది కాహార మనియే తలఁపదగదు. ఎన్నివిధముల భోగములు, భోగసాధన ద్రవ్యములను సంగ్రహించుట, యనెడిపని చేయుటగునో, అదెల్ల అశనమే. హవనమనుటచే, యజ్ఞము, హోమము, శ్రాద్ధము, తర్పణము మున్నగునవి. దానమనుటచే, నితరుల దుఃఖములను దొలఁగింప నీవేమి చేయుదువో, యదియంతయు ననియర్థము. తపస్య యనుటచే శారీరక కష్టసాధ్యములైన వ్రతోపవాసాదు లనియు నర్థము. ఉపాసనాత్మకమైన కష్టసాధ్య శాస్త్రీయ కర్మములే తపస్య. వీనినన్నిటిని విడిచి యింకేకర్మము కాఁగలదు? ఇఁక మఱేవి రాజగుహ్య యోగాధికారియైన కుంతీతనయునకుఁ

జేయఁదగినవగును ? 'మదర్పణము' ఈ క్రియకు విశేషణము. "మయి అర్పణం యథాస్యాత్తథా కురుష్వ" పూర్వోక్త కర్మములను, నాకే యర్పితము లనెడి పూర్ణభావముతోనే చేయవలయును.

భోజనమునకుఁ గూర్చుండి, అన్నమును అన్నమునుగానే చూడకు. నేనే యన్నరూపముతో నీయెదుట నున్నానని చూడుము. నేనే భోజ్యముగాను, భోక్తగాను నుండి భోజన మనెడి కార్యమును సంపన్నము చేయుచున్నానని చూడుము. ఇట్లు చూచుట యలవాటగుటచేతనే, అశనము మదర్పణ యుక్తమగును. ఈ దృష్టితోనే క్రమముగా, అన్నమందు బ్రహ్మదర్శన మారంభమగును. "అన్నం బ్రహ్మాండవ్యాపి" "అన్నం పరబ్రహ్మ స్వరూపమ్" అన్నమే సర్వము. అన్నము వల్లనే భూతముల యుత్పత్తి స్థితిలయము లగుచున్నవనెడి జ్ఞానము; అనఁగా ఇట్టి దర్శనలాభము కాఁగాఁగాఁగా క్రమముగా స్థూలమునుండి సూక్ష్మము కడఁజేరి, పిదప విశుద్ధబోధ స్వరూపుఁడనైన నాయందే చేరును. సందియము లేదు. దైవ ఘటనా క్రమమునను, ప్రారబ్ధ ప్రాతికూల్య బలమునను దేహము పడిపోవులోఁగా నిట్టి జ్ఞానలాభము కాకున్నను, హతాశులు కాఁబనిలేదు. జన్మాంతరమందైనను క్రమముక్తి మార్గమున నిశ్చయముగా నన్నొందఁగలఁడు. లక్షలకొలఁది జన్మములు కడచినవికదా; మఱి యొకటిరెండు జన్మములకే యధీరులగుట తగదు. విత్తనాలు చల్లిననాఁడే పంట మనయింటికిరాదు. యథార్థ ఫలమును గోరువారు, ఈ విధముగా నొక్క యశన

మందే కాదు, హోమాది కార్యములందును, ఆదిమధ్యాన్తము లందు, నన్నుఁజూచు ప్రయత్నమునే చేయవలయును. నేనే కర్తను; నేనే కర్మను; నేనే ఫలమను; నేనే భోక్తను; అనునిట్టి దర్శనము చెదరనీయక, జాగతికమైన సర్వ కార్యములను జేయుచుండవలెను. ఇది మొట్టమొదట, కల్పనా మాత్రముగానే తోఁచును. గనుకఁ గొన్నాళ్ళుచేసి విడువరాదు. కల్పనము నిక్కమైన యనుభవముగాఁ బరిణమించుటకే ప్రయత్నింప వలయును. కాతర ప్రాణముతోఁ బ్రార్థించుటే, యా ప్రయత్నము. తక్కుచేష్టలు దీనికంగములే.

"ప్రాణపతీ ! సర్వము నీవేయని నాకు నచ్చఁజెప్పుము. నేనజ్ఞానిని; మూఢుఁడను; నీవాత్మవు; సర్వమయుఁడవు; నీవే కర్తవు; నీవే భోక్తవు; నీవే కర్మవు; అని చిలుక పలుకులుగా నోరితో వేయిసారులు వల్లించెదను. గాని నాకేమియుఁ దెలియకున్నది. కానరాకున్నది. మనోనాథా ! నీవే నాకుఁ దెలియఁ జెప్పుము. నీవే గురుఁడవు; నీవే సఖుఁడవు; నీవే చుట్టమవు; నీవే తెలియఁజూపకున్న నాకు మఱెవ్వరున్నారు? నిన్నుఁ బయల్పెట్టి చూపఁగలవారు నీవేకాక మఱెవ్వరును లేరు. నీవు స్వయం ప్రకాశుఁడవు, కనుక నీవే నీ స్వరూపమును నా యెదురఁ బ్రకాశింపఁజేయుము" అనుచు నిట్లు ప్రార్థింపఁగాఁ, బ్రార్థింపఁగా నా స్వరూపము ప్రకాశితమగును. ప్రకాశితమగు నంతదాఁక, నిది కేవల కల్పనమనుచు నుపేక్షింపకుమా. యథానిర్దిష్టముగాఁ గర్మములను మదర్పణముగా ననుష్ఠించుచుండవలెను. ఇదిగో నా మొట్టమొదటి యుపదేశము "మయాతత మిదం సర్వమ్"

అనెడి దానిని చక్కఁగా నెత్తికెక్కించుకొన్నవాఁడును, సంశయ విపర్యయ జ్ఞానములు మొదలంటఁ దొలంగినవాఁడును, సర్వ కర్మములందును నా దర్శనము చేయఁగలఁడు. నన్ను విడిచిన యెడ నెట్టిసత్తయు దేనికిని నుండఁజాలదు. ముందుగా నేను సత్తాస్ఫూర్తి ప్రదానమే చేయుదును. తరువాత "సంభవః సర్వభూతానామ్" జ్ఞానము నిత్తును. మఱి నేనే జ్ఞాన దృష్టికిఁ గానఁబడుదును. అపుడు వస్తువు ఎల్లెడఁ బ్రకాశించును. నా సత్త జ్ఞానమయము. లేదా, జ్ఞానమే సత్తామయమనుము; లేదా, జ్ఞానమును సత్తయు నభిన్నవస్తువులనుము; సులభముగాఁ దెలియుటకై, జ్ఞానముయొక్క సత్త – సత్తయొక్క జ్ఞానము, అని ప్రయోగింపఁబడుచుండును, గాని యీ మాటలన్నియు నిటఁ బ్రసక్తిలేనివి: విడువుము. నీవు చేయవలసిన దొక్కటే. — రేపు మొదలు మాపుదాఁక మాపు మొదలు రేపుదాఁక, నీవేమి చేయుదువో, యదియంతయు మదర్పణ మగుచున్నదో, లేదో చూచుకొనుచుండుము. నన్నుఁ జూచుచునే, నన్నుఁ దాకుచునే నీ కర్మములగుచున్నవో లేదో కనుచుండుము. ఇట్లు చూచువాఁడవు కాఁగానే, నా స్వరూపోపలబ్ధి నీకుఁ దప్పకగును.

ఇదిగాక, నీకులభించు మఱియొక ఫలమున్నది. అది క్రింది శ్లోకమునఁ దేఁటపడును.

శుభాశుభ ఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః ।
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి ॥ ౨౮

ఈవిధముగా సర్వకర్మములును మదర్పణముగాఁ జేయ బడినపుడు, నీవు శుభాశుభ ఫలములతో - పాపపుణ్యములతో, గర్మజన్య బంధనములతో విడువఁబడుదువు. సన్యాసము = కర్మఫల త్యాగము; యోగము = బుద్ధియోగము; ఈ రెండిటి సహాయముతోఁ గూడిన యాత్మగల వాఁడవై, విడువఁబడి (జీవభావము వలన విడువఁబడి) పరమాత్మనైన నన్నొందుదువు.

అర్జునా! మున్ను నినట్లు, సర్వకర్మము లందును, మదర్పణము సుసంపన్నమయి, కర్మముల యాదిమధ్యాన్తములందు నన్ను స్మరించుటే యలవాటయి, నాకర్తృత్వాదిక మందే నీ కన్నులు విడిపోవునేని, శుభాశుభ కర్మబంధనముల వలన నీవు పరిత్రాణము నొందుదువు. కర్మము చేయుటచే, శుభమో యశుభమో, యొక ఫలము తప్పదుగదా. చిత్తక్షేత్రమందు శుభాశుభకర్మ సంస్కారరాశి వాసనా రూపమున, బీజరూపమున నుండిపోవును. అదే బంధనము. ఈ బంధనము వల్లనే మాటిమాటికి, జన్మ మృత్యురూప సంసారగతి సిద్ధమగుచున్నది. ఏ వెరవునను దీని చేతినుండి తప్పుకొనుట కాదు. కనుకనే మనుష్యుఁడు ముక్తి కడు దుర్లభమనుచు, నిట్టూర్చుచుండును. ఇట్లు తలంచుట యన్యాయము కాదు. "గహనా కర్మణోగతిః" దానికొక్క యుపాయమే యున్నది. అది యపూర్వము. అదే "మదర్పణం కురుష్వ" యని చెప్పితిని. అంతమాత్రము చేయుటచేతనే కర్మఫలము వల్లనైన కట్టు మఱి యుండదు. ఉండఁ జాలదు. ఏలన, నపుడు మఱి కర్తృత్వ బోధము లేదు; ఫలాసక్తియు లేదు. కనుకబంధనము నుండదు. చిత్తమందు మఱెట్టి

సంస్కారములును మూగుట యుండదు; కనుక బంధనము తెగి పోవును.

ఈ మదర్పణము, సరిగా నగుచున్నదా, లేదా ! మఱి కర్మజనిత బంధనము పుట్టుచున్నదా, లేదా? యను దానికొక్క పరీక్ష యున్నది — ఆ పరీక్షయందు త్తీర్ణుఁడు కాఁగల్గెనేని, మఱి భయములేదు. ఆ పరీక్ష యిది - కర్మసాఫల్యమందు హర్షము లేకుండుట, కర్మనిష్ఫలతయందు విషాదము లేకుండుట, కర్మము విరుద్ధముగా ఫలించినను భయము లేకుండుట, యన్నదే. యంత్రములు రే వగళ్ళు పలువిధముల పనులు చేయుచున్నవి. పీసమంత విశ్రామము లేదు. కాని, వానివల్ల యంత్రస్వామికి లాభ మగునట్లుగా, సర్వకార్యములు నగు చున్నవా, లేదా ! మన పనులు బాగున్నవా? ఓగుగా నున్నవా యనుదాని మొడ యంత్రముల కెట్టి లక్ష్యమును లేదు. తమ నిర్దిష్ట కర్మములు చేయుటయందే యభ్యస్తములైనవి. ఫలాఫలముల యూసు వానికి లేదు. సరిగా నీరీతినే నీవును జూచుకొమ్ము. నీ మనో బుద్ధీంద్రియములతోఁ గూడిన యీ దేహ యంత్రమును, విరామము లేకయే యంత్రి (యంత్రము గలవాఁడు) నడుపుచునే యుండును. ఆ నడుపుట ఫలముగా, మంచి, చెడ్డ - యెన్నివిధముల ఫలములో యగుచున్నవి. అందు నీదేమున్నది? నీకేమి యున్నది? అభిమాన పడకుము. నీవు మదర్పణము చేయుచునే పొమ్ము. నీవు కర్మబంధనము వలన నిశ్చయముగా విముక్తుఁడ వగుదువు. నాఁపుగింజ, "నేనెంత మంచి నూనె నుత్పాదించితిని" అను కొన్నదఁట. అందు సత్యమేమున్నది? వాస్తవముగా నూనె

నుత్పాదించు శక్తి, దాని యందేమున్నది? ఏ తెలకవాఁడు దానికి నాలుగు సంస్కారములు చేసి, మంచినూనెను సిద్ధము చేసినాఁడో, వానిదా ఆ నూనె? నూగింజదా? ఇటులే సర్వత్ర స్మరించుకొనుచుండ వలయును. "నేను కర్తను, నేనే మంచి చెడ్డ ఫలములను భోగింతును" అను టెన్నఁడుఁ జెల్లదు. "వాస్తవముగా నేను కర్తనుగాను; 'నేను' అనునదే కర్త. ఆ కర్త యెడనే దృష్టి నిలిపి, మనుగడ యందలి ప్రత్యేక కర్మమును జేసికొనిపోవుచు, యంత్రమువలెఁ బరిచాలితుఁడ నగుచున్నాను. (నడుపఁబడు చున్నాను.) ఆ కర్త వల్లనే కర్మములు ఫలములు నగుచున్నవి." యను నిట్టి దృష్టితోఁ జూచుచు నారంభించుట వల్లనే కర్మబంధనము తొలఁగును. సరిగా మదర్పణము చేయఁగలవాఁడు, కర్మ చేయనే లేదు; ఆతని కర్మమే యయిపోవుచున్నది అందును. "కర్మము చేయుట – కర్మమగుట" యను రెంటికిఁ జాల భేదమున్నది. ఏ మయినను గర్మఫలము విడుచుటనే సన్న్యాసము సిద్ధమగును. గీతయం దంతటను, యథార్థ సన్న్యాసము కర్మఫల పరిత్యాగమే యని శ్రీగురుఁడు కృష్ణుఁడనెను. సన్న్యాస సిద్ధితోనే యోగసిద్ధి తప్పక యగును. లేదా, సన్న్యాసము, యోగము నవినాభావు లనుము. ఒకవైపు కర్మఫలములతో నెడసి పోవుటగు చుండఁగా, రెండవవైపున నటులే బుద్ధిద్వారమున నా (నేను) తో యోగము నునిష్పన్న మగుచుండును. బుద్ధియోగము, కర్మఫల సన్న్యాసము నను రెండును బరస్పర సుగంధవాహాలుగా సిద్ధమగును. ఈ రెంటిటి సహాయముతోనే సాధకుఁడు ముక్తాత్ముఁ డగును. నాతోఁ జేరిపోవు

సుయోగము నొందుచుండును. జీవభావముతో లెస్సగా విడిపోవును. అపుడే "మామువైష్యసి" యగును. మఱెక్కడను నేమియు లేదు. నన్నొందుటే యగును. ఇంత యగుదాఁక నన్నొందఁ జాలఁడు. జీవభావము రవ్వంత మిగిలి యున్నను, నన్నొందు నుపాయము లేదు. ఏలన, నేను భేదాతీతుఁడను. నిరంజనుఁడను.

వైష్ణవ శాస్త్రమందు — "జీవుఁ డెన్నఁడును ఈశ్వర సమానుఁడు కాఁడు. ఎట్లగును?" అని చెప్పఁబడినది. గాని, జీవభావ విముక్తుఁడు కాఁగానే, ఒక్క యాత్మస్వరూపమందే నిల్చును. అక్కడ నెట్టి భేదమును లేదు. "మామువైష్యసి" యను మాటచేతఁ గొంద ఱిట్లనుకొన వచ్చును; — నేను వేఱు; నీవు వేఱు; నీవు నన్నొందుదువు. అట్లు కాదు. ఉన్నది నేనొక్కడనే. మఱెక్కడను నేమియు లేదు. ఇది తెలియవలయును; ప్రత్యక్షము చేసికొన వలయును. అనుభవించుట పేరే "మామువైష్యసి." ఒక్క సచ్చిదానంద స్వరూపాత్మయే, సజాతీయ విజాతీయ స్వగతభేద రహితము. దేశకాల వస్తు పరిచ్ఛేద రహితము. స్వరూపముచే నిత్యభ్రాజమానము. ఈ స్వరూపమందుఁ జేరుట పేరే "మామువైష్యసి".

భగవంతుఁడా! తొలుత జ్ఞానము, తర్వాత విజ్ఞానముఁ జెప్పి, యిపుడు జ్ఞానఫల వర్ణనము చేయుచున్నావు. "విముక్తో మామువైష్యసి" జీవభావము వలన విముక్తి, పరమాత్మ భావమందు స్థితి, సర్వదుఃఖ నివృత్తి, ఆపైని పరమసుఖప్రాప్తి. ఇదే

జ్ఞానఫలము. విజ్ఞానము. దానికైన సాధనములు సన్న్యాసము, యోగము. ఇదే సంక్షిప్తోప సంహారము.

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః।
యే భజన్తితుమాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్॥ ౨౯

నేను సర్వభూతములందు సమస్వరూపముతో నే యుందును. నాకు ద్వేష్యుఁడు లేఁడు; ప్రియుఁడును లేఁడు. నన్ను భక్తితో భజించువారు నా యందుందురు. నేనును వారి యందుందును.

దేవా! తెలిసినది. సర్వకర్మములను "మదర్పణము" చేయవలయు నంటివి. తత్ఫలముగా మేము కర్మబంధ విముక్తుల మగుదుము. నేననెడి దేమనఁగా — నీవు ప్రతికూలమూర్తితో (అనఁగా రోగ శోక దుర్దశాదులైన యప్రియ మూర్తులతో) నెవరియెడ నిల్తువో, వారు నీ యీ మదర్పణయోగ మందు ధీరులై ముందడుగు పెట్టజాలరు. ఏమన, వారు నీ యప్రియరూపమునే చూతురు. అప్రియుఁ డవగుటచే నీయెడ భక్తి కుదురదు. మదర్పణమునుం గాదు. కనుక, నీ వెవరి యెడ ననుకూలమూర్తితోనే వెలయుదువో, వారి మాట వేఱు. వారు నిజముగ మదర్పణయోగమం దధికారులు కాఁగలరు. ఏమందువు ?

అర్జునా ! అదికాదు. నేను సర్వసముఁడ నంటినికదా. "నిర్దోషం హి సమం బ్రహ్మ" నేను బ్రహ్మమను, నేను పరమాత్మను; నే నీశ్వరుఁడను; నేనొక్కఁడను అద్వితీయ సచ్చిదానంద స్వరూపవస్తువను. ఎట్టి వైషమ్యమును నాయందు లేదు. కనుక నే

"సమః" అని నాకొక పేరు. సర్వభేదములును విలీనమైపోవు నచోట - ఆ పరమాత్మయందు - వైషమ్యశంక యెక్కడినుండి వచ్చును ? సర్వభూతములందును సమముగా విశుద్ధ చిన్మాత్ర స్వరూపముతో స్వప్రకాశముతో విరాజిల్లుదును. గాన నా కొకఁడు ద్వేష్యుఁడని, యొకఁడు ప్రియుఁడని యుండఁజాలఁడు. ఏలన, అహమ్ రూపమునఁ బ్రకాశించు వస్తువు — అనఁగా, అహమ్ అనుదానికి లక్ష్యార్థ భూతమైనవస్తువు - సమస్వరూపమే; కనుక, సర్వభూతములందు నదేస్వరూపమైన నా యెడ ద్వేష్యుడుకాని, ప్రియుఁడుగాని లేఁడు, ఉండఁజాలఁడు.

సరే; మఱి నాథా! యీ వైషమ్యమెట్లయ్యెను ? నీవే చూడుము. ఒకఁడు పల్లకి నెక్కువాఁడు; ఒకఁడు పల్లకి మోయువాఁడు. ఇంత విసదృశ సృష్టియా ?

అర్జునా ! ఈ వైషమ్యమునకు (హెచ్చుదగ్గులకు) హేతువు నేనుగాను సుమా. మేఘము సర్వత్ర సమముగానే కురియును. ఆవానతోఁ దడిసిన భూమినుండి పలుతెగల మొక్కలు, సస్యములు పుట్టుచున్నవి. ఆ విభిన్నతకు మేఘము కారణము కాదు. సూర్యుఁడంతటను సమముగానే రశ్మిదానము చేయుచున్నాఁడు. ఆ రశ్మిప్రభావముచేత నొకఁడు క్లేశపడుచున్నాఁడు. ఒకఁడానందించుచున్నాఁడు. ఈ విభిన్నతకు సూర్యుఁడు హేతువుకాఁడు. అట్లేనేను నున్నాను. సముఁడను సత్యస్వరూపాత్మను, నేను సత్తాస్ఫూర్తి ప్రదానము చేయుదును. జ్ఞానముచేఁ బ్రకాశమయుఁడను. వైషమ్యమున్నదేదో యది, నా సత్తచేతనే సత్తావంతమగుచున్నది. నా ప్రకాశము

చేతనే ప్రకాశించుచున్నది. ఆ వైషమ్యమునకు హేతువు నేను గాను. కనుక నాకుఁ బ్రియులనుచు ద్వేష్యులనుచు లేరు. నేను ఏకము, అఖణ్డము.

ప్రభువా! తెలిసినది. కాని యీ వైషమ్య మెక్కడఁ బుట్టినది? అది నాకుసరిగా నందకున్నది. నీవో, దయాలుఁడవు. సత్తాదానముచేసి, ప్రకాశింపఁజేసియే, సమత్వమును సరిగా నుంచితివి. కాని దీని బీజమెక్కడ నున్నది?

అర్జునా! అనాదియైన యవిద్యయే బీజము. అవిద్యా = అజ్ఞానము, ఆత్మస్వరూప జ్ఞానమును గప్పిపెట్టు (ఆవరకమైన) అజ్ఞానమనెడిపేర నొప్పు ఒక యనిర్వచనీయ వస్తువు. అది యున్నదనఁజాలము, లేదనంజాలము. దానివల్లనే ఇవి పుట్టుచున్నది.

అట్లైనచో, భగవంతుఁడా! నీవు అద్వితీయుఁడ వెట్లగుదువు? కాఁజాలవే; నీవున్నావు, అజ్ఞానమున్నది. రెండయి పోయినవే. అనెదవేమో - ఇదిగో, యీ యజ్ఞానమునకే మాయా, ప్రకృతి యని మాఱుపేర్లు. దానినే, ఇచ్ఛయన వచ్చును. కాని నా యద్వితీయత్వము నిరాకరింపఁబడ లేదు. ఏలందువా? అర్జునా! అజ్ఞానమునకు, యథార్థముగా నెట్టి సత్తయులేదు. నా సత్తవల్లనే దానిసత్త నా ప్రకాశమువల్లనే దాని ప్రకాశము. కనుక, స్వరూపముచేత నదియొకవస్తువు కాదు. నేనద్వితీయ సత్యస్వరూపుఁడను. సద్వితీయత నాకెన్నఁడు నుండఁజాలదు. తెలివికన్ను విడినంతదాఁక, ఇమ్మాటలు పూర్తిగా నెట్లును గ్రహింపఁజాలవు. కనుక విచారము నిప్పు

యోజనను. నీవూహించుకో, నేను స్వరూపవస్తువను, కనుక నాకు ద్వేష్యులు, ప్రియులు ననుచు నెవ్వరును లేరు.

స్వామీ! క్షమింపుము. ఊహింపఁజాలను. ఇంతకు మున్ను నీవేమంటివి? - సాధు పరిత్రాణమును దుష్కృతి వినాశమును జేయుటకు నేనావిర్భవింతునంటివి. దానిచే, నీవు దుష్టులను దమియించు వాఁడవును, శిష్టులను బాలించు వాఁడవు, నని యెఱింగితిని. ఇపుడిక్కడ - "నమే ద్వేష్యోఽస్తి నప్రియః" అనుచున్నావు కదా, ఇదేటిమాట - అవును, అజ్ఞునుఁడైపోయిన (శుద్ధసత్వగుణమయుఁడైపోయిన) వ్యక్తియెడ నిట్టి ప్రశ్నమే పుట్టదు. సాధారణ జీవులలోనే యిట్టి సంశయములు తల యెత్తును. చక్కఁగాఁ దెలియఁజెప్పెదను, విను - ఏ సాధకుని తెలివి యే తరగతిలో నడుచునో, ఆ సాధకునియెడ నేనట్టి భావముతోనే వెలయుదును. జ్ఞానప్రథమావస్థయందు సాధకుఁడు ఈ జగత్తున కేకైక నియంతయైన యీశ్వరుఁడను నేనే యని తెలిసికొనును. ఆ నియంతృత్వ జ్ఞాన ముండునంతదాఁక నేను నిజముగా దుష్టదమన శిష్టపాలక రూపముతోనే ప్రతి భాసించుచుందును. సాధకుఁడు మఱికొంచెము పైమెట్టెక్కి యనసూయుఁడై రాజగుహ్య యోగాధికారియైనపుడు, నా దోషములను గాంచు నెడ గ్రుడ్డివాఁడగును. అపుడతఁడు నా యందు జగన్నియంతృత్వమును సైతము కననొల్లఁడు కేవలము నన్నునే చూడఁగోరును. అపుడు నేను ఏమి చేయుచున్నానో లేదో కననొల్లఁడు. నేనప్పుడు వానియెడ నీ రూపముతోనే - యీ సమరూపముతోనే — "నమే ద్వేష్యోఽస్తి నప్రియః"

రూపముతో నే ప్రతిభాసింతును. సాధకుఁడు నాకుఁగడు సమీప వర్తి యైపోయినపుడు, మఱి నా యీవిశ్వ నియంతృత్వము నెడి మచ్చయును గానఁడు. అపుడీయవస్థయును వాని ప్రాణమునకు వెతను గలిగించును. అపుడతఁడు "నా కర్మఫలముగా నే యీ సుఖదుఃఖముల ననుభవించుచున్నా"నని తలంచును. "నా యనాదికర్మ సంచిత ఫలముగా, అవిద్యా ప్రభావముచేత, శిష్టుఁడనో దుష్టుఁడనో యైతిని నా యీ సర్వకర్మముల పుర స్కారమునో తిరస్కారమునో చేయుటకై నిన్నెందుకులాగుట? నీవు సముఁడవు, నీవు శుద్ధుఁడవు; నీవపాప విద్ధుఁడవు. నీవద్వి తీయుఁడవు. నిలునిలుము. ఊరక నిలువుము. ఒక్కసారి నిన్నుఁ గన్నార మనసారఁ జూచెదను." అనునిట్టి భావము సరిగా సాధ కునిలో నుదయించునపుడే, భగవంతుఁడు సమరూపముతో "నమే ద్వేష్యోఽస్తి నప్రియః" రూపముతోఁ బ్రకాశించును.

అపుడొక్క మాట - "యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్" భక్తితో నా భజనము నెల్లపుడు చేయువారు, సతతము నాయందే నిల్తురు. కను. నేనును వారి యందు విశేషభావముతో నే వెలయుదును. "మయా తతమిదం సర్వమ్" అయినను, "సమోఽహం సర్వభూతేషు" అయినను, భక్తిమంతులైన సాధకులతో నేను వీడిపోవుట యేనాఁడును గాదు. వారు నాయందును నేను వారియందు నీరీతిని విడక నిల్తుము. ఇఁక భక్తులు కానివారును, వాస్తవముగా నాయందే యున్నను, దాము సంతతము నాయందే యున్నట్లు తెలిసికొన లేరు. కనుక నేనెల్లప్పుడు విద్యమానుఁడనైనను (హాజరుగా

నున్నను) వారు నన్నుఁ గానఁజాలరు. నా సత్త నంగీకరింపరు, గాన నాయందు నిత్యమవస్థితులైనట్లు తెలిసికొనఁజాలరు. దీనిచే నేను వారికి దూరముగా నుందుననునట్లే తోఁచుచుండును. ఇట్టి తెలివిలేమియే కారణముగా, నభక్తులయెడ నుండియు నుండనటులే.

మఱి భక్తులో - లోను వెలిని నన్నే యెల్లప్పుడును దర్శించు హేతువున, నేనంతట విరాజిల్లుచునే యున్నానని తెలిసియే వర్తింతురు. కనుకనే, "మయి తే తేషు చాప్యహమ్" అంటిని.

ఇపుడు వినుమర్జునా! నీవీవిధముగా భక్తితో నా భజనము చేసిచేసి, యేకాన్త నికట వర్తివగునపుడు, నీయెడ, మఱి నేను "నమే ద్వేష్యోఽస్తి నప్రియః" రూపముతో వెలయను. "ప్రతిజానే ప్రియోఽసిమే" రూపముతోనే, వెలయుచుందును. అపుడు నేను ప్రతిజ్ఞచేసి, శపథముచేసి, "ఓ యర్జునా! ఓయి శిష్యుఁడా! ఓయి పుత్త్రుఁడా! నీవే నా ప్రియుఁడవు" అందును. నీవు నన్ను విశ్వరూపునిఁగా, గనుగొని; "మన్మనాః" యగుదువో, 'మద్యాజీ' యగుదువో యప్పుడే యీ మాటల సార్థకత నెఱుంగఁగలవు. భక్తిపూర్వక భజనము చేయుచున్న కొలఁదినే, మన యిరువురి యీ సంబంధము ఘనిష్ఠమైపోవును ఆపిదప, మనమిర్వురము నేకమైపోయినప్పుడే, నీవు నాకెంత ప్రియుఁడవైతివో నేను నిన్నెంతగాఁ బ్రేమించుచున్నానో, తెలిసికొనఁగలవు. నీవెపుడు నా సత్తయందే పూర్ణవిశ్వాసివైతివో (సత్యప్రతిష్ఠచేసి) నేనెవఁడనో యది నీ హృదయమందనుభ

వించితివో, యపుడే నేను "పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" యంటిని. అపుడు నీ హృదయమందు, విశ్వనియంతృ రూపముతోఁ బ్రతిభాసించితిని. ఈ పిదప, నా 'భాతి' విషయమున, శంక తొలఁగి, ప్రకాశాంశ సంధానమయినంత, నేనే యీ జగత్ప్రకాశకుఁడ నన్నమాట, చక్కఁగా దెలియఁగల్గితివో, యపుడే "సమోఽహం సర్వభూతేషు నమే ద్వేష్యోఽస్తి నప్రియః" అంటిని. తరువాత, నొకనాఁడెపుడు నీవు, నా ప్రియాంశమును సైతము ప్రత్యక్షము చేసికొనఁగల్గుదువో, యపుడే బలే; అస్తి, భాతిస్వరూపమిన్నాళ్ళకుఁ దలకెక్కినదని యనుభవింపఁ గలుగుదువు. అపుడు ఆ నేనే, ప్రియరూపముతోను బరమానంద స్వరూపముతోను వెలయుదును. అపుడే నేను నీకెంతటి ప్రియుఁడనో, నీవు నాకెంతటి ప్రియుఁడవో నేను నిన్నెంతగాఁ బ్రేమించుచున్నానో, నీవు నన్నెంతగా ప్రేమించుచున్నావో, తెలియఁగలవు.

నీవు వేఱు, నేను వేఱు, అయినంతదాఁక (అనుకొన్నంత దాఁక) యథార్థప్రీతి కలుగనేచాలదు. ఏకమై కేవలానందానుభవముతో స్వస్వరూపమందవస్థితుఁడవైనపుడే యీ ప్రీతి సంధానము లభించును. కనుక, నీమాటలన్నియు నిప్పుడే చెప్పను. ఆసమయము వచ్చినపుడు నీవే తెలిసికొందువు. సాధకా! మఱువకుమా – నీవు సత్యప్రతిష్ఠా సాధన సిద్ధినొందునంతదాఁక నీ కంటికి, దుష్టదమన శిష్టపరిపాలన విశ్వనియంతృ రూపముతోఁ గానవచ్చుచుందును. ఆ వెనుక, ప్రాణప్రతిష్ఠా

స్తరమందుఁ బ్రవేశించునపుడు, "నమే ద్వేష్యోఽస్తి" రూప మునఁ గందువు. ఆపైని, ఆనంద ప్రతిష్ఠాభ్యాసివైనపుడు, నేను నిన్నెంతగా ప్రేమించుచున్నానో కనుగొందువు. మఱొక్క విశేషము – నీవు జ్ఞాన భూమికయందు నిల్వఁగల్గినపుడే, లీలా తత్త్వమందుఁ బ్రవేశించు సామర్థ్యము గలుగును. ఈ జగ దుత్పత్తి స్థితి లయములు, నాయందే కేవల లీలావశమున, స్వాభావికముగా సంపన్నము లగుచున్నవనుటను జక్కఁగా దెలిసికోఁగల యోగ్యత కలుగును. నా లీలాతత్త్వమును జక్కఁగా దెలిసికొన్నపుడు, మఱల నీజగద్వైషమ్యముంగూర్చిన సంశయములు, ప్రశ్నములు పుట్టవు.

లీల యనఁగా నేమి? అఖండానంద స్వరూపమును అఖండ ప్రేమ స్వరూపము నైనదే, ఖండ ఖండానందమునకు ఖండ ఖండ ప్రేమమునకును దేవులాడునపు డదియే, లీల యనఁబడును. చూడు – హైకోర్టు జడ్జిగారు, లేదా, రాజుగారు, తమ సభా స్థానములను విడిచి యింటికి వచ్చి తమ మనుమలను ముద్దులాడి, వారికి గుఱ్ఱపు స్వారి మప్పు వేడ్కపుట్టి, తాము గుఱ్ఱములై, మోకాళ్ళు చేతులు నానుకొని, వీపుమీద మనుమల నెక్కించు కొనినపుడు, మనుమడు కొరడాతోఁ గొట్టుచు నభినయించు నపుడు, తాము నొప్పి నభినయింతురు. ఆ దృశ్యము నేమం దువు? దాని పేరే లీల. అచట మాననీయుఁడైన యా ప్రాడ్వి వాకుఁడో, రాజో, తాను గుఱ్ఱమైనను, దన న్యాయ కౌశల జ్ఞానమును, దన పరిపాలన కౌశలమును రవ్వంతయైనఁ గోల్పో యెనా? లేదు. సరిగా, నిటులే యానందమయుఁడనైన నాయందే

యీ విశ్వలీల సంఘటితమగుచున్నది. గాన నేను బద్ధుఁడను గాను. నేను నిత్యముక్త పరమానంద మయాత్మను. నా లీలను దెలియఁగల్గుట చేతనే, సుఖదుఃఖము లందును, హాసరోదనము లందును, పాపపుణ్యము లందును, స్వర్గ నరకములందును. నొక్కరీతి యానంద విలాసమునే కానిపింతును. కనుక వైషమ్య ముండదు. నేనే సర్వ రూపములతో సర్వత్ర యుండుటను జూడఁగల్గుటచే, మఱి వైషమ్యదృష్టి యెక్కడ నుండును ? చూడుము - ఒక్కఁడే యొక్కసారి (ఒకసమయ మందే) బహు మూర్తులను ధరించి యొకచోట నన్నమడుగుకొను చున్నాఁడు; ఒకచోట ధనవంతుఁడై ధనదానము చేయుచున్నాఁడు; ఒకచోటఁ బుత్రి శోకాతురుఁడై విలపించుచున్నాఁడు. ఒకచోటఁ బుత్ర వంతుఁడై యానందహాసము చేయుచున్నాఁడు. ఇన్ని విభిన్న వస్తుల యందును నొక్కఁడే యిట్లు వెలయుచున్నాఁ డనుటను నీవు స్మరింపఁ గల్గినచో, మఱెట్టి సంశయమును నుండదు. సరే ఏమయినను, ఆనందతత్త్వమందుఁ ప్రవేశించు నధికారము గల్గి నంతనే, యీలీలారహస్యము హృదయమందుఁ బ్రతిభాసించును.

అపిచేత్సు దురాచారో భజతే మా మనన్యభాక్।
సాధురేవ సమంతవ్యః సమ్యగ్ వ్యవసితోహి సః॥ 30

బహు దురాచార వ్యక్తియైనను, అన్యభజనమును మాని నన్నే భజించునేని, వాఁడు సాధువనియే తలంప వలయును. ఏలన, వాఁడిపుడు సమ్యగ్ వ్యవసితుఁడైనాఁడు. (నిశ్చయబుద్ధి సంపన్నుఁడైనాఁడు).

ఇదే గీతయందు భగవంతుని (శ్రీ)ముఖమునుండి వెలువడిన సర్వప్రధానమైన యాశ్వాసవాక్య, ఇదె జీవులవలెనున్న మనకు వినిచిన పరమాశావాణి.

అత్యంత దురాచారికైనను నన్ను భజించు నధికారయోగ్యతలు కలవు. నిక్కముగా ననన్యభాక్కుగా నుండి, నన్ను భజించు సామర్థ్యము సుదురాచారవ్యక్తికిం గలదు. "న అన్యం భజతే ఇత్యనన్యభాక్" నన్ను దక్క మఱెవ్వరిని అనఁగా నన్నుఁ దక్క మఱెవ్వరిని భజింపనివాఁడు. అనఁగా నా యాశ్రయమునే పొంది సేవించువాఁడు; "భజతేచేత్" అను మాటయందే భజించు సామర్థ్యము సూచింపఁబడినది. కొందఱు, "సుదురాచారికి భజనయోగ్యత లేదు. దురాచారిత్వము తొలఁగి సదాచారి యైనపుడే భజన చేయఁగలఁడు" అందురు. కాని యదెన్నఁడునుం గాదు. అట్లైచో భగవంతుఁడు "భజతే మామ్" అనఁడు. నన్నెఱుంగని వారును, నన్ను దుర్లభునిఁగా నెన్నువారును నెటులే ననుకొనన నిమ్ము. నన్నెఱింగిన వారును, ననుఁ బట్టుకొన్నవారును నిశ్చయముగా సుదురాచారవ్యక్తికిని, నన్ను భజించుటకును నన్ను ఆశ్రయించుటకును యోగ్యత గలదనే యందురు. అనేకులకు యోగ్యత లేదు; అది సరేకాని, కోరినయెడ నా భజనము చేయఁగలఁడు. ఎంతటి దురాచారియే కానీ, వాని లోపలినుండి నే నంతర్హితుఁడను కా లేదు. నేను వాని లోపలను వెలిని, బూర్ణముగా నెప్పుడును వెలయుచునే యున్నాను కనుక నన్నెఱింగి నావంకఁ జూపు మఱల్పఁ గలిగెనేని, వాఁడు నిజముగానే యనన్యభాక్కయి,

భజింపఁ గలఁడు. దురాచారియు, నన్నుఁజూచి, నన్నాశ్రయించి నన్ను భజింప మొదలిడునేని, వాఁడు సాధువనియే తెలియ వలయును. వాని యాచార వ్యవహార ప్రవృత్తులు, అసాధుజను లవి వలె నున్నను, వానిని సాధువుగానే మన్నింప వలయును. తుదకిపుడు వాఁడు సమ్యగ్ వ్యవసితుఁడై పోయినాఁడు వి + అవసిత = వ్యవసిత = విశేషముగా నవసానము నొందినవాఁడు. అనఁగా వాని బుద్ధి నాయందవసితమై పోయినది.

మున్నే "వ్యవసాయాత్మికా బుద్ధిరేకైవ" అని చెప్పఁబడి నది. వ్యవసాయాత్మికమైన బుద్ధియే యేకనిష్ఠ యగును. కట్టు బాటు లేని యింద్రియముల దారిని దేఁబడు విషయములను ప్రకాశింపఁజేయు పనియందే నిరతమై యున్నంత దాఁక, ఆ బుద్ధి వ్యవసాయాత్మిక కాదు. సరిగా నిశ్చయాత్మిక కాఁజా లదు. సంతతము చంచలమనః సంపర్కము వలన స్థిరబుద్ధియు జంచలమే యైపోవును. కాని యా బుద్ధియే యొక స్థిరవస్తు సంధానము నొందెనేని, దాని స్వాభావికమైన నిశ్చయాత్మిక భావము వికాసము నొందును.

నేను నిత్యస్థిర వస్తువను. నావైపు మఱలి నిల్చుటచే బుద్ధి వ్యవసాయాత్మిక యైపోవును. ఒకప్పుడు మెఱుపుఁ దళుకు వలె క్షణస్థాయియైనను, ఆక్షణమాత్రకాల సంస్పర్శము చేతనే యది (బుద్ధి) క్రమముగా ననతికాలమందే నిల్కడ నొందఁ గలదు. స్థిరభూమి నొక్కింత పొందినను బుద్ధి, కృతనిశ్చయాత్మిక యైపోవును, గానియది యట్లగుటయు దుర్లభమే. మనుష్యుఁడు ఎన్ని సాధనములో చేయుచుఁ దిరుగుచుండును. ఒక సాధువును

దొ_ల్త నాశ్రయించి, మఱలమఱియొకనిఁ జేయును. ఒక ప్రక్రియ నాశ్రయించి, యదికాదని మఱియొక ప్రక్రియ నాశ్రయించును. గాని, "మాం భజతే అనన్యభాక్" కాఁడు. కనుక వాఁడు సాధువుకాఁడు. పై చూపునకు "ఇతనికెంత తీవ్రపిపాస! ధర్మము కొఱకెన్ని పట్టాకలు పడుచున్నాఁడు" అనిపించును గాని, యది అసలు పిపాసా లక్షణమేకాదు. నిజమైన పిపాసయే యైనచో బుద్ధి వ్యవసాయాత్మిక తప్పకగును. అది వేఱేమాట.

ఇచట నొక్కటి తెలియవలయును — భగవంతుని భజించుటకుఁ గులాచార జ్ఞానాదుల, దేని యపేక్షయు లేదు. ఏ యవస్థయందే నుండనీ; ఎట్టి ప్రకృతి కలవాఁడేగానీ; అనన్య భాక్కులై నా భజనముచేయు యోగ్యత యెల్లరకుంగలదు. సరే, అటులేకానీ; దురాచారవ్యక్తియు భజింపఁగలడు; భజింపనీ; కాని వానిని సాధువునుగా నెన్నుటెట్లగును? నిందిత ప్రకృతి గలవారిని ప్రత్యక్షముగాఁ జూచుచున్నాము. వారిని సాధువులుగాఁ దలంచుట కాపట్యము కాదా? – కాదు, అటులుకాదు. నా భజనము చేయువానిని సాధువుగానే చూడవలయును. కారణమో?

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।
కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥ 31

ఆవ్యక్తి యనతి కాలమందే ధర్మాత్ముఁడై పోవును. శాశ్వతశాన్తి నొందును. కౌన్తేయా! ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను. నాభక్తుఁ డెన్నడుఁను ప్రణాశము నొందఁడు.

కుంతీతనయా ! సాధారణముగా నా భక్తుఁడు, దురాచారుఁడుగాఁ గానిపించినను, వాఁడు అత్యల్ప కాలమునందే ధర్మాత్ముఁడుగా మాఱును. అతని దురాచారిత్వము మఱి యుండదు. అంతేకాదు. నిత్యశాన్తియు నాతనికి లభించును. ఎన్నటికిని దొలఁగని శాన్తియే నిత్యశాన్తి. నేను నిత్యశాన్తి స్వరూపుఁడను. "యాన్తిమద్యాజినోఽపిమామ్" అని మున్నే యంటిని. మద్యాజియైనపుడు, మఱి వానియందు దురాచారిత్వ ముండఁజాలదు. మఱియు, నీమద్యాజులగుట, దురాచార వ్యక్తులకు సైతము సంభవమే. ఇదిగో, దేవయాజులు, పితృయాజులు, భూతయాజులు నైనవారి దురాచారము పూర్తిగాఁ దొలఁగిపోఁజాలదుగాని, (పోకపోవచ్చుఁగాని)మద్యాజులైనవారు శీఘ్రముగానే ధర్మాత్ములగుదురు. సందేహము లేదు.

ఇదెట్లు సంభవమగు నందువేని, బాగుగా నాలోచించి చూడుము. ఆత్మోపాసనము చేయువారు – నన్నే (నేనునే) యాత్మేశ్వరుఁడని యెఱింగికొందురు. కనుకవారు నామేని నంటిన మచ్చను జూచి నిక్కముగా వెతనొందుదురు. నన్నుఁ బ్రేమించు వారు నన్ను మలినమూర్తినిగాఁ జూచి యెంతో వ్యథితులగుదురు. నా యీ మలినతను దొలంచుటకై, కాతర ప్రాణముతో నాకే శరణాగతులగుదురు. అపుడు నేనును, మెల్లమెల్లగా మలినతా సంస్కారములను దొలంచుకొని, నా శుద్ధ మహత్స్వ రూపమును బ్రకటింపఁజొత్తును. కావున, దీనివలన సాధకుఁడు దురాచారుఁడై యున్నను శీఘ్రముగానే ధర్మాత్ముఁడగును. (క్షిప్రంభవతి ధర్మాత్మా).

పక్షాంతరమునఁ జూడుము —— దేవయాజులో, పితృయాజులో గానేయుండి, అనఁగా నేనే, యీ దేవ పిత్రాది రూపమున వెలయుచున్నాననుట తెలియక, ఆ దేవపిత్రాదుల పూజోపాసనములను జేయువారు. లేదా - అసద్దేవతా భక్తులైన వారనుము - వారి దురాచారిత్వము శీఘ్రముగాఁ దొలగఁ జాలదు. దురాచారవ్యక్తి తఱుచుగా దేవపితృయాజియే కాఁడు కాఁగలఁడన్నచో, అదియు దురాచారిత్వమును బెంపొందించుటకో, స్వార్థసిద్ధికో, లేదా యితరుల ననుకరించుటకో, యగును. వాస్తవముగా దేవపితృయాజులైనవారు తఱుచుగా సదాచార సంపన్నులే యఁగుచుందురు.

ఏమయినను, అన్యదేవతా భక్తులు, అవిధి పూర్వకముగా నుపాసనాదికము నెందుకు చేయుదురు ? ఎట్లు చేయుదురు? —— ఉపాస్యము, ఉపాసకుఁడును బూర్తిగా భిన్నులనెడి జ్ఞానముతో నుపాసింతురు, గాన వారి పశుభావము తొలఁగదు. శ్రుతియు, నిట్టి భేదజ్ఞాన సంపన్నులనే పశువులని పేర్కొన్నది.

ఇట్టి వ్యక్తు లుపాసించువేళ, స్వార్థపరబుద్ధి వలనఁ గలుషితులగుటయే తఱుచుగాఁ గానవచ్చును ఉపాసనాంతమందు వారి దురాచారిత, యథాపూర్వముగానే వెలయుచుండును. సరే, కేవలము నిరాశ నొంద నక్కఱ లేదు. ఈ విధముగాఁ జేయఁ జేయఁగాఁ జిరకాలమునకో, భాగ్యవశమున నల్పకాలమునకో మద్యాజి కాఁజొచ్చును. మద్యాజియే యైనపుడు మఱి భయము లేదు, ఎంత దురాచారి యైనను జిక్కులేదు. వాఁడు పరిశుద్ధుఁడు, పూతుఁడు నై పోవును. ఇదే నా కరుణా విశిష్టత.

ఈ కరుణ క్రమక్రమముగా వెల్లడి యగును. మొదటఁ దన ప్రకృతినే 'నేను' అనుకొనును. నేను సర్వభావాతీత సచ్చిదానందాత్మ నని సరిగా ధరింపఁ జాలఁడు. కనుక నా విశిష్ట ప్రకాశమును, అనఁగా, ప్రకృతికంటెనుం బరమైన వ్యష్టి ప్రకాశమును, నేనని యుపాసింప నారంభించును. జీవుఁడు తనయందు నా ప్రకాశమును, ఎంతగాఁ దెలిసికొన (అనుభవింప) గల్గునో, అంతగా లక్ష్యముంచి ప్రణామ వందన స్మరణ సంకీర్తనాత్మ నివేదనాదులను జేయఁజొచ్చును. ఇంతమాత్రము చేయుటయు, ఇటులు చేయుటయు, మిగుల దురాచారులైనవారి పక్షమునను సంభవమే. ఏమన, వారు మఱియొకరి గుమ్మముకడ నిల్వ నక్కఱ లేదు. తనలోనే యెంతగా నాప్రకాశము నొందునో, అంతగా దానియందే లక్ష్యముంచి దాని సాధనము నారంభించును. తన ప్రకృతినే యీశ్వరుఁడని, జగదీశ్వరుఁ డనియుఁ దెలియ నారంభించుటచేతను, ప్రత్యక్ష ప్రదానాదాన - రూప సాధన మారంభించుట చేతను, నిందిత ప్రకృతి తొలఁగిపోఁ జొచ్చును. ఈశ్వరత్వము నారోపించుటే దీనికి ముఖ్యకారణము. మాటిమాటికి నీశ్వరత్వము నారోపించుటచే, శుద్ధత్వము అపాపవిద్ధత్వము, మహత్త్వము మున్నగు గుణముల యనుచింతన మగుచుండును. దాని ఫలముగాఁ బ్రకృతియం దీసమస్తమైన యీశ్వరీయ గుణముల సమావేశము కాఁజొచ్చును. మఱి కొలఁది కాలమందే, ప్రకృతి సంబంధమైన నిందితకర్మానుష్ఠానమునకైన ప్రవృత్తి తఱిగి పోవును. దీనిచే "క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి" సంభవమగును.

ఈ విధముగా మద్యాజి కాక, అన్యదేవతా భక్తుఁడై పోయినచో, ధర్మాత్ముఁ డగుటకుఁ గడు విలంబమగును అది తప్పిన, శాశ్వత శాన్తికైన యాశ యాకాశకుసుమమే. అన్యదేవతా - ఆత్మదేవతా, యనువాని యభివ్యక్తిని గూర్చిన జ్ఞానము గలిగి, యాచరణమునకు రానంతదాఁక, ముక్తిమార్గ మందడుగు పెట్టుటే కాదు. ఇది జరిగినప్పటి మాటలే, అది.

ఇదిగో, యీ రీతి నన్యదేవతా మహత్త్వము ననుచిన్తనము చేయఁగాఁ జేయఁగా, ఆ స్థానము ఆత్మప్రకృతి మహత్త్వాదులచే యథార్థముగా నాపూరితము కావలయును. అయి నిర్మల జ్ఞానము కలుగకున్నచో, ఆరోప మారోపముగానే యుండిపోవును.

కనుకనే, కౌన్తేయా! నీవు సంకోచింపక రెండుచేతులెత్తి నీ ప్రతివాది సమావేశములకుఁ బోయి, స్వచ్ఛందముగా, "న మే భక్తః ప్రణశ్యతి, న మే భక్తః ప్రణశ్యతి" యనుచు, —

‘‘సోదరులారా! వినుండు; - భగవంతుని ప్రతిజ్ఞ - నా భక్తుఁడెన్నఁడును ప్రణాశము నొందఁడు; అన్యదేవతా భక్తులకుఁ ప్రణాశశంక కలదు గాని, మద్భక్తులకు ఏ విధముగాను నెట్టి యవస్థ యందును, ప్రణాశశంకయే లేదు. ప్రణాశ మనఁగా నదృశ్యుఁడగుట. అనఁగా (నాకన్నులఁ బడక) నా చూపులకు వెలియైపోవు నవస్థయే ‘ప్రణశ్యతి’ శబ్దార్థము. నా భక్తులకును నాకునుంగల సాక్షాత్సంబంధమందు నాశ మెన్నఁడును గాఁజాలదు. ఎంత దురాచారియే కానిమ్ము; ప్రతికూల ప్రారబ్ధకర్మ

ప్రాబల్యముచే నెన్ని జన్మములేనిఁ గానీ; నా చూపులనుండి తొలఁగిపోవుట కాదు" అని గట్టిగా చాటుము.

సరే; హృదయేశా! నీ స్నేహదృష్టికి వెలిఁబడిన జీవుఁ డెవ్వఁడును లేఁడా? - లేఁడు; అట్టివాఁడు లేఁడు. ఉండఁడు. ఇది ముమ్మాటికి సత్యము. కాని సత్యోపలబ్ధియైన ప్రాణులెందఱు న్నారు? ఈ సత్యలాభము నొందినవారు మాత్రమే తమపై నా స్నేహదృష్టి నిరంతరము నిర్నిమేషముగాఁ బ్రసరించుచుంట నెఱుంగఁగలరు. ఇంతమాత్ర మెఱింగి నపుడు, వారి చూపు సైతము నాయెడ సుస్థిరమే. కనుక నాచూపు వారిపైనే యనుట వారనుభవింతురు. ఇదే నాభక్తులకుఁ బ్రణాశ మెన్నడును లేదనుట.

మద్భక్తులు - అనుదాని యర్థము, కృష్ణభక్త లనియే. కృష్ణుఁడు = నల్లనివాఁడు, అని కూఁస్ఛన్న వారు కనిష్ఠాధికారులు. కర్షతి సర్వమితి కృష్ణః - అన్నిటిని (సృష్టిస్థితి లయములను) జేయువాఁడు; లయకాలమందు సర్వమును దనలోనికి లాగికొను వాఁడు; జీవులను స్వాభిముఖముగా నాకర్షించువాఁడు పరమాత్మ అని గ్రహింపవలయును.

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః।
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాన్తి
పరాంగతిమ్॥ 32

పార్థా! సర్వవిధముల నన్నే యాశ్రయించిన వ్యక్తులు, పాపయోని సంభూతులే కానిమ్ము. జ్ఞానదుర్బలలగు స్త్రీలే

కానిమ్ము; లాభాలాభములనే లెక్కించుకొను వైశ్యులే కానిమ్ము; అజ్ఞానాంధులైన శూద్రులే కానిమ్ము. (అనఁగా, అనధికారులేయైనను) వారునుఁ బరాగతి (ముక్తి) నొందుదురు.

కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా।
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్॥ 33

ఒక్క నాశరణము నొందఁగలిగినచోఁ బాపయోనులును, ముక్తి నొందఁగలరు. అది సంభవమే. పాపయోనలైన వారి ప్రవృత్తియుఁ గర్మములును బాపమయము లగుట స్వాభావికమే, కనుక వారి పక్షమునఁ బరాగతి లాభము కేవల మసంభవమే; ఏమనఁ జిత్తశుద్ధి లేక, యేవిధముగాను "మయా తత మిదం సర్వమ్" ఇత్యాది జ్ఞాన లాభము కాఁజాలదు. అది లేమిచే మాటిమాటికి జననమరణ లాభము తప్పక కాఁదగినదే. స్త్రీజాతి జ్ఞానదుర్బలము; గర్భధారణము, కౌమారభృత్యము (సంతాన పాలనము) మున్నగువాని వలన, వారి మనుగడ, మిక్కిలి భారాక్రాన్తము. గానఁ జిత్తశుద్ధి ప్రయత్నముల కవకాశము లేదు, గాన జ్ఞానగ్రహణ యోగ్యతయు నరుదే. ఇఁక వైశ్యులు - ఎల్లపుడును లాభనష్ట విచారమందే నిపుణులు. రవ్వంతేని లాభము కాసరాని పనియందు వారికి ముందడుగు పడదు. ఐహిక పారలౌకిక కార్యములందు విశేషలాభ మింతో, యంతో పొందక వారు ముందడుగు పెట్టరు. ఎక్కువగా దాన ధర్మాదులను జేయుదురు, కాని యదియుఁ దఱుచుగా స్వార్థ బుద్ధితోనే. ఆ బుద్ధి - ఇది మూర్గము; ఇది వస్తువు; ఇది లాభము; ఇది యల్పలాభము, అనువాని పైనే యుండును. అటే సాగుచుం

డుటచేత, మఱి నా యాశ్రయ మొందుట సాగదు. కనుక వారికి మోక్షద్వారము నిరుద్ధమే. ఇఁక శూద్రులున్నారు. వారి మాట చెప్పెడిదేమి? ఎంతసేఁపును భూమ్యాకాశముల గతులు చూచుచుఁ బశువులతో సమముగాఁ గాయక్లేశ మొందుచు, స్థూలపోషణ విధానములందే మగ్నులై యుందురు. కనుక వారు మూఢులు. అజ్ఞానులు. స్థూలముకంటె వేఱయిన వస్తువును ధరించు యోగ్యత వారికి లేదు. ఈవిధముగా మనుష్యజాతియం దెవరికిఁ బరాగతినొందు వెరవు లేదో, వారి యందును నా యాశ్రయమునొంది యుండు వారికిఁ బరాగతి లాభము సునిశ్చితమై పోవును. మఱి పుణ్యమయులైన, బ్రాహ్మణులు, భక్తులు, రాజర్షులైన క్షత్రియులు నైన వారిమాట యేమి చెప్పను! వారు సహజముగా నే, నన్ను ధరింపఁగలరు. గానఁ బరాగతియు వారికి లభ్యవస్తు వే.

భగవంతుని యీవాణి తాత్పర్యమును జక్కఁగా నవధరింపఁ గల్గునపుడే, వర్తమానకాల మందలి సర్వవిశృంఖలలకును మూలకారణము లై నవి సమూలముగాఁ బెల్లగింపఁ బడును. భారతీయ సమాజ మెంత చక్కని కట్టుబాటులతో సంపన్నమైనదో, దానియం దెంత గంభీర రహస్యములు నిండి యున్నవో యను నీ విషయమును రవ్వంత యాలోచించుట యిట నప్రాసంగికము కాదు.

ఏవ్యక్తి యెట్టి యవస్థయందున్నను, దాని యుద్దేశ్యము ఒక్క "నేను" అనఁగా భగవత్ ప్రాప్తియే కావలెయును. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులు, పాపయోనులు, స్త్రీజాతి,

మను నీ మనుష్య సంఘమును, ఏదోయొక భాగమునకుఁజేర్చి భగవంతుఁడు చూపెను. వీరెల్లరు నన్నుఁ గోరినయెడ నన్నొంద గలరనెను. జాతి; కులము; కర్మము, వ్యవసాయము, బుద్ధి మున్నగువాని యపేక్ష యింతయులేదు. నన్నుఁ గోరినచో నన్నొందఁగలరు. సర్వభూతములందును సమభావముతో నేనున్నాను, గనుక నాలేమి యెచ్చటనులేదు, గాన నన్నొం దఁగలరు. అనెను.

"దయామయా! అందఱు నిన్నొందఁగలరు. నీవు అందఱి యందు సమముగా నున్నావుకదా. మఱి యీ బ్రాహ్మణులు మున్నగు, నుచ్చనిమ్న (హెచ్చుతగ్గు) జాతిభేదములేల?" – అర్జునా! చూడుము, ఆ భేదముండును. ఈ విభిన్నతయే సృష్టి. విచిత్రసృష్టి చేయుటయే మూలవ్యక్త ప్రకృతియొక్క విశేష త్వము. ఇటుకాకున్నచో నాయానందలీల యెట్లు నడచును? నా "బహుస్యామ్" కామమెట్లు సార్థకము కాఁగలదు? యీ విభిన్నత యనాది సిద్ధము. ప్రలయకాల పర్యన్తము (న బహు స్యామ్ సంకల్పమగువఱకు) నుండును. ఈ వైచిత్ర్యము లేక జగత్తేయుండఁజాలదు. నీ వూరక చూచుచుఁబొమ్ము. ఈ యనంత వైచిత్ర్యమందు, సర్వభూతములందును నేను సమాన ముగా నున్నాను.

నేను "చాతుర్వర్ణ్యం మయాసృష్టమ్" చాతుర్వర్ణ్యము నా సృష్టియేయని మున్నే చెప్పితిని. కనుక, ఆస్తిక్యబుద్ధి సంపన్నులైనవారికి దీనిని బట్టుకొని విచారముచేయ నేమియు లేదు. ఇపుడొకమాట – ఈనాలుగు వర్ణముల యాచార

వ్యవహార సంబంధమునఁ గాలప్రవాహ పరివర్తనముతోఁ గూడఁ గొంత పరివర్తనము (మార్పు) కావలయును. కాఁగలదు. అందు హాని లేదు. చాతుర్వర్ణ్యము ప్రవాహ రూపమున నిత్యము నుండును. ఏ వర్ణమున కేవి కార్యములో యనునది యష్టాదశాధ్యాయమున వర్ణింపఁబడినది. దానినిట నొక్కింత విచారింతము. నెమ్మదిగా ముందునకుఁ బోవుదము.

ఈ స్వభావ జన్యములైన కర్మములచేత నీబ్రాహ్మణాది వర్ణములు నిర్ణయింపఁబడినవా ? లేక జన్మము చేతనా ? అనునది యిక్కాలమున నొకపెద్ద సమస్య విడవలసి యున్నది. మనము తొలుత రెండు ప్రకారములును స్వీకరింతము. ఒకటి పుట్టుకచేతనైన బ్రాహ్మణాది వర్ణము. రెండవది స్వభావజ కర్మగత బ్రాహ్మణాది వర్ణము. చూడు, జాతిచేత బ్రాహ్మణుఁడైన వానియందు, ఈ స్వభావజ కర్మములవలన బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనెడి నాల్గు ప్రకారముల భేదములను గనుచున్నాము. జాతి బ్రాహ్మణుఁడే నాలుగు తెగలయందును విభక్తుఁడు కాఁగలడు. స్వభావజకర్మగతుఁడైన బ్రాహ్మణుఁడే కర్మగత క్షత్రియుఁడు. కర్మగత వైశ్యుఁడు కర్మగత శూద్రుఁడును నగును. జాతి బ్రాహ్మణులందెవ డెల్లపుడు బ్రాహ్మణోచిత కర్మములతోనే కూడియుండునో వాఁడు జాతియందును, గర్మములందును బ్రాహ్మణుఁడుగానే లెక్కింపఁబడును. ఆ బ్రాహ్మణుఁడే క్షత్రియోచిత కర్మాచార సంపన్నుఁడైనచో, వాఁడు జాతి బ్రాహ్మణుడైనను, గర్మగత క్షత్రియుఁడే. ఇటులే కృషి వాణిజ్య గోపాలనాదులను జేయుచు వైశ్యభావాపన్నుఁ

డయ్యెనేని, వాఁడు జాతిచే బ్రాహ్మణుఁడయ్యును గర్మగత వైశ్యుఁడే. ఇటులే సేవాతత్పరుఁడైన జాతీయ బ్రాహ్మణుఁడు కర్మగత శూద్రుఁడే యగును. ఇటులే క్షత్రియ జాతియందును బ్రాహ్మణోచిత కార్యనిరతుఁడైనచో, వాఁడు జాతి క్షత్రియుఁ డయ్యును, గత బ్రాహ్మణుఁడే. వైశ్యకర్మిష్ఠుఁడైనపుడు, జాతి క్షత్రియుఁడయ్యును గర్మగత వైశ్యుఁడే. ఈ విధముగానే నాల్గు జాతులందును జూచుకొనునది. ఇకాలమందు నాల్గువర్ణము లందును, బదునాఱు భేదములు గానవచ్చుచున్నవి. పూర్వ కాలమందును నీ పదునాఱు భేదములుండ లేవన్నమాటలేదు. నాఁడీ భేదములనుబట్టి సమాజస్థితియందెట్టి విఘ్నములును వైపరీత్యములును వచ్చిపడలేదు. నేఁడు వాని లక్షణములు పూర్తిగాఁ వెలయుచున్నవి. మఱియు నీ పదునాఱు భేదము లందును అవాంతర భేదములెన్నోయైనవి. అది నిత్యము ప్రత్య క్షమే. ఒకజాతి బ్రాహ్మణుఁడున్నాఁడనుకో, వానికి బ్రాహ్మణోచిత నిష్ఠాచారాదులుండుటే కాక, క్షత్రియవైశ్యోచిత ప్రవృత్తియుఁ గలదు. వాఁడే శ్రేణిలోఁ జేరినవాఁడగును? జాతి క్షత్రియుఁ డొకఁడు బ్రాహ్మకర్మి, వైశ్యకర్మి, శూద్రకర్మియు నగుచో వానిమాట యేమందుము? వైశ్య శూద్రులందు సైతము, ఈ కర్మసాంకర్యము లేకపోలేదు. అనఁగా జాతి బ్రాహ్మణులందు గొందఱు బ్రాహ్మణులు, కొందఱు క్షత్రియులు, కొందఱు వైశ్యులు, కొందఱు శూద్రులు. అటులే, యొకవర్ణము వారి యందు, అన్యాన్య వర్ణోచిత కర్మప్రవృత్తి స్పష్టముగాఁ గాన వచ్చును.

ఈ విధముగా దొల్త, నే సాంకర్యము సమిష్టి భావమందుఁ గానవచ్చినదో, అదే యిపుడు వ్యష్టి భావమందును గానవచ్చుచున్నది. సరే, యీ విధముగా వ్యష్టి సమష్టులందు రెంటను, గర్మగత వర్ణసాంకర్యము కాఁగలదు, గాని దానిచే జాతి సాంకర్యము సిద్ధముకాదు. జాతికర్మములందు రెండిటను సాంకర్యము వచ్చిపడినచో నపుడు కర్తవ్యమేమి, యనునదే నిర్ణేయ విషయము.

భారతదేశముకంటె నితర దేశముల దృష్టాన్తమును జూపి, కొందఱు - ఆ దేశముల యున్నతికి, వారేకజాతిగా నుండుటే ప్రబల కారణమని నమ్ముదురు. నమ్మఁబల్కుదురు. ఈరీతిని జాతిఘటనము చేసినయెడఁ గర్మగత జాతి యైపోవును. సరే, 'జాతి' యనుమాటయే జన్మసంబధమును సూచించునది యైనను, మనము తర్కించి, జన్మగతజాతి, కర్మగతజాతి యను రెండు భేదములను స్వీకరించితిమి. మునుజెప్పిన జాతి ఘటనాత్తికి - సమష్టియందుఁ గర్మగతజాతి విభాగముచేసి, మనము ప్రప్తినొంద లేము. ఏమన, వ్యష్టిగత కర్మమును సైతము చూడవలయును. ఒక శూద్రజాతీయుఁడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య కర్మియగుచో, వాని నేజాతియందుఁ జేర్పనగు ? ననునిట్టి యవ్యవస్థ పరిహరింపరానిదై వచ్చిపడును. అది సమాజఘటన (ఏకస్థితి) పక్షమున విశేష విఘ్నకారి యగును.

సరే, "భారతముకంటె నితరములైన దేశములందుఁ గర్మగత జాతియున్నది. దానివలన హానియేమి ? యనఁగలవు. అనఁగా, నేఁడు చాకలిపని చేయుచున్న యొకవ్యక్తి, కొన్నా

ళ్ళకుఁ పిదప, విద్వాంసుఁడును ధనవంతుడును గాఁగల్గుచో, వాఁడు ఉచ్చశ్రేణిలోఁ జేరిపోఁగలడు. చేరిపోవును. ఇటులు కర్మగత జాతి విభాగము ఫలముగా, వారు నానాఁటికి సర్వ విధముల నున్నతినొందుచున్నారు" అని నీమాట – అదెట్లులు నంగీకరింపఁ బడఁజాలదు; సరిగదా, ఆ యా దేశమందలి మనీషు లును, విశేషజ్ఞులును, బలుసారులు పలుతావులందు, మన భారతీయ సమాజఘటన పద్ధతియొక్క శ్రేష్టతనే స్వీకరించి దాని ననుకరించుట కుద్యుక్తులైరి. సుదూర భవిష్యత్తునందు బరదేశములందు సైతము, ఈ ప్రాచీనతర నియమము ప్రచలి తము కాఁగూడదా? కూడదని రా జ శా స న ము న్న దా? అదెవ్వరు చెప్పఁగలరు? ఇటీవల డెన్మార్క్ దేశమందలి విద్యార్థులలో దంతముఖ రోగపీడితుల సంఖ్య యత్యధికముగా నుంటయు, భారతదేశ విద్యార్థులందట్టి సంఖ్య యత్యల్పముగా నుంటయుఁజూచి, యచ్చటి విజ్ఞానులు, భారతదేశ దంతధావన విధానమే, దంతముఖరోగి సంఖ్యాల్పతకు హేతువనియు, భారతీయులకుఁ దమకంటెను శీతవాతాతపకష్ట సహనశక్తిని, వారి వస్త్రధారణ విధానమే, ప్రసాదించుచున్నదనియు, విజ్ఞాన విమర్శదృష్టితోఁజూచి, మన దంతధావన వస్త్రధారణ విధాన ముల శ్రేష్ఠతను సకారణముగా బోధించి, తద్దేశీయులచే నవలంబింపఁజేయఁగొన్ని ప్రచారక సంఘములు పనిచేయు చున్నవని, యానడుమ వార్తాపత్రికలలోఁ జదివితిమి. కావున, జాతితత్త్వము సైతము పరదేశములందు పరివర్తనము నొంద వచ్చును. మనమేమి చెప్పఁగలము.

సరే; దారితప్పి దూరము పోవలదు. ఏమయినను, భగవంతుని మాట–గుణకర్మాను సారముగా నాలుగు వర్ణములును దనసృష్టియే యనికదా. చూడుము గుణకర్మములు (ప్రకృతి గుణములైన సత్త్వరజస్తమస్సుల కర్మములు) ముందా? జన్మము (సృష్టి) ముందా? మునుజెప్పిన భగవద్వాక్యముల వలన, గుణకర్మములే జన్మహేతువులుగా నిర్ణీతము లైనవనుట స్పష్టముగాఁ దెలియ వచ్చును. విచారదృష్టిచే సైతము నదియే సమర్థింపఁ బడినది. గుణకర్మములు బీజాంకురములవలె ననాదులైనను, వర్తమాన జన్మము వలన, గుణకర్మము లెట్లులుండెనో, యట్టి కులమందే జన్మమైనదని తోఁచును. పూర్వజన్మము నంగీకరింపని వాఁడు భారతీయ వైదికార్యజాతి కాఁడు. వానిమాట విడువవలసినదే. భారతీయ హిందువులుగాఁబరిచితులగువారెల్లరు, సాక్షాత్తుగానో, పరంపరగానో. జన్మాంతరమును విశ్వసించినవారే. కర్మానుష్ఠాన ఫలముగా జన్మప్రాప్తియైనట్లే, వేయి ప్రయత్నములు చేసినను, ఆమూలీభూత కర్మబీజములను దొలఁగించు నుపాయము లేదు. ఏమనఁగా వానిఫలమప్పుడేపండి సిద్ధమైనది. ఇపుడో – దేనివలన నిట్టి జన్మము మఱిరాదో, దాని కనురూపమైన ప్రయత్నమును జేయుటావశ్యకము. కర్మమువల్ల జన్మమును, మఱల జన్మముకాఁగాఁ గర్మమును దప్పక కావలసినదే. ఆ కర్మములను, భావిజన్మమందు బవిత్రకులమందును, జ్ఞాని కులమందును నగునట్టి భావముతో జేయవలయును. ఇదే సమాజస్థితిరక్షకు సరళమైన యుపాయము.

చెప్పెడి దేమనఁగా, — ఒక శూద్ర జాతీయవ్యక్తి బ్రాహ్మకర్మి యైనపుడు, అతఁడు ఈ జన్మమందే తాను బ్రాహ్మణుఁడనని బయలుదేరినచో, సమాజ విప్లవము సిద్ధమగును. మున్నే ఈ విషయమున దోషములు చూపఁబడెను. బ్రాహ్మణ కర్మియైన శూద్రుఁడు తనకు నిశ్చితముగాఁ బర జన్మము బ్రాహ్మణ కులమందే యగునని విశ్వసించుట యుచితము. అటుగాకున్న సమాజమందు విప్లవానిష్టములే ఫలము లగును.

అసలు మాట — ఈ దేశమందలి జాతి విభాగమునకు మూలములైనవి రెండు విషయములు. "అన్నము, యోని". అన్న విచారము, యోని విచారము, అను నీ రెండును జాతి భేదమూలములు. అనఁగా జాతీయజనులు (ఒకజాతివారు) తమ కంటె నిమ్న జాతీయుల యన్నమును ముట్టరు. వైవాహికసంబంధమును గలుపుకొనరు. ఈ రెండే యిక్కాల మందలి గురు సంసర్గములు. శాస్త్రమందు "యాజనం యోని సంబంధం స్వాధ్యాయం సహభోజనమ్" ఈ నాలుగు చెప్పఁబడెను. హేతువేమి? — సంసర్గము = దోషము. ఒండొరుల పాప పుణ్యములు, ఒండొరులయందు సంక్రమించు విషయమున నీ నాలుగే గొప్ప సంసర్గములు. అవే లక్ష్యమందుంచఁ దగినవి. మనుధర్మసంహితయందు, "ఏకత్రశయనము, ఏకత్రభోజనము, ఏకత్రోపవేశము, (కూర్చుండుట) ఏకత్ర బహుక్షణాలాపము, (చాలసేపు కలిసి మాటాడుట)" యను నాల్గిటివలన నొండు రుల పాపపుణ్యము లొండొరులకు సంక్రమించునని చెప్పఁబడి

నది. పాపము వలెనే పుణ్యముననుట తెలియవలయును. ఇవి మనూదిత ధర్మవాక్యములని మన్నింపఁదగుననుటకాదు. యుక్తి అనుభవము అను వానివలనఁగూడ నీ మనువాక్యము చక్కఁగా సమర్థితము. ఆధునిక విజ్ఞానవేత్త లీ విషయమునఁ బ్రత్యక్ష ప్రమాణమునుం జూపఁగలరు. గాన నధికము వ్రాయనేల ? సాంక్రామిక రోగిష్ఠమైనవాని సంసర్గమును దొలఁగి యుండక తప్పనట్లే సాంక్రామిక చిత్తవృత్తి గలవారితోడనుం దొలఁగి యుండక తప్పదు. ఘోర తామస వృత్తి సంపన్నులైనవారు వండిన యన్నమును గొన్నాళ్ళు తిని చూచిన యెడల దీని సత్యము పూర్తిగా బోధపడును. ఒక సాధు మహాపురుషుని సన్నిధిని గొంతకాలము విడువక కూరుచుండుటవల్లనే చిత్తమం దింతో యంతో సాత్త్వికభావ ముదయించును. ఈ విషయమం దాయుర్వేద శాస్త్రమును బట్టియు నెంతేని వ్రాయఁగలము గ్రంథకళేబరము పెరిగిపోవునని మానితిమి.

ప్రత్యేక మానుష శరీరముయొక్క నాలుగు వైపులను నొక జ్యోతిర్మయమండల మున్నది. ఇది ప్రత్యక్షవస్తువే గాని యనుమానయోగ్యము కాదు. సాధనము వలన నొక్కింత చక్షుష్మంతులైన వారికిది ప్రత్యక్షమే. ఈ జ్యోతిర్మండలము విభిన్న వర్ణ విశిష్టముగా నుండును. సత్త్వగుణప్రధాన వ్యక్తిది శుభ్రమండలము, రజోగుణ ప్రధానవ్యక్తిది, రక్తమండలము, తమోగుణ ప్రధానవ్యక్తిది కృష్ణవర్ణము గాను నుండును. ఇది సాధారణ నియమము. గుణముల సాంకర్యము (సంమిశ్రణము= కలయిక) వలన వర్ణములసాంకర్యమును నగుచుండును. ఇపుడు

విచారింపఁదగిన విషయ మేమనఁగా — ఒక్కింత శ్వేతవర్ణాభ మైన జ్యోతిర్మండలము గల యొక వ్యక్తి, ఘోరకృష్ణాభ జ్యోతిర్మండల యుక్తవ్యక్తితోఁ గూడియుండు నలవాటు పడె నేని, కొన్నాళ్ళలోనే యీశుభ్రవస్తువు లోపించిపోవును. మఱి తనకంటె నధిక శ్వేతమండలము గల వానినే కూడియుండు టలవాటయ్యేనేని, కొంచె కొంచెముగా క్రమముగా శ్వేతవర్ణ మధికము కాఁజొచ్చును.

జాతి భేదమందు, ఈ యన్న విచారము, ఈ యోని విచారము (వివాహాది) అసూయా విద్వేషములను బెంపొందిం చుటకుఁ గాదు. అసూయావిద్వేషములు బిందు మాత్రమైనను లేవు. ఆత్మరక్షయే యిందున్నది. నాల్గువైపులను జిన్న చిన్న మొక్కలను బెంచి కంచె వేసినట్లుండును. లేకున్న మేఁకలు మున్నగు పశుజాతులు తినివేసి నష్టము కలిగించును. ఆ కంచె కొన్నాళ్ళకు బాగుగాఁ బెరిగిన పైని, మఱి దానివైపు చూడఁ బనిలేదు. కంచె తనంతనే బలపడఁగా మఱి మేఁకలే కాదు, ఏనుఁగులైనను వాని మొదళ్ళకుఁ గట్టువడి పోవును. మఱి చెట్టె క్కెట్టె పోనియుఁ గాఁజాలదు. అటులే సాధారణ దృష్టికి, ఆ యన్న విచారము సంకీర్ణతను సూచించునదిగానే తోఁచును. అతని యన్నము తినరాదా? అతనితో నొక్క యాసనమునఁ గూర్చుండరాదా? యనునిట్టి వ్యవస్థలు గొప్పవనుకొనుటే సంకీర్ణ చిత్తలక్షణము. విశ్వజనకుని సంతానమొక్కటే. మఱి దానిలో జాతిభేదము లనునవి యనుదారా విధానము కాదా? యనుకొందురు. కాదది కాదు. వాస్తవముగా నివియున్నియు,

రక్షతొలఁగిపోవుగండ్లు. నిర్మలము కానంతదాఁక వెలుపలి ప్రవాహమందుఁ బడిపోయి కలుషితమైపోవు నవకాశము పూర్తిగాఁగలదు. కనుకనే యివి రక్షణము జాఱిపోవుగండ్లు. ఇంచుకంత తెల్లరంగులో దట్టముగా నల్లరంగు గలుపుచున్నచో ఆ తెల్లరంగు లేనిదేయైపోవును. సముద్రమంత తెల్లరంగులో గడియ గడియకు నల్లరంగుఁ గలుపుచున్నను దానికి వికారమే కలుగదు, సరిగదా, నల్లరంగే తెల్లఁబడిపోవును. అట్లే మనుష్యుఁడును విశుద్ధసత్త్వుఁడై పూర్తిగా బ్రహ్మస్వరూపమందుఁ బ్రతిష్ఠితుఁడు కాఁగల్గెనేని, మఱి జాతిభేదము, అన్న విచారము మున్నగునవి యుండవు. కనుకనే, ఉచ్చతర సాధకులు, పరమహంసలు, నైనవారికి, ఈ గండ్లేవియు యుండవు. సర్వాత్మబోధ ప్రతిష్ఠితుఁడు కానంతదాఁక, నన్నజాతి విచారములను మన్నింపవలయును. కానిచో నాత్మోన్నతిమార్గము నిజముగా నడ్డుపడి పోవును. ఇట్టి జ్ఞానము నొందియును సమాజములో నుండువారు "యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః। సయత్ ప్రమాణం కురుతే లోకస్తదను వర్తతే" యనెడి వాక్యము ననుసరించియే పరిచాలితులు కావలయును. ఏ యడవులనో పట్టిపోయిన సన్న్యాసులమాట స్వతంత్రము.

ఆహారశుద్ధి యగునేని సత్త్వశుద్ధి యగును. సత్త్వశుద్ధితోనే స్మృతి ధ్రువమగును. ఇది వేదవాక్యము. శ్రీ శంకరాచార్యులు, అన్నాహారమునే యాహారమన లేదు. ఇంద్రియములచేత నెట్టి విషయ మాహారించినను నది యాహారమే యనెను. ఇట్టి యాహారమును బరిశుద్ధముగా నుంచుటకొఱకే

సంసర్గవిచారము మిగుల నావశ్యకము. ధ్రువస్మృతిని గోరని - అనఁగా నాత్మ జ్ఞానాభిలాషులు కాని వ్యక్తుల కాహార విషయమున నెట్టి యావశ్యకతయు లేదు. ఏమనఁగా, దాని ఫలమైన ధ్రువస్మృతిని వారు కోరరు. సరేకాని, కేవల ధ్రువస్మృతి కొఱకై యాహారశుద్ధి ప్రయోజనము లేదు. సుఖమునకే దీని ప్రయోజనము. సుఖమన్నది మానవమాత్రునకు ముఖ్యవాంఛనీయము. ఆ సుగమును సైతము, ఆహారశుద్ధిపైనే నిర్భరము చేయును. చిత్తము ప్రసన్నము గాక, యెట్టి యవస్థయందును సుఖము గల్గదు. సుఖశాన్తులు మనః ప్రాణములను బట్టి యుండును. సరే యిపుడు చూతుము. మనఃప్రాణము లేమి వస్తువులు? ఛాందోగ్యశ్రుతి — "అన్నమయం హి సౌమ్య మనః। ఆపో మయో హి సౌమ్య ప్రాణః" యన్నది. పెరుగును జిలికినపుడు, దాని సూక్ష్మతమభాగము వెన్నగాను, నది నేయిగాను బరిణమించు నట్టులే, మన తినెడి యన్నము యొక్క సూక్ష్మతమాంశమే మనస్సుగాఁ బరిణమించును. అటులే జలము యొక్క సూక్ష్మతమాంశము చేతఁ బ్రాణము ఘటితమగును. కనుక నన్నజలము లెంతగా విశుద్ధము లగునో, యెంతగా సాత్త్వికభావము నొందునో, యంతగా మన మనఃప్రాణములును విశుద్ధములును సాత్త్వికములును నగును. ఆ మనఃప్రాణములు ప్రసన్నములుగా నుండుటచేతనే జగత్తునందు యథార్థ సుఖశాన్తులు గల్గును. ఇవి లభింపనపుడు పారత్రిక ఫలము మాటయే విడువ వలయును. అన్ని జాతుల యందును, అబాధముగా నన్నపానీయముల వ్యవహారము నడుపుకొనఁ బ్రయాసపడు

వారు, ఈ వేదవాక్యమునే మఱియొకసారి యాలోచించి చూచునది.

మ్లేచ్ఛదేశముగా భారతదేశమును బరిణమింపఁ జేయు నభిప్రాయముగలవారు, దీనిని భారతమనక, ఇండియాయనియో మఱేదే నొకపేరో పెట్టఁగలరు. కాని, దీనిపేరు "భారత" మనుట మఱువరాదు. "భాయాం రతాః భారతాః" భా=ప్రకాశాత్మక వస్తువునందు, అనఁగా నాత్మయందు రతాః = ఆసక్తిగలవారు. (ఆత్మవస్తూపాసన నిరతు లనుట) ఆత్మాభిముఖగతియే, యీ దేశమువారి స్వాభావికరీతి. ఆ గతిని నిరోధింపఁ బ్రయత్నించుట, అవివేకము, దౌర్జన్యము, చిన్నతనము ననక తప్పదు. మఱొక్కమాట — లక్షప్రయత్నముల చేతనైన, ఈ దేశపు భారతత్వమును దొలగింపఁ జాలరు. ఇచ్చట జాతి విచార ముండును; అన్న విచారముండును. కాలవశమున శిథిలము కాఁగలదు; అయిన మిగిలి యుండును.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥౩౪

నన్ను భజింపుమని మున్ను నెను. ఇపుడు భజన ప్రకారమును విశేషించి, నిశ్చితమగు దాని ఫలమును జూచి యధ్యాయము నుపసంహరించుచున్నాఁడు.

అర్జునా! నాయందే మనస్సుంచుము. నాయందే పరానురక్తి గలవాఁడవగుము. నన్నుఁ బూజించుశీలము గల్గియుండుము నాకు నమస్కరింపుము. (ఎల్లెడ నెల్లపుడు నా యీశ్వరత్వ

మునే కనుచు నా యనుగత్యము నంగీకరింపుము. యోగివై యీ నా చెప్పిన యుపాయములతోఁగూడి, "వాసుదేవః సర్వ" మనెడి విజ్ఞానము గల్గి, నన్నే యాశ్రయింపుము. పరమాత్మ వైన నన్నే చేరుదువు.

వెనుకటి శ్లోకములందొకచోట, "అనిత్య మసుఖం లోకమిమం ప్రాప్య భజస్వమామ్" అనెను. క్షణస్థాయివైన యీ లోకమందుండి నన్ను భజింపుము, పొందుము." అనెను. పొందెడి కోర్కె మానవ జీవనమునకు స్వాభావిక ఘటనము. మఱి, యీ పొందఁగోరెడిదేదో యది చిరస్థాయి యగుటయు నాకోరికకొక యంగము — మనుజుఁడు దుఃఖమును గోరఁడు. కాని సత్యమేమో — తాను ప్రాణాలొడ్డి ప్రయాసపడి, సంసార మందేమి లాభము నొందుచున్నాఁడో యది నితాంతము నస్థాయి; కేవల దుఃఖమయము. ప్రేమ స్వరూపుఁడు భగవం తుఁడు "ఓయి! మానవుఁడా! నీవు నిశ్చయముగా నీ యనవస్థ పట్టునుండి తప్పుకొనఁ గోరుదువేని, నిత్యము సుఖస్వరూపుఁడనైన నన్నే యాశ్రయింపుము. పరమాత్ముఁడనైన నన్నే భజింపుము జాగతములైన సర్వదుఃఖములయు, నశాన్తులయుఁ జేతినుండి విడివడు నుపాయములను జెప్పుచు "మాం భజస్వ" నన్ను భజింపుము అనెను. కాని, మనుజుఁడు నిత్యము నిరంతరము నలయకచేయు తపస్సంతయు జాగతిక వస్తులాభార్థమే. భగవంతు నుపేక్షించి, భగవంతునిఁ జేరు ప్రయోజనము నింతే నెఱుంగక, మనుష్యుఁడు తన దేహమనః ప్రాణములను జాగతిక వస్తువుల నొందుటకే యేల నియోగించుచున్నాఁడో, యది

భగవంతుఁడు తానే విశేషించి తెలియఁజెప్పినాఁడు. "అజ్ఞానే నావృతం జ్ఞానం తేనముహ్యన్తి జన్తవః" అజ్ఞానము చేతనే సత్యజ్ఞానము కప్పివేయఁబడును. గనుక మనుష్యుఁడు విషయ సుఖములందే విముగ్ధుఁడగుచున్నాఁడు. జీవుని సర్వదుఃఖము లును నజ్ఞాన మూలములే ఈ యజ్ఞానము తొలఁగనంతదాఁక జీవనగతియందు సత్యపరివర్తనమే కానఁబడదు. కనుకనే జగత్సంబంధియైన యేయజ్ఞానము నాధారముచేసికొని, మనుష్య జీవన వ్యవహారము నడుపఁబడుచున్నదో, దానినేచూపి, భగ వంతుఁడు శ్రీకృష్ణుఁడు, అన్నిటికంటెముందు, ఆ భ్రాన్తదృష్టి పరివర్తన ప్రయోజనమునే నిర్దేశించినాఁడు. సాధారణుల జీవ భావీయ దృష్టికి, ఈజగత్తుయొక్క వ్యష్టిసమష్టి భావమందు, ఏది యెటులు ప్రతిభాతమగునో, యది పూర్తిగా జగత్తుతోడి సత్యపరిచయమే కాదు. జగత్తుయొక్క ప్రత్యణు పరమాణువు నందును, శక్తియుఁ జైతన్యమును, నవినాభావముగా నేకాధారముతోనే యున్నవి. కనుకనే, మనుష్యుని సాధారణ దృష్టికి, ఒకచోట శక్తిస్ఫురణమును నొకచోటఁ జైతన్య స్ఫురణ మును గానవచ్చుచున్నవి. భగవంతుఁడు – "శక్తిరూపముతోను జైతన్య రూపముతోను నీకీ జగత్తునందెక్కడ నేది కాన్పించి నను, ఆ సమస్తము నేనే" యనెను. వస్తువునందేని, వ్యక్తి యందేని, గర్మమందేని, భావమందేని, జీవనమందేని జ్ఞానమందేని నన్నువిడిచి యన్యమైనది, వేఱయినదేదియు లేదు. "మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ" నన్నుఁదప్పించి మఱియొక టేదియులేదు." "మయా తతమిదం

సర్వం జగదవ్యక్తమూర్తినా'' నేనే యవ్యక్తమూర్తితో సర్వవ్యాపినైయున్నాను." ఇదే జ్ఞానము. జగత్తు నన్యముగాఁ జూచుటయుఁ దలచుటయు ననునదే యజ్ఞానము. అజ్ఞానాంధులు నన్నుఁ గన్నులతో జూచుచుండియుఁ బోల్చుకొనరు. మఱి, జ్ఞానచక్షువులు సుకృతి సంపన్నులు నైనవారు, వాసుదేవుఁడే సర్వరూపములతో నున్నాఁడనెడి జ్ఞానముతో జ్ఞానవంతులై కేవలము నన్నే యాశ్రయింతురు.

అజ్ఞానమునుండి జ్ఞానలోకమునఁ బ్రవేశించుటకు మనుష్యుల కొక్కటే యుపాయము. జ్ఞాని జనుల జ్ఞానము నంగీకరించి, యనుసరులగుటయే. ఈ విషయమున మఱి గతిలేదు. ఏవస్తువు వాస్తవముగా నెట్టిదో దాని నట్లే గ్రహించుటయు (తెలిసికొనుటయు) దాని ననుసరించి వ్యవహరించుటయు జ్ఞానలక్షణము. జ్ఞానదృష్టిచే జగత్తనఁగా నేమో యాతత్త్వమునే భగవంతుఁడు పార్థునకుఁ జెప్పెను. శ్రీగురుదత్తమైన యీ జ్ఞానదృష్టిచేఁ అర్జునుఁడును, గల్యాణకాములైన మానవు లెల్లరును దమతమ యజ్ఞానమును దొలుతొల్త నజ్ఞానమని తెలిసికొని, యా పిదపఁ గ్రొత్తగావచ్చిన జ్ఞానము తోడుగా, భావముచేతను కర్మముచేతను జగత్తుతోఁ గ్రొత్తసంబంధమును నిల్పుకొనుట యందు వేష్కపడుదురు గాక. ఇదే యీ యుపదేశము నుద్దేశ్యము.

మనుష్యుల సాధారణ వ్యవహారమందు సైతము, ఒక విశిష్టవ్యక్తిని సర్వసామాన్యునిఁ గాను, అగణ్యునిగాను దలఁచి, యెల్లరును దదను రూపముగానే వానితో వ్యవహరింతురు. మఱి, కాలక్రమమున నా యగణ్యవ్యక్తియే యసాధారణుఁడని

మానవు లెఱింగి నపుడు, సమాజము నందలి నిర్మలచిత్తులు, ఈ క్షేత్రపరిచయముతోనే వానిని గౌరవించి, క్షేత్రదృష్టితో జూచుచు, వాని స్థానమునకుఁ దగిన మర్యాదలను బాలించుటకు మఱి సంకోచింపరు. జగద్గురుఁడు భగవంతుఁడు, అజ్ఞానాంధు లైనవారికి, జగత్తుతోడి సత్యపరిచయము నుద్ఘాటించి సత్యాన్వేషు లైనవారి జగత్సంబంధ భావములందును, వ్యవహారము లందును ఆమూలపరివర్తనము చేయఁగోరుచున్నాఁడు. జగత్తును జగన్మాత్రము - విషయమాత్రము - అని తలఁచినచో, అనిత్యతయు అసుఖము మాత్రమే ప్రాప్తించును. దీనికి బదులుగా, ననన్యచిత్తులై సర్వత్ర సర్వదా నన్ను (నేనును) ఆత్మను - భగవంతుని జూచుట కలవాటుపడిన యెడల, భగవంతుఁడు తానే మనుష్యులకు సులభుఁడై పోవును. భగవద్భక్తుల దైనందిన జీవన యాత్రా కార్య పర్యన్తము, భగవంతునితోఁ బ్రత్యక్షముగా నిచ్చిపుచ్చుకొను పనిగా సమాప్తమై పోవును.

ఓ యర్జునా! ఓయి, మానవుఁడా! ఆ యత్యాశ్చర్యమును వరేణ్యమునైన యవస్థ నొందఁగోరుచున్నావా? ఈ నిత్యసత్యము యొక్క యాకర్షణమే యుబికివేచెనేని, ఆ పరమ లాభమునకైన కర్మకౌశలము "మన్మనా భవ" విన్నావా? జగత్తు నా మూర్తిమంతమైన విగ్రహమే, యను సత్యమును వ్యవహారము ద్వారా పొందుటకుఁ బ్రయత్నింపుము. నన్ను (నేనును) విడిచి మఱియొక వస్తువు లేదు. వ్యక్తియు లేఁడు. వస్తువుయొక్క వాస్తవత నేనే; వ్యక్తియందు నాయభివ్యక్తియే (ప్రాకట్యమే) గాన, మఱి నీ సర్వభావనలు నా భావనలే

యగును. నీ సర్వేంద్రియములును, మనస్సు, బుద్ధియు నిరంతరము నా వార్తలనే మోచి తెచ్చుచున్న వనెడి సత్యమందు నమ్మకముంచి, నన్నే యన్వేషింపుము (వెదకుము). నన్నొందఁ గోరుకొనుము. జగత్తును నేనని వ్యవహరింపుము. జాగతిక చింతలతోను విషయభావనలతోను నీ మనసు నిండిపోయినది. ప్రతి కర్మము నందును నన్వేషించుటచే, నన్నొందఁగోరుటచే, నీ సర్వచింతలు నీ సర్వభావములును, నా చింతలు నా భావములుగానే పర్యవసించి పోవును.

"మద్భక్తోభవ" నీవు భగవద్భక్తుఁడవగుము. నన్నుఁ బ్రేమింపుము. వస్తువుల యెడను, వ్యక్తులయెడను నగు, ఆకర్షణమే, యాసక్తి యనుపేరఁ బరఁగును. ఆ యాకర్షణమే యాత్మాభిముఖమై భక్తిరూపమైపోవును, మనుష్యుల మనస్సులందు విషయ చింతాధార తెఱపిలేక సాగుచుండును. విషయ చింత స్వతః కష్టసాధ్యమైనయెడ, మనుష్యుఁడు తన బహుళ చింతాభారమును మోయనేచాలఁడు. భావనా ప్రవాహము తనంతటనే నిల్చిపోవును ఆ బరువు మిక్కుటమైనపుడే 'నాతల పనిచేయకున్నది' అనియేడ్చును. విషయచింతకిదే సహజగతి. ఇటులే సాగుచుండును. ఏమనఁగా, విషయములయెడ విషానసాకర్షణము, ప్రియత్వము కారణములు, మనసు నెదుట, విషయ రూపమున ఆకర్షణీయమును ప్రియమునునైన వస్తువున్నంత వఱకు విషయచింతయు దుర్నివార్యమే, యగును. దీనిప్రక్కనే యాత్మచింత – భగవచ్చింత, ధారగా నడుచుచున్నదనుకో, అప్పుడును, అది శిథిలమైపోవును.

ఈవిషయాశక్తి చేతినుండి విడివడు నుపాయమును భగవంతుఁడు చూపినాఁడు. అదే "నన్ను ప్రేమింపుము" నీ వింతకాలమును శబ్దస్పర్శరూపరస గంధములందు, ఏ విచిత్ర రసము నాస్వాదించితివో, నీవు తలిదండ్రులు, బంధువులు, స్వజనము నను వారియందైన యే వ్యక్తిత్వముచేత నాకర్షింపఁ బడి ముగ్ధుఁడవైతివో, యా సర్వాన్వేషణమును నాదే. సర్వ మధుర రస సంపర్కముగా నున్నది నా స్పర్శమే. ఆ సర్వవస్తు వ్యక్తులయందు నంతర్యామిని నేనే. మధువును నేనే. నీ యను రాగ బంధనముతో జగత్తును బంధించు చున్నావు, గాని నీవు ప్రతిజన్మమందును విఫలకాముఁడ వగుచునేయుంటివి. వాస్తవ ముగా నీవు, తెలిసియో, తెలియకో, నన్నే పొందఁగోరుచుఁ బరువులెత్తుచున్నావనెడి సత్యమందు విశ్వాసముంచి, యిటుపైని నీయనురాగమును నావైపే ప్రవహింపఁజేయ నిరంతర ప్రయ త్నము చేయుము.

"మద్యాజీ భవ" నన్నుఁ బూజింపుము. నీవు చేయు దేవపితృ యజ్ఞములందు దేవతారూపముగాను, పితృ రూపము గాను సాధారణ ప్రాణివలె భిన్నభిన్న నామములతోను, భావములతోను నా పూజనే చేయుచున్నావు. ఇంతే యను కొనుము. సర్వయజ్ఞ భోక్తను, సర్వయజ్ఞ ప్రభువను నేనేయని తెలిసికొంటివా ! నన్ను, నాది యని యెఱుఁగక యే ఆత్మయని స్వీకరింపకయే, యజ్ఞమో, యేదోపూజయో, యొక వస్తువను విధిప్రకారము శ్రద్ధతోనే యగుచున్నను, నీకాత్మజ్ఞాన దృష్టి వెలితియైనను, అవన్నియు నవిధి పూర్వకముగా నా పూజలే

యగుచున్నవి. కాని, వానివలన నీకు సంసారనివృత్తి కాఁజాలదు సర్వ దేవరూపములతోను, పితృపితామహాది రూపములతోను సర్వ భూతములందును (ప్రాణులందును) బహురూపి నారాయణ రూపములతోను, నేనొక్కఁడనే వెలయుచున్నాననెడి మాట తెలిసికొని, మన్నించి, నీ వీ జగత్తునందు నామరూపములయెడ సాధారణ దృష్టితో నానాత్వ బహుత్వముల నంగీకరింపక సర్వ రూపములందును, సర్వ భావములందును, నీవు అద్వితీయుఁడ నైన నన్నే యుపాసింపుము.

మనము పూజా యజ్ఞాదులన్నంతనే, విశేష విశేష కర్మానుష్ఠానములే యనుకొందుము, గాని వానిలో భగవంతుఁడు 'మద్యాజీ భవ' యని, యవన్నియు నాతని పూజలే యతని యజ్ఞములే, యని వానిని నిర్దేశింపలేము. రాజగుహ్యయోగ సారమైన మాటను మొత్తముపైని భగవంతుఁడు "యత్కరోషి, యదశ్నాసి, యజ్జుహోషి......తత్కురుష్వ మదర్పణమ్" అని చెప్పివేసినాఁడు, నీ భోగములు మొదలుగా యజ్ఞ పూజానామములతోనగు సమస్త కర్మములను నీవు నా యందర్పింపుమనెను. అంతకుమున్నే, "యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్రలోకోఽయం కర్మబంధనః" యజ్ఞముకంటె వేఱనెడి యేకర్మముచేతనైనను మనుష్యుఁడు బంధనదశనే పొందును, అనిచెప్పివేసినాఁడు. కనుక, యజ్ఞనిర్దేశము గీతయందు సర్వత్ర శ్రీ భగవంతుఁడు తానే చేసివేసినాఁడు, "తదర్థం కర్మ యజ్ఞమ్" తత్ – భగవంతు నుద్దేశించి చేయఁబడు కర్మమే యజ్ఞము. కనుక మన పితృకర్మములు శ్రాద్ధములు 'తద్దిన

ములు' అని వ్యవహరింపఁబడు చున్నవి. తత్ + దినము, ఆ నా తండ్రినో తల్లినో తాతనో యుద్దేశించి చేయఁబడు కర్మమున కైన దిన మనక, ఆ రూపముతో నున్న భగవంతు నుద్దేశించి చేయఁబడు కర్మమే యని తెలిసికొని, తత్కర్మప్రణాళియందు మన ముచ్చరించు మంత్రములన్నియు, నాత్మజ్ఞానప్రదములు గా నెఱింగి, శ్రాద్ధాంతమందు "బ్రహ్మార్పణం, బ్రహ్మహవిః, బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం। బ్రహ్మైవ తేన గంతవ్యమ్ బ్రహ్మకర్మ సమాధినా" యను వాక్యముతో నంతమగుదానిని బ్రహ్మసమాహిత బుద్ధితో నాచరించినపుడే, యథార్థశ్రాద్ధమై మనము చూపినశ్రద్ధ భగవజ్జనార్దన ప్రీతికరమగును. కావున భగవంతు నెడ లక్ష్యముంచక, పూజాయజ్ఞము లనెడి పేరితో జేయఁబడు నెంతగొప్ప యనుష్ఠాన మైనను సాధారణ కర్మ మాత్రమే.

ఆత్మచింత - భగవచ్చింత, మనసునందు మాత్రమే యాబద్ధమైనది. ఆ మానసిక చింత ననుసరించి కర్మానుష్ఠానము కాకున్న యెడ, నది వంధ్యచింత. దాని ఫలముగా మనుజుని జ్ఞానస్థానమం దనుమానము తగులుకొని మిథ్యాసంతోషమును దెచ్చి పెట్టును. ఇట్టి యనుమానాశ్రిత భగవద్భక్తి యతిశీఘ్రముగా నొక జటిల విహ్వలతగా నై పోవును. సత్యమునకై దేవులాడు మానవసంతానము నిట్టి జటిల విహ్వలతాగర్తమందుఁ బడి పోకుండఁ గాపాడుటకే ప్రేమస్వరూపుఁడు భగవంతుఁడు "మద్యాజీ భవ" యనుచున్నాఁడు. నీ జాగతిక నిత్యకర్మము లందును నీ సర్వవ్యవహారములు సైతము నాతోడనే కావల

యును. నీవు లోనువెలిని జూతువు, వింటువు, గ్రహింతువు, మైత్రి చేయుదువు, పగగొందువు. ఇట్టి సర్వకర్మములందెల్లెడను నేనే ప్రత్యక్షముగా నున్నానని యెఱుంగుము. నాయెడనే లక్ష్యముంచి, నీవు శత్రుతనే కొనుము; మిత్రతనే కొనుము. అపుడా సమస్తము యజ్ఞపదవాచ్యమే యగును. ఏలన, — నాకై మనుష్యుఁడేమి చేయనీ; అదే యజ్ఞము. అదే పూజ.

"మాం నమస్కురు" నాకే నమస్కరింపుము. సాధారణముగా మనుష్యుఁడు ప్రభుత్వమునకు, మహత్త్వమునకు నమ్రుఁడగును. మోహాచ్ఛన్నమైన యజ్ఞానదృష్టి, యీప్రభుత్వ మహత్త్వ విగ్రహములను జూచి వాని కాళ్ళకడ నమ్రమగుచున్నది. భగవంతుఁడు, "జగత్తునందు నేనొక్కఁడనే ప్రభువను; కర్తను; నేనే "మహతో మహీయాన్" అని తెలిసికొని, సర్వ ఘటనములందున్న నాకే (నేనునకే) నమస్కరింపుము. నీ వెచట నేని దలవంచుము. ఆ నీసర్వప్రణతులకును, పరమపద లక్ష్యము కావలయును అనెను. "ఏవమ్ యుక్త్వా" ఈ విధముగా నీవు చింతాకామన లందును, కర్మజ్ఞానము లందును, నన్నుఁ గూడుటచేతనే, యథార్థముగా మత్పరాయణుఁడవు కాఁగలవు. సర్వవ్యాపినై సర్వరూపములతో నున్న నా భావనమునే నీవు చేయుము. సర్వరూపములుగాను, సర్వవ్యాపిగాను, నన్నే సంభావింపుము. సర్వకామనలకు నేకీమాత్ర లక్షముగా నెంచి, నీవు నన్నొందఁ గోరుము."

"మనుగడయందగు సర్వకర్మ వ్యవహారములును, నతని వల్లనే నెఱవేఱుచున్నవి. అతఁడే మహాన్; అతఁడే విరాట్;

విశ్వకర్మములకు నతఁడే కర్తయు, విధాతయు నని బుద్ధితో నే పోఁగాఁబోఁగా, సత్యము (భగవంతుఁడు) నీ యెదుట మూర్తీభవించి నిల్చును. ఏమన, సర్వత్ర సత్యమే విరాజిల్లుచున్నది. ప్రాణమే (చైతన్యమే) సర్వత్ర ప్రతిష్ఠితమై యున్నది. అదే విశ్వానందమయ విగ్రహము." ఈనిశ్చయముతో నీ పరమపద ప్రాప్తికైన కోరికయు, దదనురూప ప్రయత్నము నేనాఁడును వ్యర్థములు కావు. నీవు నా యుపదేశించిన కర్మ కౌశలమును శ్రద్ధతో గ్రహించి, జీవనమందు నన్నొందుటకే సప్రయత్నుఁడ వగుము. అయితే, నీవు సత్యమని దేనిని మన్నించి సాగుదువో, దాని నచిరకాలమందే సత్యాసత్యమని తెలియఁ గల్గుదువు. "సర్వం ఖల్విదం బ్రహ్మ, ఆత్మైవేదగం సర్వమ్, వాసుదేవః సర్వమ్'' మున్నగు మహావాక్యములు, మఱి నీకుఁ గ్రొత్తలు, వింతలును గాక వాడుకమాటలైపోవును. నీమనశ్చింతల నెంతగా మూర్తిమంతములుగాఁ గాంతువో, నన్నొందుటకై నీకోర్కె యెంతగా నా వాస్తవ రూపమును స్పృశించునో, నాయేక కర్తృత్వ సర్వమయత్వములు నీస్వతః సిద్ధ జ్ఞానముగాఁ బరిణమించునో, యంతగా నే నీవు నన్నే నీ జీవనమున కేకమాత్ర గతి యని తెలిసికొని యేకాన్తభావముతో నన్నే యాశ్రయింతువు.

ఈ విధముగా నీమనః ప్రాణ జ్ఞానములు, నీ సర్వ భావములు, కర్మములు, ఆత్మాభిముఖములై యుండుటకే యెప్పుడలవాటు పడునో, యపుడే నీవు జీవన చరమ సాఫల్యముగా నిశ్చయముగా నన్నే చేరిపోదువు.

ఈ సంసారములో నీవు సుఖమును గోరుకొని, దుఃఖము నొందుచున్నావు. నా చెప్పిన కర్మకాండము నవలంబించుటచే నీవు సత్యాసత్యముగా నాయందు యోగయుక్తుడవై పోదువు. తెలిసియో తెలియకో పలుజీవనములందు, ప్రతి వస్తువునందు ప్రతి వ్యక్తియందు, నాకై (ఆత్మకై) వ్యర్థాన్వేషణము చేసితివి వస్తురసమందు, వ్యక్తిత్వ పౌరుషమందు, ఏ నా మాధుర్యము నిన్ను నిరంతర మాకర్షించినదో, ఇతి దేని సత్యము, సాన్నిధ్యము, నీకింతకుముందే నాడునూ లభింపలేదో, ఏనేను సర్వమందు న్నేనై, యంతయు నాదైయున్నను ఇంతదాక క్షుద్రమైన నేనుగాను, క్షుద్రమైన నాదిగాను నైపోతినో, ఏనేను నీలోపలనుండియు వెలియైపోయితినో, హృదయమందేయుండియు గడుదూరమై పోతినో ఏనేను నీ కేకమాత్ర ప్రియుడను ప్రియతముడనయ్యు, నీకు దెలియని క్రొత్తవాడనైపోతినో, ఆ సచ్చిదానంద రూపుడనైన నన్ను, సర్వాత్మనైన నన్ను, విశ్వాత్మనైన నన్ను, సర్వాంతర్యామి మహేశ్వరుడనైన నన్ను, సర్వఘటములలోను నేను (అహమ్) రూపముతో, నా (మమ) రూపముతో, జీవన రూపముతో నిత్యజ్యోతినై వెలయుదునో భూతేశ్వరుడెవడో, ప్రాణేశ్వరుడెవడో, సర్వము నెవనిదో, సర్వము నెవడో సర్వమునకు సర్వమెవడో ఆ పరబ్రహ్మమును ఆ పరమాత్మను, ఆ పురుషోత్తముని, ఆ భూమను, అహంమయుని నన్నే నీవు పొందుదువు.

ఓమ్, పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥
ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

—o—

# ఆధ్యాత్మిక సాధక లోకమునకు అపూర్వావకాశము

శ్రీకాకుళవాసి, శ్రీ శ్రీయానందనాథులు

శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారి రచనలు సిద్ధముగనున్నవి:



| | | |
|---|---|---|
| 1. | సౌందర్యలహరి | 0-12-0 |
| 2. | శ్రీ సత్యనారాయణశర్మ సాధనము | 1- 8-0 |
| 3. | శ్రీ దేవీసూక్త పరమార్థము | 0-12-0 |
| 4. | భీమేశ్వరనుతి | 0- 8-0 |
| 5. | దేవపూజారహస్యము | 1-12-0 |
| 6. | శాస్త్రసాధనము | 0- 8-0 |
| 7. | మహాసౌర మంత్రపాఠము (సస్వరము, ఆంధ్రపద్య, ఆంగ్ల గద్యానువాదము) | 0-12-0 |
| 8. | అమ్మతో ముచ్చటలు 1, 2 భా. లు. | 1- 8-0 |
| 9. | నే నెవరు ? (కర్త) శ్రీ శ్రీయానందనాథులవారి శిష్యుడు శ్రీ మన్నికంటి వేంకటసత్యనారాయణశర్మ | 0-12-0 |



కొలది ప్రతులే గలవు.

## రాబోవునవి:

1. శ్రీ సిద్ధాంతశిఖామణి వివరణ (వీరశైవ గ్రంథరాజము) తయారగుచున్నది.
2. శ్రీ విద్యాంధ్రభాష్యము
3. సప్తశతీ (చండీపాఠ) తత్త్వసారము
4. సప్తశతీ (చండీపాఠ) విపులాధ్యాత్మికా వివరణము
5. రుద్రకోటీశ్వర శతకము
6. హ్రీంకార శతకము

---

ప్రతులకు: సాధన గ్రంథ మండలి, తెనాలి.



పూర్వతరములగు శాస్త్ర గ్రంథములకును గీతాగ్రంథమునకును గల ప్రభేదమేమి ? గీతల వైశిష్ట్యమేమి ? గీతలకు పూర్వము యోగ జ్ఞాన భక్తి సంప్రదాయములను పూనికతో అవలంబించినవారు లేకపోలేదు. కాని వారు పరస్పరము వైరుద్ధ్యమును వహించి స్వమత శ్రేష్ఠతనే యుపపాదించు చుండిరేకాని, ఎట్టి సమన్వయ ప్రయత్నమును ఒనర్పరైరి. గీతాకారుడే ఈ సంప్రదాయములను సమన్వితమొనర్ప ప్రథమ ప్రయత్నమొనర్చెను. తత్కాలమున నెలయుచుండిన సంప్రదాయము లన్నిటినుండియు ముఖ్యములగు విషయములను గ్రహించి గీతాసూత్రమున గూర్చెను.

వివేకానందస్వామి

